



సంపుటి:3 సంచిక:10

నవంబర్ :1980


## ఈ నెల సమగ్ర నవల

"అడవిలో అమాయకంగా బతికే జింకలకి వాడి కొమ్ములుండాలి. తోటలో తెల్లగా బతికే వెర్రిముండా పావురాలకైనా ఉక్కుముక్కులుండాలి. పెరట్లో గంతులేస్తూ తిరిగే కుందేళ్ళకయినా పరమ విషపు కోరలుండాలి. ఓట్లు వెయ్యటానికి తప్పించి ఇంకెందుకూ పనికిరాని ప్రజలందరూ ఆత్మరక్షణ కోసం విచ్చుకత్తులు పట్టుకుని తిరగాలి. స్త్రీలందరి దగ్గిరా మిషన్‌గన్లుండాలి" అని ఆవేశంగా ఆ పోలీసాఫీసరు మొహం మీదనే అందామె.

ఆమె వ్యక్తపరిచిన అంతటి ఏహ్యభావానికి అసలు కారణం ఏమిటి ?

ఏ అనుభవాలు ఆమెలో అంతటి క్రోధాగ్నిజ్వాలల్ని, ఆవేశాన్ని రగిల్చేయి ?

"ప్రజల్ని రక్షించి, శాంతి భద్రతల్ని కాపాడే పోలీసు వుద్యోగుల అక్రమాలకూ, అన్యాయాలకూ, అధికార దుర్వినియోగాలకూ తెర వెనుకగల మూలకారణాలేమిటి ?

## ఖాకీవనం

లో గంజాయి మొక్కలతో పాటు తులసి మొక్కలు కూడా ఉన్నాయంటూ వారి ద్విముఖ జీవితానికి దర్పణం పట్టి, సమర్థవంతంగా

**కె.ఎన్.వై.పతంజలి**

చిత్రించిన

నవల 'ఖాకీ వనం ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం : జగ్ మోహన్

రెండవ కవరు : సూరజ్. ఎస్. శర్మ

మూడవ కవరు : గీతాదత్త

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.

# స్వర్గానికి రాచబాట

అడవిలో క్రొత్తవారు బాట తప్పడం పరిపాటి. అదీ అర్ధరాత్రిలోనైతే సరేసరి. ఎంచేతనంటే, అడవి అంతా ఆవరించిన వెన్నెల వెలుగుల్లో ఎన్నో దారులు కనుపిస్తాయి. అమావాస్య కటిక చీకట్లు అలుముకొంటే కన్ను పొడుచుకున్నా కానరాదు మన దారి. అలాగని చెప్పి మనం ఏ దారినబడితే ఆ దారినపోతే గమ్యం చేరలేము సరిగదా, గచ్చ పొదల్లో చిక్కుకుపోతాం. పోనీ, తెలివితేటల సాయంతో ఊహించి ఉరకలేస్తే ఊరు చేరలేం సరికదా, ఊహాపథంలోనే ఊయల ఊగుతుంటాం వెనక్కూ ముందుకూను. అనక గమ్యం అగమ్య గోచరం.

అట్లావుతే వెళ్ళేవాళ్ళంతా దారి తప్పుతున్నారా అంటే లేదు. సరైన దారి తెలిసిన వాళ్ళు కొందరుంటారు. వాళ్ళు సరాసరి గమ్యం చేరుకొంటారు.

ఇంతకూ చెప్పొచ్చిందేవిటంటే, మతాలన్నీ ఒకటే, అన్ని మార్గాలూ మోక్షానికే ! అట్లాంటప్పుడు ఏ మార్గమైతేనేం స్వర్గం చేరేందుకు అనేది మన దేశ వ్యాప్తంగా ప్రబలిపోయిన సనాతన సహజ వేదాంతం.

కానీ పాపపు కారు చీకట్లు అలుముకు పోయిన అడవిలాంటి ఈ ప్రపంచంలో పయనిస్తున్న మనం, మన స్వగృహానికి, అంటే స్వర్గానికి పోవాల్సిన బాటసారులం. కనుక మనం పయనిస్తోంది స్వర్గమార్గమో కాదో మనం తెలిసికోవడం మహా అవశ్యం. "ఏదో ఓ మార్గం పోనిద్దూ" అంటూ సర్దుకొంటుంటే అది మహా ప్రమాదం. ఎంచేతనంటే అలా సర్దుకొంటూ అనుకూలంగా ఉన్న ఏదో ఓ బాటలో కాలు పెడితే,మళ్ళీ అంతలోనే అది అంతమై నీ అంతరంగంలో అశాంతి, అలజడి సృష్టిస్తే-అటు గమ్యమూ చేరలేక ఇటు వచ్చిన త్రోవా కానలేక అడవిలోనే, అజ్ఞాన అంధకారంలోనే గిరగిరా బొంగరంలా తిరుగుతుంటావు. బాట తెలియని బాటసారులమవుతాం.

అందుకే ఓ బాటసారీ ! ఈ మాట విను ఓ సారి "స్వర్గానికి బాటను నేనే. ఆ మాటకొస్తే నేనే మార్గం, సత్యం, జీవం" అన్నాడు మానవుడి కోసం స్వర్గానికి రాచబాట వేసిన యేసు దేవుడు. ఆ పరమాత్ముడు యేసు ప్రభువు చెప్పిందెంత వరకు సత్యం అనే విషయంలో ఓ నిర్ధారణకు రావాలంటే ఆయన ప్రబోధాలను నిష్పాక్షికంగా, నిస్వార్థంగా, నిర్మల మనసుతో న్యాయబుద్ధితో పరిశీలించు. ఆయన దివ్య స్వరం ఆలకించు. అనంత సంతోషం అనుభవించు.

డా॥ ఎస్. జాన్ డేవిడ్,
ఎ. ఎం. జి. ఇండియా,
వార్తాపత్రికల శుభసందేశాలు,
పోస్టుబాక్సు నెం. 1820,
ముషీరాబాద్,
హైదరాబాద్ – 500 020.
ఆంధ్రప్రదేశ్.

# మందు

"మీరు డాక్టరు దగ్గరకెళ్ళి చూపించుకున్నారా సరేసరి, లేకపోతే పచ్చి మంచినీళ్ళు ఈరోజునుంచీ ముట్టను" మా ఆవిడ ఘోర ప్రతిజ్ఞ చేసింది.

నా కాళ్లలో వణుకు బయలుదేరింది. మా ఆవిడ పొరపాటున కూడా ఆడి తప్పదు. నాకేమో డాక్టరు వద్ద కెళ్ళాలంటే ప్రాణం పోతుంది. అందుకే చాలా రోజులబట్టీ ఒంట్లో బాగుండకపోయినా డాక్టరు ముఖం చూడలేదు. నాకు చెప్పి చెప్పి ఆవిడ నీరసించిపోయి చివరి అస్త్రం ప్రయోగించింది.

మర్నాడే డాక్టరు ముకుందరావు వద్ద కెళ్ళాను. ముకుందరావు నిజంగా డాక్టరు కాదు. కాంపౌండర్ చేసి చేసి ఆ అనుభవంతో తానే ఓ డాక్టరయిపోయాడు. డాక్టరుచదవకపోయినా అందరూ డాక్టరు గారూ అనే పిలుస్తారు. ముకుందరావు నా కెప్పటినుంచో తెలుసు. 'ఒరే, అరే' అని పిలిచే చనువు మా మధ్య వుంది. చాలామంది పాలిట వాడు డాక్టరు కావటం, వాడి హస్తవాసి మంచిదని పేరు గడించటంతో నేను వాడివద్దకే వెళ్ళాను.

"ఏమిటి దారి తప్పి వచ్చావ్! ఇది ఇల్లు కాదు క్లినిక్" బల్లమీద పడుకున్న పేషంట్‌ని అవతలికి పంపి నన్ను పలకరించాడు.

"దారి చూసుకుంటూనే వచ్చారా బాబూ! ఈమధ్య లేస్తే కళ్ళు తిరగటం, నడిస్తే అలుపు, తినకపోతే ఆకలి, తింటే అరక్కపోవడం. అందుకే వచ్చాను. ఇదిగో ఈ నా శరీరం నీ చేతిలో పెడుతున్నాను. ఏం చేస్తావో నీ ఇష్టం. కాని మందులు మాత్రం ఎక్కువ రాసివ్వకు. అవంటే నాకు ఎలర్జీ" అన్నాను.

ముకుందం నా మాటలన్నీ గౌరవంతో విని అడ్డమైన ప్రశ్నలూ వేసి బొటనవేలు నుంచి నడినెత్తిదాకా పరీక్ష చేసి "ఊం రోగం బాగా ముదరబెట్టుకు వచ్చావ్! గట్టిగా రెణ్నెల్లు మందు తినాలి. ప్రతి రోజూ పరీక్షకు యూరిన్ పట్టుకురావాలి. రోజూ బి.పి. చూపించుకోవాలి. రోజుకు మూడుసార్లు టెంపరేచర్ చూసి నోట్



చేయాలి. నే యిచ్చే మందు విడవకుండా తాగాలి. అలా అయితేనే నేను నీకు ట్రీట్ చేస్తాను" అన్నాడు.

మా ఆవిడ ప్రతిజ్ఞ గుర్తుకొచ్చి బుర్ర తాటించాను.

"గుడ్" అంటూ భుజం తట్టాడు ముకుందం.

ఆ రోజునుంచీ నేను ప్రతిరోజూ ముకుందాన్ని దర్శిస్తూనే వున్నాను. ముకుందం క్లినిక్ పేషంట్స్‌తో కిట కిటలాడుతుండేది. ప్రతివాళ్ళూ రోగం తగ్గిం





దని చెప్పి ధన్వంతరి అంటూ ముకుం దాన్ని మెచ్చుకునేవారే !

రెండు నెలలూ అయింది. నా నీరసం, నా వ్యాధి చేత్తో తీసేసినట్లుపోయింది. ఇదే మాట ముకుందంతో చెప్పి "ముకుందం! ప్రతిరోజూ మందిచ్చావ్, మన స్నేహం స్నేహంగానే వుండనియ్యి. మందుకెంతయిందో బిల్లివ్వు. అవునూ అదేం మందురా! రోజూ ఒకే రకం ఇచ్చావు?" నాకున్న చనువుతో అడిగాను.

ముకుందం నసిగాడుగాని మందేమిటో చెప్పలేదు. గట్టిగా అడిగాను. చివరికి నానుస్తూ అసలు విషయం చెప్పాడు.

"ఒరేయ్! నీకు తియ్యని మందిచ్చినా తాగవు.అలాంటిది నే ఏ ఔషధంఇచ్చానో చెబితే తాగుతావటరా! అందుకే నిజం దాచాను. రోజూ సీసాతో మూత్రం తెమ్మని చెప్పేవాడిని కదా! ఆ నీ మూత్రాన్ని మందు సీసాలో పోసి 'మందు'గా నీకిచ్చాను. మూత్రాన్ని మించిన దివ్య ఔషధం ఈ ప్రపంచంలో మరొకటి లేదురా! ఎవరి మూత్రం వారు అరవై రోజులు అంటే సరిగ్గా రెండు నెలలు ఏ రోజుది ఆరోజు తాగితే చాలా రోగాలు నయమవుతాయి. నేను నీ కోసం పైసా మందు వాడలేదు. నీ మూత్రమే నీకిచ్చాను. పోతే శాంపిల్స్‌గా వచ్చిన టాబ్లెట్లు రోజూ రెండిచ్చాను" అన్నాడు నవ్వుతూ.

అంతా విని "నిజమా!" అన్నాను.

"నిజం" అన్నాడు ముకుందం.

"మరి...మరి..."

"ఏంటిరా మరి మరి. విషయం చెప్పు"

"మందంటే నాకు అసహ్యమని నీకు తెలుసుగా! మా ఆవిడ బలవంతంతో నీ దగ్గర కొచ్చాను. కానీ నీవిచ్చిన మందు ఇంటికి తీసుకెళ్తూ దార్లో పారబోసేవాడిని. ఒక్కరోజూ తాగలేదు. ఆ టాబ్లెట్లు మాత్రం రాత్రిళ్ళు బీరు తాగేటపుడు మింగేవాడిని"

"ఆ...?" అని నోరు తెరిచి అలా వుండిపోయాడు ముకుందం.

—కురుమద్దాలి విజయలక్ష్మి

# దండగ పెండేరం

సంతాప సభావేదిక మీద కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు కవిశ్రీ



తాను మహాకవినని ఓ పెద్ద అనుమానం పట్టుకుంది. చిన్నప్పటి నుంచి కృషీవలలుడిలా అక్షరాలతో కుస్తీ పడుతూనే ఉన్నాడు. పుంఖాను పుంఖంగా రాసేస్తూనే వున్నాడు. ఏళ్ళు గడుస్తున్నా జనం కవిశ్రీని గుర్తించకపోగా— సాహిత్యగూండా, సాహిత్యరౌడీ, సాహిత్య రావణ లాంటి తమకు తోచిన ముద్దు పేర్లన్నీ పెట్టి పిలవసాగారు.

# శుభ్రమైన తాజా శ్వాస...
# ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు



## కోల్గేట్
దెంటల్ క్రీమ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంటే, కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అది ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనం కాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని ద్రవ్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉంటున్న నమ్మకం, దంతక్షయంనుంచి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

**నోటి దుర్వాసనను ఆపండి...**
**కోల్గేట్ దెంటల్ క్రీమ్‌తో**
**దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

కవిశ్రీ మనసు నిండా ముసురు పట్టు కుంది. రేపు తనూ చస్తే ఇలాంటి సంతాప సభ కనీసం ఒక్కటైనా తన కోసం ఏర్పాటవుతుందా? ఏర్పాటవా లంటే ఎలా? నోబుల్ ప్రైజు రాకుంటే మానె కనీసం తనకో జ్ఞానపీఠ అవార్డు అన్నా రాకపోతే తన సంతాప సభ ఎవరు జరుపుతారు? ఇవ్వాళ్టి సంతాప సభ వేదిక మీద కుర్చీ సంపాదించటానికే ఎంతో కష్టపడితేగాని పడనివ్వలేదు నిర్వాహకులు.

ఈ సువర్ణవకాశాన్ని పోనివ్వదల్చు కోలేదు కవిశ్రీ. ఈలోగా మైక్‌లో ఇప్పుడు శ్రీ కవిశ్రీగారు మాట్లాడతా రన్న ఎనౌన్స్‌మెంట్ వినిపించింది.

కవిశ్రీ మహా కవిలా మైక్ ముందు కొచ్చి నిల్చున్నాడు. ఉపన్యాసం మొదలు పెట్టాడు—"దేశంలో చాలామంది మహా కవులున్నారు...... నేనూ వున్నాను. కాళిదాసు, దండి, భాణభట్టు, నేనూ ఒక కోవలోని వారమే" అంటూ ప్రారంభిం చాడు.

జనంలోంచి "ఎలా? ఏ విధంగా?" అని ఎవరో ప్రశ్నించారు.

కవిశ్రీ నోరు విప్పబోతుండగా సమా ధానం కూడా సభలోంచే వచ్చింది "ఎలాగంటే......వాళ్ళు చచ్చిపోయారు ఈయన చావబోతున్నాడు" ఇది విని సభనిండా సోడాబుడ్లు పగులుతున్నట్లు నవ్వులు—

కవిశ్రీ కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగినై.

"లోకులు కాకులు పలుగాకులు-హుం..." అనుకుని వేదిక దిగి ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ రాత్రల్లా నిద్రలేదు. చివరికి తెల్లవారుఝామున ఓ మాంచి ఉపాయం తట్టింది. కవిశ్రీకి పులి నెక్కినంత బలం వచ్చింది. వెంటనే ఉపాయాన్ని ఆచరణలో పెట్టేశాడు.

కొంతమంది మిత్రుల్ని పోగేసాడు తను అంతవరకు ఉద్యోగం చేసి కూడ బెట్టుకున్న పదివేలు వాళ్ళకిచ్చి తనకో సన్మానం ఏర్పాటు చేయమన్నాడు. ఈ విషయం మరో చెవికి తెలియకూడదని చెబుతూ — సన్మానానికి ఒక వెయ్యి మాత్రమే ఖర్చుపెట్టి మిగతా తొమ్మిది వేలతో ఒక గండపెండేరం చేయించి తనకాలికి తొడగమని బతిమాలుకున్నాడు. అలా చేస్తే సన్మానానికి సన్మానం జరుగు తుంది, తన డబ్బు తనకు మిగిలి పోతుంది. అప్పుడైనా తనను మహాకవిగా గుర్తించకపోరా! 'లోకులు కాకులు పలుగాకులు' అనుకున్నాడు.

కవిశ్రీగారి సన్మానం ఆయన ఫొటోలు ముద్రించిన పాంప్లెట్లతో, ఒక మినీ సావెనీర్‌తో, గండపెండేరంతో, పూల మాలలతో జరిగిపోయింది.

ఆరు మాసాలు గడిచాయి. ఈలోగా కూతురి పెళ్ళి వచ్చింది. డబ్బు కావాలి. వెంటనే ట్రంకు పెట్టెలో భద్రంగా దాచిన గండపెండేరాన్ని బయటకు తీశాడు. కవిశ్రీ.

అంతే! కవిశ్రీ నోరు గుహలా తెరుచు కుంది—నల్లగా మెరుస్తున్న స్వర్ణ కంకణం పుచ్చుకుని కంసాలి దగ్గరకు పరుగెత్తాడు. అతనేమో ఒక్కక్షణం పరిశీలించి ఇది రాగిది. పైన గోల్డ్ కోటింగు వేశారు అని తేల్చాడు. కవిశ్రీ లబలబ లాడి పోయాడు. ఆరోజు తన కాలికి గండ పెండేరం తొడుగుతున్నప్పుడు సభలోంచి



"దండగ పెండేరం...దండగ పెండేరం" అన్న గుసగుసలు ఇప్పుడు గుర్తుకొచ్చి వాటి భావం ఇప్పుడు అర్థమయి మళ్లీ మళ్లీ ఏడ్చాడు.

— గౌస్

# సెలవు

అప్పారావుకు అప్పులు చెయ్యడమంటే మహా ఇష్టం. పలకరించిన వాడిని వదల కుండా పదో, పరకో అప్పు గుంజు కోవడం అతనికి అలవాటు. ఆఫీసులో అంతా అప్పారావు బాధ పడలేక తప్పిం చుకు తిరగడం మొదలు పెట్టారు.

అప్పారావు లంచ్ అవర్‌లో తన సీటువైపు రావడం చూసి గతుక్కు మన్నాడు చక్రి. విసుగ్గా మొహం పెట్టి "ఏం కావాలి ?" అని అడిగాడు.

"ఏం లేదు. అవసరంగా కావాలి. పాతిక రూపాయలుంటే అప్పివ్వు. మేనే జర్ పీనుగ సెలవు ఇవ్వగానే మా ఊరు వెళ్ళి, డబ్బు తెచ్చి మీ కివ్వవలసింది ఇచ్చే స్తాను!" అన్నాడు అప్పారావు.

"ప్రతిసారీ ఇలాగే అంటున్నావ్! ఇప్పటికే వంద రూపాయలు పైగా ఇవ్వాలి. అసలు నువ్వెప్పుడు సెలవులో వెళతావ్?" కోపంగా అడిగాడు చక్రి.

"నేనేం చేసేది? ఆ మేనేజర్ వెధవ సెలవు ఇవ్వనంటున్నాడు. ఇవ్వగానే వెళ్ళి తెచ్చిస్తాను"

చక్రి అయిష్టంగానే పాతిక రూపా యలు తీసి ఇచ్చాడు. అప్పారావు హుషా రుగా ఈల వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

రెండు నెలలు గడిచాయి. అప్పారావు సెలవులో వెళ్ళనూ లేదు, డబ్బులు తెచ్చి ఇవ్వనూ లేదు.

చక్రికి సహనం పోయింది. ఒకరోజు నిలేసి అడిగాడు– "అసలు నువ్వెప్పుడు సెలవులో వెళతావ్ ?"

"మేనేజర్ సెలవు ఎప్పుడిస్తే అప్పుడు వెళతాను"

"సెలవు కావాలని నువ్వు అసలడి గావా?"

"ఆ! ఆరు నెలల కిందటే అడిగాను. వీలు కాదంటున్నాడు" చెప్పాడు అప్పా రావు.




అప్పారావుకు అప్పులు ఇచ్చినవాళ్ళంతా మాట్లాడుకొని, సాయంత్రం మేనేజర్ దగ్గరకు వెళ్ళి, "మీరొక్కరోజు అప్పా రావుకు సెలవిస్తే మా కష్టాలు గట్టెక్కు తాయి" అని ప్రాధేయపడ్డారు.

మేనేజర్ వాళ్ళు చెప్పినదంతా విని, "నిజమేనయ్యా! నేనేం చేసేది? అప్పా రావు నాకు అయిదు వందలు ఇవ్వాలి. అవి ఇస్తేగాని సెలవు గ్రాంటు చెయ్యనని చెప్పాను" అన్నాడు విసుగ్గా.

అంతా నోరెళ్ళబెట్టారు.

— కృష్ణచైతన్య




# మదిలో ప్రియ మెదిలేదెప్పుడు?

## ఎల్ల వేళలా...

ఉదాహరణకు అల్పాహార సమయంలో...

నోరూరించే 'ప్రియ' టొమాటో, అల్లం పచ్చళ్లు మీరారగించే అల్పాహారానికి సరికొత్త రుచులను సమకూరుస్తాయి. ఇడ్లీ, దోసె, పకోడీ, సమోసా, బజ్జీ, గారె... ఏదయినా సరే – 'ప్రియ'తో జోడించండి. ఆ రుచి అపూర్వం.

మామిడికాయ, నిమ్మకాయ, గోంగూర, అల్లం, టొమాటో...

అన్నీ మీకు నచ్చే పచ్చళ్లే. తెలుగు నేల నాలుగు చెరగులా గాలించి తెచ్చిన పళ్ళూ కాయలకు తగుపాళ్ళలో మసాలాలు మేళవించి, అధునాతన కర్మాగారంలో, పరిశుభ్రమయిన వాతావరణంలో తయారయిన పచ్చళ్లివి.

మీ 'ప్రియ'ను ఈ రోజే కొనండి. మీరు వెచ్చించే ప్రతి రూపాయికి మించిన కమ్మదనాన్ని చవి చూడండి.

తయారుచేయువారు:
**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్
కోరంకి, కృష్ణాజిల్లా.



Marketed by
**Margadarsi Marketing**
PRIVATE LIMITED
Eenadu Compound, Somajiguda
Hyderabad-500 004



ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ

KIRON/PF/80/9/TEL

# పొదుపు

సేవింగ్స్ ఆఫీసర్‌గారు ఆ సాయంత్రం సన్నకారు రైతుల్ని, కూలీ నాలీ జనాన్ని కూడగట్టుకొని మీటింగు పెట్టాడు.

పొదుపు గురించి కాన్వాసింగు చేయడంలో ఆయనకు సాటి ఎవరూ రారు. చాక్లెట్స్ పంచిపెట్టినట్టు చవులూరించేలా మాటలు చెప్పి డబ్బులు ఆదాచేయించగలడు. ఎన్ని లక్షలో గాని పొదుపు చేయించి ఆ జిల్లా రికార్డు బద్దలు కొట్టాడు. ఆయన మీటింగువిన్నవాడు పైస అయినా పొదుపు చేయకుండా ఉండలేడు.

పాంటు జేబుల్లో చేతులు నిగడదన్ని ఆయన ఉపన్యాసం ప్రారంభించాడు. ఎవరో ముందు కొచ్చి దండ వెయ్యబోయారు. "దండవద్దు. ఆ దండ అమ్మి ఆ డబ్బు పొదుపు చేయండి'' అన్నాడు. ఇంకెవరో కాఫీ ఇవ్వబోయారు. ''అప్పే అది తాగే బదులు నలభై పైసలు వెనకెయ్యొచ్చు'' అన్నాడు.

గొంతు సవరించుకొని

"సోదరులారా తిండి, నీరు, గాలి ఎంత ముఖ్యమో పొదుపు కూడా అంతే.

ఇవాళ మీరు వెనకేస్తే రేపు మీ పిల్లలు ముందు కొస్తారు. ఇవాళ సొమ్ము మీది కాదనుకుంటే రేపు మీరు హాయిగా వాలు కుర్చీలో పడుకోగలరు. ఆ డబ్బు రెట్టింపై మీ కాళ్లదగ్గరకొస్తుంది. ఎన్నో అవసరాలని ఆదుకుంటుంది. మీ వైద్యానికి, పిల్లల చదువులకి, పెళ్ళిళ్ళకి వార్ధక్యంలో ఆదుకుంటుంది.

ఇది గారంటీ. అసలు వడ్డీతో కలిసి చెక్కపెళ్ళలా మీ ఒళ్ళో పడుతుంది. దీనికినలతా, కలతా, తుపాన్‌దెబ్బలం, దొంగల బాధ లేవు. మీ అసలు ఆకర్షణీయమైన వడ్డీతో కలిసి రెండింతలై మూడింతలై మీ సహనాన్నిబట్టి పెరుగుతుంది. మీ అవసరాలు ఆదుకుంటుంది. కాబట్టి మీరంతా......''

అంటూ సేవింగ్స్ ఖాతా, రికరింగ్ డిపాజిట్, ఫిక్సిడ్ డిపాజిట్, రీఇన్వెస్టుమెంట్ ప్లాన్లు ఎన్నెన్నో అంకెలతో సహా వివరించాడు. "సందేహాలుంటే అడగండి'' అన్నాడు.

ఎంతో ముచ్చటగా విని ముగ్ధుడైన ఓ రైతు నిలబడి యిలా అడిగాడు-



అయ్యా! ప్రభుత్వం మాకు యిత్తనాలకి, పురుగుమందులకి, ఎరువులకి, కరువులకి యిదాలిస్తంది గందా! మరి యింత సక్కటి కార్యక్రమానికి కూడా యిదాలిస్తే మీదగ్గరే కొంత పొదుపు సేసుకొందుం గదా! అలా అని తమరు సిఫారస్ చెయ్యండి. మేము పొదుపు సేస్తం."

—సస్యశ్యామల రాణి

"ఒరే" అని పిలిచింది కొత్త ఎస్. పి. భార్య. సుందరయ్య తుళ్ళిపడి చూశాడు.

"ఇప్పుడే వస్తానమ్మగారూ అని చెప్పిన ఆ పనిలంజ అదే పోత పోయి నట్టుంది. ఈ దిక్కుమాలిన వూరిలో మరో ముండే దొరకలేదా మీక్కూ మీ అయ్యగారికి? దాని గుండెల మీద తన్ని తగిలేసి మరొదాన్ని తీసుకురండి... ఇదిగో చంటిది దొడ్డికి కూచున్నట్టుంది... కాస్త కడిగి..." అని చెప్పి అవిడ విస విస లాడుతూనే లోపలికి వెళ్ళిపోయింది.

సుందరయ్య కొయ్యబారిపోయాడు. దారల టోపీతో పాటు బుర్రకూడా వీధి వరండాలోనే జాగ్రత్త చేసి రానందు వల్ల పళ్ళ బిగువున కదిలి 'అమ్మగారు' చెప్పిన పని పూర్తి చేసి పెరటిలోంచి చుట్టూ తిరిగి వీధిలోకి వచ్చాడు.

సాయంత్రం అయినున్నర అయింది. ప్రహరీ గోడకు ఆనుకుని వున్న నీలగిరి చెట్టు కింద అర్డర్లీ కానిస్టేబుల్స్ నుంచొని వున్నారు. సుందరయ్య అక్కడికి చేరుకున్నాడు.

"ఈవిడగారికి ఒళ్ళంతా కొవ్వేనా బాబూ! పనిమనిషి రాలేదని పిల్ల ముండ ముడ్డి నాచేత కడిగించింది. అసలీ ఎస్.పి. నంజి కొడుకుని చెప్పుచ్చుకుని కొడితే అది పెళ్ళానికి బుద్ధొస్తుంది" సుందరయ్య చాలా కోపంగా మాట్లాడినప్పటికీ ఆ మాటలు ఇంటిలో వున్న 'అమ్మగారికి' 'చిన్నమ్మగారికి' వినిపించకుండా జాగ్రత్తపడ్డాడు.

అక్కడ నిల్చొని వున్న నలుగురి లోనూ ముగ్గురు సుందరయ్య కేసి జాలిగా చూస్తే నాలుగో కానిస్టేబుల్ మాత్రం పక పక నవ్వాడు. అతని కళ్ళు చిలిపిగా పెంకెగా మెరిసాయి.

"ఈ పద్ధతి మంచిదేనా పెద్ద బదరూ" అన్నాడతను ఎందుకయినా మంచిదని సుందరయ్యకు దూరంగా జరుగుతూ ... "ఇంట్లో ఎవరు లేకపోతే వాళ్ళ పని మనచేత చేయించుకోవటం మంచి పద్ధతే! రాత్రిపూట దొరగారు లేరనుకో అప్పుడా ఛాన్సు నీతే. అల్లుడు లేడనుకో ఆ ఛాన్సుమాత్రం నాది.మనిద్దరం లేకపోతే మరి వీళ్ళతే ఛాన్సు"

"నోరుముయ్... నోర్ముయ్...చోరి కుర్ర నాకొడకా! నీది నోరా పాయిఖానా దొడ్డా... ఏటా మాట్లేంటి.? ముందూ వెనుకా చూసుకోకుండా పీకలెగరిపోయీ మాటలనేస్తున్నావు... జాగర్త!" అని కంగారు పడ్డాడు అరసవిల్లి అనే ముసలి అర్డర్లీ.

సుందరయ్య ఇదంతా వినిపించు కోవటంలేదు. తన ఎడమ చేతి నుంచి ఇంకా దుర్గంధం వస్తున్నట్టు తోచిందతనికి. నిక్కరుకు చేయి రుద్దుకున్నాడు ఎటో చూస్తూ.

"పాత ఎస్. పి. పెళ్ళవే నయంరా బాబూ! అబ్బీ, అబ్బాయ్ అనైనా పిలిచేది. ఈవిడ వొరే గిరే అంటన్నాది.మరీ గోరం గుంది. కానిస్టేబుల్స్, అర్డర్లీలూ ఇంటి కాడ నౌకరోళ్ళనుకుంటున్నట్టుంది" అన్నాడు.

"రోలొచ్చి మద్దిలతో మొరపెట్టు కున్నట్టుంది నీ యవ్వారం. సి. ఐ. నీ, ఎస్. పి.ని కాకా పట్టడానికి ఇవ్వాళక్కడి కొచ్చి వొక్కపూటకే అయాస పడి పోతున్నావు. ఇరవై నాలుగ్గంటలూ ఇక్కడే ఏడుస్తున్న మేమెవరికి చెప్పు కోవాలి?" అన్నాడు ఓ అర్డర్లీ.

"నోరు మూసుకుని పూరుకోవడం

మంచిది. తప్పిదా? వదిలీదా! బూటు కట్టిన్నాడు పట్టిన ఈ శని సర్వీసున్నంత కాలమూ వొదలదు" అన్నాడు మరొకడు.

"అదిగదిగో నరిసింహంగాడూ, వజీరు సుల్తానూ బజారు జేసి వస్తున్నారు... వోరి నాయినా రెండు సంచుల్నిండా ఏటో తెస్తున్నారు. మనందరికి ఇవాళ భోజనా లిక్కడేనేమో" అన్నాడో ఆర్డర్లీ.

అతని మాటలు ముగియక ముందే గేటు తీసుకుని ఇద్దరు ఆర్డర్లీ కానిస్టేబుల్స్ లోపలికి వచ్చారు. ఇద్దరి దగ్గరా చెరో సంచీ వుంది.

"ఆర్రకాల చేపలు... దొరగారి పేరు చెప్పేసరికి ఫస్టుక్లాసయిన చేపలు ఎంచి మరీ ఇచ్చేరు. డబ్బులు తీసుకోమంటే దండాలు పెట్టి వొద్దనీసేరు..." అని ఇంటిలోకి కూడా వినిపించేటట్టు బిగ్గరగా అరుస్తూ చెప్పిన వజీరు "మహాతల్లి పది రూపాయలు చేతిలో పెట్టి ఆరురకాల చేపలు తెమ్మని పురమాయించింది. మళ్ళీ వాక్కో చేపా దొరగారంత వుండాలట. తల్లి మాలష్మి పేరు చెప్పుకుని బజారులో దండుకోవలసి వచ్చింది... వుందవలిసిన తల్లి.." అంటూ నెమ్మదిగా గొంతు తగ్గించి చెప్పి వజీరు ఇంటిలోకి నడిచాడు. నరసింహం మాట్లాడకుండా అతనిని అనుసరించాడు.

పాత పేపరు ఒకటి భోజనాల బల్ల మీద పరిచి, చేపల్ని దాని మీద వంచారు.

ఎస్.పి. భార్య శారదమ్మ ఆ చేపల్ని చూసి, "పది రూపాయిలకి ఇన్ని చేప లొచ్చాయట్రా?" అని ఆశ్చర్యపోయి, "మీ వూర్లో చేపలు ఇంత చవకన్నమాట. బావుందే.. ఈ లెఖ్ఖన రోజూ చేపలే తెచ్చుకోవచ్చు" అని సంబరపడింది.

ఆ ఇద్దరూ వినయంగా నవ్వేరు; "చేపలు చవక కాదమ్మగారూ... దొర గారికని తెలిసి వూరికే ఇచ్చారు. డబ్బు లసలు తీసుకోలేదు" అన్నారు.

శారదమ్మ కనుబొమలు ముడిచింది. "ఊరికినే ఇచ్చారా! ఎంత అపర్దిష్ట! మీకు డబ్బులిచ్చి చేపలు కొనుక్కు రమ్మన్నానుగానీ ఇలాగ బేవార్సుగా తెమ్మని చెప్పానా? మీరిలాంటి వెధవ పనులు చేస్తే దొరగారికి చెడ్డపేరొస్తుంది. ఆయన అసలే నిప్పులాంటి మనిషి. నేను కూడా అలాంటిదాన్నే."

ఆర్డర్లీ లిద్దరూ మాట్లాడలేదు.

"దొరగారి పేరు చెప్పి ఇంకా మీరేం తెచ్చారు? నిజం చెప్పండి."

"అదేవిటమ్మా అలాగనేస్తున్నారు? మేం అలాంటి వాళ్ళం కాదు.. దొరగారి పేరు చెప్పి తినేసే రకమయితే మమ్మల్ని డ్యూటీకే వేసేవాళ్ళు కాదు. పెదవారు మీరలాంటి మాటలు అనటం బాగులేదు."

"మీలాంటి వాళ్ళను నేను చాలా మందిని చూసేన్రా... జాగర్త! దొంగ వేషాలేస్తే వొప్పుకునేది లేదు. దొరగారి పేరు చెప్పుకుని ఎక్కడన్నా దండు కున్నట్టు తెలిసిందా మర్యాద దక్కదు. ఇలాంటి పరువుతక్కువ పని మళ్ళీ చెయ్యకండి.."

ఆర్డర్లీ లిద్దరూ తలవూపి బైటకు రావడానికి వెనక్కి తిరిగి నాలుగయిదు అడుగులు వెళారు.

శారదమ్మ చరచర నడిచివచ్చి గుమ్మంలో నిల్చుంది. "పెద్ద నిజాయితీ పరుల్లాగ కబుర్లాడారూ? నేనిచ్చిన పది రూపాయిలూ ఏవీ? నేను మరిచిపోతే చెక్కేద్దానికే కదా! నాకు తెలుస్రా మీ సంగతి.." అన్నదావిడ వెటకారంగా.



వజీరు నీరుకారిపోయాడు "నా దగ్గి రున్నాయమ్మగారూ! మరిచిపోయాను. నేనలాంటివాణ్ని కాదు. మీరు అంత మాటలు అనేసరికి నాకు మనసు పాడయి పోయింది. అందుచేత వెంటనే జ్ఞాపకం రాలేదు. ఇదిగోండి.. కక్కుర్తి పడ దలుచుకుంటే ఇందాక మీరు చెప్పినట్టు బైటే దండుకోవచ్చు. దొరగారి ఇంట్లో మోసం చెయ్యనక్కరలేదు.. ఇదిగోండి."

శారదమ్మ ఆ డబ్బులు తీసుకుని రెప్ప వెయ్యకుండా వజీరు వంక చూసింది– "నోరు మూసుకుని వినయంగా వుండటం నేర్చుకో.. నా దగ్గిర ఇంకెప్పుడూ లెక్చర్లివ్వొద్దు.." వజీరు నేలచూపులు చూశాడు.

శారదమ్మ ఒక్కక్షణం అక్కడే నిల్చుని తరువాత లోపలికి వెళ్ళి పోయింది.

ఆర్డర్లీ లిద్దరూ బైటపడ్డారు.

నరసింహం గుండెలు బాదుకున్నాడు

"అమ్మనాయిన.. అమ్మనాయిన ఈ యమ్మని తట్టుకోవటం మన తరంగాదు.. నిప్పులు చెరిగేస్తుంది. ఆ ముండా మొగుడు ఎలాగ వేగుతున్నాడోగాని గోరంగా నాయినా గోరం.."

వజీరు మాట్లాడలేదు. ఇద్దరూ నీలగిరి చెట్టు కిందకి నడిచారు.

అల్లంత దూరాన కారు హారన్ విని పించింది. "తీతిక.. అదిగో తీతిక కూస్తున్నాది..." అన్నాడో ఆర్డర్లీ బిగుసుకుపోతూ

అందరూ నాలుగువైపులకూ చరచరా సర్దుకున్నారు.

తిరపతి అనే ఆర్డర్లీ ఇంట్లోకి పరిగెత్తి 'దొరగారొచ్చేస్తున్నా'రని ప్రకటించి అదే వేగంతో బైటకొచ్చి పెద్దగేటు పూర్తిగా తెరిచాడు.

దర్పం వొలికిస్తూ 'దొరవారి' కారు లోపలికి ప్రవేశించి పోర్టికో గచ్చు మీద ఆగింది.

ఓ ఆర్డర్లీ కంగారుగా వెళ్ళి కారు డోరు తెరిచి పట్టుకున్నాడు.

ఎస్.పి. పార్థసారథి వెంట ఓ. గుర్రవంత కుక్క కూడా దిగింది.

సన్నకారు పోలీసులంతా 'దొరగారి'కి వందనాలు చేశారు. అయితే వారుగానీ, వారి కుక్కగానీ ఆ నమస్కారాలను పట్టించుకోలేదు.

ఇంటిలోనుంచి శారదమ్మా, కూతురూ వచ్చారు. పార్థసారథి చేతిలోని గొలుసు మరింత బిగలాగి పట్టుకుని, "ఎలావుంది కుక్క?" అని అడిగాడు.

"చాలా బాఫుంది అయ్యగారూ... సింహం లాగుంది" అన్నాడు ఓ ఆర్డర్లీ చురుకుగా.

పార్థసారథి ఆ ఆర్డర్లీ వంక విసుగ్గా, మందలింపుగా ఒక్కసారి చూసి తర్వాత కూతురి మీదకు తిప్పాడు చూపు.

ఆ ఆర్డర్లీ గుటకలుమింగి ఒక అడుగు వెనక్కి వేశాడు. "ఎలావుంది చిన్నా?" అని ఎస్.పి. కూతుర్ని అడిగాడు.

ఆ అమ్మాయికి కుక్కలంటే 'అసియ్యం'. అందులోనూ చెయ్యెత్తున్న ఆ కుక్కని చూసి ఆమెకు ఒళ్ళు జలద రించింది. కళ్ళూ, ముక్కూ చిట్లించి "ఛీ... దెయ్యంలాగుంది" అన్నది.

పార్థసారథి మొహంలోంచి చిరునవ్వు చిమ్ముకొచ్చింది.

"చాలా మంచి కుక్కమ్మా... ఎక్కడోగాని దొరకదు. జర్మన్ బ్రీడు.. ఇంట్లోకి పరాయివాడెవడన్నా అడుగు పెట్టాడా గొంతుముడి కొరికేసి చంపే స్తుంది. గొప్ప ఫాయిదా చేస్తుంది.." అన్నాడతను.

"ప్లీజ్ డాడీ.. దాన్ని చూస్తుంటేనె నాకు అసయ్యమేస్తోంది. మనకొద్దు డాడీ! ఇంటికాపలాకి మీ జవాన్లింతమందుండగా మనకి మళ్ళీ ఈ వెధవ కుక్కెందుకు డాడీ.."

'మమ్మల్ని కుక్కలతో పోల్చేవా చంటితల్లీ' అనుకున్నాడు ఓ ముసలి ఆర్డర్లీ.

"పూటకి ఈ కుక్కముండే కుంచెడు బియ్యం బుక్కేలాగుంది" అన్నది శారదమ్మ.

"నువు చెప్పు మమ్మీ.. బేబీ జడుసు కుంటుంది కూడా.. చూడు కుక్క ఎలా గుందో! దెయ్యపుముండ!"

"నిజవే.. చంటి పిల్లలున్న ఇంటిలో ఇలాంటి కుక్కలుండకూడదండీ.."

పార్థసారథి ఆలోచనలో పడ్డాడు.

ముసలి ఆర్డర్లీ అందుకున్నాడు–

 

మమ్మల్ని కుక్కతో పోల్చేరు అమ్మాయి గారు.."

పార్థసారథి కూతురికి ఈసారి ఆ మాటలు వినిపించాయి. ఆమె చిరునవ్వు నవ్వింది.

"డాడీ! ఫన్.. నా ఫ్రెండ్ ఒకతను పోలీసులకీ,కుక్కలకీ ఒక్కటే తేడా అని ఓసారి జోక్ చేశాడు. మెడకు బెల్టుంటే కుక్కట, నడుముకు బెల్టుంటే పోలీసుట"

పార్థసారథి నవ్వలేదు. కూతురుకేసి హెచ్చరిగ్గా చూశాడు. తరువాత కుక్క గొలుసు దగ్గరగా వున్న కానిస్టేబుల్‌కు అప్పగించి "దీన్ని అందాకా ఆ గేటుకు కట్టు.. కాసేపాగి పంపించేద్దాం" అన్నాడు

ముందు శారదమ్మా, ఆ వెనుక కూతురూ లోపలికి నడిచారు. వెనుక వెళ్ళిన పార్థసారథి వరండా దాటిన వెంటనే వున్న డ్రాయింగ్ రూములో సోఫాలో కూలబడ్డాడు. బూట్లు విప్పి వెనక్కి జారబడ్డాడు.

కూతురు చల్లటి మంచినీళ్ళు తిసుకొచ్చింది. అవి తాగి మెట్ల దగ్గిర ఖాకీ క్రోటన్ మొక్కల్లాగ నిల్చొని వున్న జవానుల వంక తిరిగాడు.

అతని చూపు అరసవిల్లి అనే ఆర్డర్లీ మీద పడింది.

"ఒరే! నువ్విలాగొచ్చి ఆ ఫోను తీసుకురా" అని చెప్పి మేజోళ్ళు కూడా విప్పుకున్నాడు.

వరండాలో వున్న ఫోను తీసుకొచ్చి పార్థసారథికి దగ్గరగా వున్న టీపాయ్ మీద పెట్టాడు అరసవిల్లి.

"టౌన్ డి.ఎస్.పి. ఇంటికి రింగ్ చేసి, నేను మాట్లాడతానని చెప్పు"

అరసవిల్లి గుండెల్లో రాయిపడింది. పదాలు ఆరి పోయాయి. లాఠీ కర్రలాగ బిగుసుకుపోయాడతను. టౌన్ డి.ఎస్.పి. ఇంటి టెలిఫోన్ నంబర్ అతనికి జ్ఞాపకంలేదు.

పార్థసారథి అరసవిల్లికేసి ఒక్కక్షణం చూసి "ముహూర్తం మంచిదిగాదని చూస్తున్నావా?" అని అడిగాడు వెటకారంగా.

"సర్...సర్..." అని అస్పష్టంగా గొణిగి రిసీవర్ చేతిలోకి తీసుకున్నాడు అరసవిల్లి. అతని మెదడు మొద్దుబారి పోయింది.

"ఏంరా! ఫోన్ చెయ్యడం కూడా రాదా నీకు?". రిసీవర్ ఎడమచేతిలోకి మార్చి, కాలు నేలకి ధన్‌మని కొట్టి శల్యూట్ చేశాడు అరసవిల్లి "నంబర్ మర్చిపోయాన్సార్..."

ఉగ్రుడయి పోయాడు ఎస్.పి. పార్థసారథి "బాస్టర్డ్...ఎవడ్రా నీకి వుద్యోగం ఇచ్చింది? పో...పోముందు... అవతలికి పో...పనికిమాలిన వెధవలంతా చేరేరు డిపార్ట్‌మెంట్‌లోకి..." అని తిట్టి ఫోన్‌తీసి నంబర్ తిప్పాడు.

డి.ఎస్.పి. కామేశ్వరరావు లైన్‌లోకి వచ్చాడు.

"కామేశ్వరరావ్...నేను.ఆ...కుక్కని పంపించేస్తున్నాను...థేంక్స్ వద్దులే...నో ...నో అదికాదు...ఇంట్లో నచ్చలేదు. పి.సి.ని పెట్టి పంపించేస్తున్నాను... ఇప్పుడే...తర్వాత...జాగ్రత్తగా విను రాత్రికి రెయిడ్స్ అరేంజిచెయ్... మొత్తం లంజలందర్నీ మూసేయాలి... నేను ఇక్కడున్నంతకాలం వ్యభిచారం అనే మాట వినపడకూడదు... తెల్సిందా. కాశీపతికి త్రీటౌన్ ఏరియా అప్పగించు ...వన్ టౌన్ నువ్వు చూడు. టు టౌన్

నేనే స్వయంగా చూస్తా ...సరేనా... రైట్..."పార్థసారథి ఫోన్ పెట్టేశాడు.

తరువాత ఒళ్ళు విరుచుకుని లేచి వరండాలోకి వచ్చి నిలుచున్నాడు.



గేటుకు కట్టివున్న కుక్క పోలీసు దర్పంతో సింహంలాగ నటిస్తోంది.

ముంగిటిలో ఖాకీ ముగ్గులా పరుచుకుని వున్నారు ఆర్డర్లీలు. వారిలో బలంగా కని పిస్తున్న సుందరయ్య మీద పడింది పార్థ సారథి చూపు. అతడిని రమ్మని సైగ చేశాడు.

సుందరయ్య రెండు మెట్లెక్కి శల్యూట్ చేశాడు. "ఈ కుక్కను తీసుకు వెళ్ళి కామేశ్వరరావు ఇంటికి అప్పగించు"

"యస్సర్"

"ఏ కామేశ్వరరావు?"

"సర్... టౌన్ డి. ఎస్. పి. దొర గారు సర్...". పార్థసారథి వెనక్కి తిరిగాడు

"సార్..." సుందరయ్య జంకుతూ పిలిచాడు. పార్థసారథి సుందరయ్య కేసి తిరిగాడు.

"దొరగారికి ఏమని చెప్పాలి సార్"

"ఫూల్...నువ్వేం చెప్పక్కర్లేదు... ఇచ్చేయ్ చాలు...జాగ్రత్త..." అని చెప్పి పార్థసారథి అంతఃపురంలోకి వెళ్ళి పోయాడు. అప్పటివరకూ 'దొరవారు' నిలిచిన చోటుకి సుందరయ్య శల్యూట్ చేసి వరండాలో బెంచీ మీదున్న చారల టోపీ అందుకున్నాడు.

బైటకు వచ్చి గేటుకు కట్టి వున్న కుక్కను భయంగా విప్పాడు.

ఆ కుక్క మొండితోకను ఒకసారి కదిపి వూరుకుంది.

* * *

యూనిఫాంలో వున్న సుందరయ్యా, యూనిఫాంలోలేని కుక్కా బయటికొచ్చారు.

మసకచీకటిలో, ఖాళీగావున్న రోడ్డు మీద సుందరయ్య కుక్కవెంట కాసేపు నడిచాడు.

ఖాళీ రిక్షా ఒకటి ఎదురయింది.

"వారే రిక్షా" అని నెమ్మదిగా పిలిచాడు సుందరయ్య. ఎదురుగాలిలో ఆ పిలుపు అందలేదేమోనని మళ్ళీ పిలిచాడు.

రిక్షా సుందరయ్య పక్కనే ఆగింది

"డి.ఎస్.పి. దొరగారింటి కొస్తావా?"

"రెండు రూపాయలు ఇప్పించండి బాబయ్యా."

"రెండ్రూపాయలా గాడిదగుడ్డా... కాఫీ డబ్బులిస్తాన్లే..."

రిక్షా కార్మికుడు మాట్లాడలేదు.

సుందరయ్య రిక్షాలో కూర్చుని గొలుసు పట్టుకొని కుక్కను లాగబోయాడు.

కుక్క ముందుకాళ్ళు రోడ్డుకి తన్ని పెట్టి కిందకు వంగిపోయి కదలనని మొరాయించింది.

సుందరయ్యకు నవ్వొచ్చింది. "ఇది రిక్షా కుక్క కాదులాగుందిరా ... కారు మరిగిన కుక్కలాగుంది..."

"నే నాలేను బాబయ్యా" అన్నాడు రిక్షా కార్మికుడు బెరుకుగా.

సుందరయ్య రిక్షా దిగి, కుక్కని బతిమాలి, దానినే ముందు రిక్షాలో ఎక్కించి తరువాత తాను కూచున్నాడు.

"పదనీరా... నే నెవడ్నో సరింగ చూశావా? సీకటిలో కాకీబట్టలు కనబడకపోయినా ఈ సంకలోఉన్న టోపీ కనబడలా? నోరుమూసుకుని పద... ఎస్.పి. గారి బంగ్లానుంచి డి.యస్.పి. గారి బసకు పోలీస్ జమాన్ని తీసికెళ్ళానికి డబ్బులడిగిన రిక్షావాడ్ని నిన్నేచూశాను...పద పద... కాఫీ డబ్బులు పారేస్తాన్లే..."

మూగరిక్షా మూలగకుండా కదిలింది.

డి.ఎస్.పి. బంగాళాలోని పోలీసు సేవకులు సుందరయ్యనూ, కుక్కనీ చూసి హాస్యమాడేరు-

"ఎనుబోతును నడిపించుకొస్తున్న యమధర్మరాజులాగున్నావు గురూ..."

అలా వెటకారించినవాడిని రెప్పపాటయినా చూడలేదు సుందరయ్య. "పోరా బక్క నాకొడకా"అని జవాబుచెప్పిలోపలి కెళ్ళి కామేశ్వర్రావుకి సెల్యూట్ చేశాడు.

"దొరగారింట్లో ఎవరికి నచ్చలేదురా ఈ కుక్క?"

"చిన్నమ్మాయిగారికిసార్.,..దెయ్యంలాగుందని ఆవిడ జడుసుకున్నారు"

"రక్షించింది... అన్నట్టు నువ్వు స్టేషన్ డ్యూటీలో ఉండేవాడివి గదా? ఆర్డర్లీ డ్యూటీకి ఎప్పుడేశారు?"

"లేదుసార్... త్రీటౌన్ పి.సీనే సార్... సాయంత్రంపూట పెద్దగా పని లేకపోతే మా అయ్యగారు ఎస్. పి దొరగారి ఇంటిదగ్గరకెళ్ళి పనేదయినా ఉంటే సాయం చెయ్యమన్నారు..."

"కాశీపతి మెహర్‌బానీ అన్నమాట... సర్లే! మీ స్టేషన్‌కి ఫోన్‌చేసి కాశీపతిగానీ, మూర్తిగానీ వుంటే నేను మాట్లాడతానని చెప్పు..."

సుందరయ్య ఫోన్‌చేశాడు.

"నేనే త్రీటౌన్ పోలీస్‌స్టేషన్ కానిస్టేబుల్‌ని మాట్లాడుతున్నానుబాబూ తమరెవరండి సార్?" అని అవతలినుంచి





వినిపించింది.

సుందరయ్యకు నవ్వొచ్చింది. "నేనూ త్రీటౌన్ పోలీస్ కానిస్టేబుల్‌నేగానీ... జోసెఫేనా? నేనూ సుందరయ్యను... కాశీ దొరగారున్నారా? డి.ఎస్.పి. దొర గారి బంగ్లానుంచి మాట్లాడుతున్నాను."

"సి. ఐ. దొరగారు ఇక్కడేఉన్నారు. మాట్లాడతావా?"

"ఇయ్యి... డి.ఎస్.పి. దొరగారు మాట్లాడతారు..." అని చెప్పి కామేశ్వరావుకేసి చూశాడు సుందరయ్య.

కామేశ్వర్రావు కుక్కతో సంప్రదింపులు జరుపుతున్నాడు. ఫోన్ చెవి దగ్గర పెట్టుకునే మౌత్‌పీస్ మూసి కామేశ్వర్రావుని పిలిచాడు సుందరయ్య.

ఈలోగా "గుడీవెనింగ్ సార్" అన్నాడు అవతలినుంచి సి.ఐ. కాశీపతి.

సుందరయ్య సిగ్గుపడిపోయి "నేన్సార్ పీ.సి. సుందరయ్యను... ఒక్కక్షణం... డి.ఎస్.పి. దొరగారితో మాట్లాడండి..."

"సుందరయ్యా! నువ్వెక్కడెందుకున్నావు... నిన్ను ఎస్.పి. దొరగారి బంగళాకి వెళ్ళమనలేదూ?"

"సార్... ఎస్.పీ. దొరగారి పనిమీదే ఇక్కడికి వచ్చేను సార్...."

"సరే... నువ్వు పది అయ్యేసరికి స్టేషన్‌కిరా... ఫోన్ దొరగారికి ఇవ్వు..."అన్నాడు కాశీపతి.

సుందరయ్య వినయ విధేయతలతో ఫోన్ కామేశ్వర్రావుకి అందించి, సెల్యూట్‌చేసి బైటకు నడిచాడు. ఇరవై నిమిషాల్లో అతను పోలీస్ లైన్సులోని కొంపకు చేరుకొన్నాడు.

లైన్సులో చివర పెద్దగొడవ జరుగుతోంది. తిట్లూ, శాపనార్థాలూ వినిపిస్తున్నాయి. అటువైపు చూసి మొహం చిట్లించి సుందరయ్య తన ఇంటిలోకి అడుగుపెట్టేడు.

అయిదు నిమిషాల్లో అతను బట్టలు మార్చుకుని చీకటిగా, చిత్తడిగా వున్న పెరటిలోకి సబ్బు, తుండూ తీసుకొని వెళ్ళాడు. సబ్బు రుద్దుకుంటున్నపుడు అతనికి హఠాత్తుగా ఎస్.పి. మనవరాలూ, భార్యా జ్ఞాపకం వచ్చారు.

కాండ్రించి ఉమ్మాడు.

దీనమ్మా ఉజ్జోగం... దిక్కుమాలిన ఉజ్జోగం. ఊరందర్నీ ఒరే గిరేఅనడం... ఆఫీసర్ నా కొడుకుల దగ్గర తోక వూపటం... జీహుజూర్ బతుకు... ఆఫసర్ల ఇళ్ళలోని ఆడముండలకీ అనువే...కాశీలంజకొడుకుని చెప్పుచ్చుకు కొట్టాలి.. లంజకొడుకు స్టేషన్‌లో పని లేకపోతే పోయె, ఎస్.పి. గాడి ఇంట్లో తోటపని చెయ్యమంటాడు... ఎప్పుడో ఓనాడు సాలొస్తాది... ఎదవబతుకు... అప్పుడు ఈ యన యూనిఫారానికి నిప్పెట్టి టోపీని అందులో పడేస్తాను... అది మాత్రం ఖాయం...' అనుకున్నాడతను.

తలకి కూడా నీళ్ళుపోసుకున్నాక అతని పోలీసు వైరాగ్యం చాలావరకు మాయమయింది. పాలిష్ రాసిన పాతబూట్లు బ్రష్ తుడుపుకి జిగజిగ మెరిసినట్టు ఒళ్లు తుడుచుకున్నాక సుందరయ్య మామూలు పోలీసయ్యాడు. భోజనంచేసి ఇంటి యజమాని హోదాలో కాసేపు కాలుమీద కాలు వేసుకొని సిగరెట్ కాల్చుకున్నాడు. వాచీ చూసి ఇంకా టైముందని గమనించి కాసేపు పెళ్ళాం, పిల్లల్ని గదమాయించాడు.

తొమ్మిదిన్నరయి నతరువాత చాకింటి నుంచి వచ్చిన చలువ యూనిఫారం వేసు

కొన్నాడు. బూట్లకి కాస్త బ్రష్ కొట్టి తొడుక్కున్నాడు. గోడ బీరువాలోంచి చౌకరకం సెంటుసీసా తీసి అంటీ అంటనట్టు పూసుకున్నాడు.

భర్త తీరు గమనించిన వరలక్ష్మికి ఒళ్ళు మండింది.

"సానికొంపల మీదికి రెయిడు కు వెళుతున్నారా?" అని అడిగింది ఆవిడ అకస్మాత్తుగా.

ఒక్కక్షణం బిత్తరపోయిన సుందరయ్య చిరునవ్వు నవ్వి, "నీ కెందు కొచ్చిందా అనుమానం? సెంటురా సేననా? బట్టలు చలికంపు కొడతున్నాయి. అందుకు రాసేను సెంటు... అయినా ఆఫీసు విషయాలన్నీ ఆడోళ్ళకి చెప్పవలసిన అవసరం ఏముంది?" అన్నాడు.

"నా మొకం ఆఫీసు... పగలా, రాత్రా? పండుగా, పబ్బమాళినావల్లకాడా? ఆహా, శలవా, వేళకి డ్యూటీయా? ఒక సంతోషవా, సంబరవా? మా అయ్యకి బుద్ధిలేకా, దిక్కులేకా నన్నీ పోలీసు సంసారంలోకి తోసేసేడు..." వరలక్ష్మి ప్రారంభించింది.

సుందరయ్య కంగారుపడ్డాడు. "తరువాత తిట్టుదుగానిలే..." అంటూ ఉరుకుల మీద ఇంట్లోంచి బయటపడ్డాడు.

గంజితో ఫెళ ఫెళ్ళాడిపోతున్న యూనిఫారంలో సుందరయ్యకు హుషారుగా వుంది. రాత్రికి రెయిడుందని



సాయంత్రమే అతనికిఅర్థమయిపోయింది.

ఆ రోడ్డు దాదాపు నిర్జనంగా వుంది. సుందరయ్యకు ఎదురుగా ఒక వ్యక్తి రోడ్డు వారంట నడుస్తూ వస్తున్నాడు.

సుందరయ్యకు ఎస్.పి, సి.ఐ, డి.ఎస్.పి. వరసగా జ్ఞాపకానికి వచ్చారు. నడుస్తున్న సుందరయ్య ఆగిపోయాడు. పి.సి.లంటే ఈ పెద్దలంజ కొడుకులకి ఎందుకింత అనువయిపోయిందీ అని అతను ప్రశ్నించుకున్నాడు.

అదే సమయానికి అతనికి ఎదురుగా వస్తున్న వ్యక్తి సుందరయ్య పక్కకి వచ్చాడు. సుందరయ్యకో పిచ్చి ఆలోచన వచ్చింది. హఠాత్తుగా ఒక అడుగు అటువేసి ఆ వ్యక్తిని ఆగమని సంజ్ఞ చేశాడు.

ఆ వ్యక్తి కంగారుగా ఆగి, "ఏటండి" అని అడిగాడు.

సుందరయ్య అతడిని లాగి లెంప కాయ కొట్టాడు, "ఏట్రా... బోర విరుచుకుని రోడ్డు మధ్దిన రౌడీ నాకొడుకులాగ నడుస్తున్నావే" అని అడిగాడు సుందరయ్య.

చెంప దెబ్బతిన్న వ్యక్తికి మతి పోయింది. తాను ఏమి తప్పు చేసేడో అతడికి అర్థంకాలేదు. "నేను రోడ్డు వారంట నడుస్తున్నాను కదండీ" అన్నాడతను.

"రోడ్డు వారంట మాత్రం ఆ నడకేటి? పోలీసోణ్ని చూసి అలాగ బోర విరుచుకు నడవడవేటి ?" అని సుందరయ్య దబాయించాడు.

ఆ వ్యక్తి ఏడవలేక నవ్వేడు "నేను అసలే నీరసం పీనుగుని. పొద్దుణ్నుంచి తిండే తిన్లేదు. అసలు నేను బోర విరుచుకుని నడ్త మాత్రం అడగడానికి నువ్వెవడివి? చూస్తుంటే నీకు పిచ్చిలాగుంది.."

"ఒకసారి వెనక్కి తిరుగు నిన్నెందుకు కొట్టేనో చెపుతాను" సుందరయ్య చాలా నెమ్మదిగా, ఖాకీ గోవులాగ సౌమ్యంగా మాట్లాడేడు.

ఎటు పోయి ఎటు వస్తుందన్న అనుమానంతోనే ఆవ్యక్తి వెనక్కి తిరిగాడు.

బూటుకాలితో చటుక్కున అతగాడి నడ్డి మీద ఒక్క తన్ను తన్నేడు సుందరయ్య. నీరసపు మనిషి నాయనో' అనే గావుకేక వేసి అల్లంత దూరాన పడ్డాడు.

సుందరయ్య కిందపడిన మనిషి దగ్గరకు వెళ్ళి, మడుకుల మీద చేతులు ఆన్చి వంగి–

"ఎస్.పి గాణ్నయినా, ఆడి పెళ్ళాన్నయినా, ఐ.జీ గాణ్నయినా, ఎవణ్నయినా నేను గాని తలుచుకుంటే ఇలాగే తన్నగల్ను... తెలుసుకో" అని చెప్పి నిటారుగా నిల్చుని వెనక్కి చూడకుండా త్రీటౌన్ వైపు నడిచాడు.




చీకటి సౌఖ్యాలు సర్ఫరా చేసే ఓ లాడ్జింగ్ హౌస్ ముందు నీలిరంగు పోలీసు వ్యాన్ ఆగింది.

బూట్లూ, లాఠీలూ దిగాయి.టోపీలూ, టార్చిలూ దిగాయి. సర్కిల్ ఇన్స్పెక్టర్ కాశీపతి టోపీ నెత్తికేసి అదుముకున్నాడు.

అతనితో పాటు దిగిన ఎస్సయి మూర్తి, సుందరయ్య, జోసెఫ్, నారాయణ మొదలయిన పోలీసులూ కాశీపతి చుట్టూ చేరేరు.

రాత్రి పన్నెండు గంటల చీకటిలో వీధిలాంతరు వెలుతురులో వాళ్ళంతా వేటకుక్కల దీక్షతో, జాగిలాల వోపికతో పొంచివున్న కన్నపు దొంగల్లావున్నారు.

"వ్యాన్‌లోని లంజలు పారిపోకుండా ఒకడు కాపలా కాయండి... మిగతా వాళ్ళు రండి..."

లాడ్జి గుమ్మం ముందు ప్రొప్రయిటర్ నించొని వున్నాడు.

కాశీపతి దగ్గరకు రాగానే "స్టేషన్ మామూలు రెండ్రోజుల కిందటే పంపించీసేం కదండీ..." అన్నాడతను.

కాశీపతి మాట్లాడకుండా ఆగి "మూర్తీ! నువ్వు రిజిస్టర్ చెక్ చేసి, అవసరమయితే సీజ్ చెయ్యి"

"సార్... సి.ఐ.గారూ... ఇదేటండీ అసలే బిగినెస్సు బాగులేదు.. దానికి తోడీ రెయిడింగ్ ఏటండి... ముందు కబురన్నా చేయలేదు. అన్యాయమండి.. ఎయిర్ కండిషన్ లాడ్జిలే ముండల్ని సప్లయి జేసేస్తున్నారు మేమెంత? అదీగాక మా లాడ్జికి అదే బతుకు. మీకు తెలీదేటండి... తెలిసికూడా ఇలాగ రెయిడింగ్ చేయడం, మమ్మల్ని ఏడిపించడం మర్యాదేనేటండి? ఆలోచించండి బాబ్బాబు... దెబ్బతిని పోయున్నాను. కావలిస్తే మనం మనం మాట్లాడుకుందాం..." ప్రొప్రయిటర్ బతిమాలుతూనే బేరం పెట్టాడు.

"ఒరే..." కాశీపతి శిష్యగణం వంక తిరిగాడు."ఒరే! ముందు వీణ్ని వేనెక్కించం చెయ్యండి..." అని చెప్పి లోపలికి ప్రవేశించాడు.

అప్పటికే ఆ ముసలి లాడ్జి భయంతో గొంతుకూచుంది.

పెరటి ద్వారం దగ్గిరా, వీధి గేటు దగ్గిరా ఇద్దరు పి.సిలు కాపలా వేశారు.

తలుపులు దడదడమన్నాయి.

"అమ్మో, బాబో"లు మొదలు అయ్యాయి.

"మా ఫేమిలీయేనండి..."

"వాటీజ్ దిస్ న్యూసెన్సు"

"ఏ కంపినీ నుంచి తెచ్చారండీ నాయుడుగారూ ఈ గుంటని"

"బాబ్బాబు ఈపాలి కాగ్గేయండి"

"తెచ్చుకోక తెచ్చుకోక సెగజబ్బున్న దాన్ని తెచ్చుకున్నావేటయ్యా.. అయిపోయిందా.. సఫా నీ పని. కెజిహెచ్‌కి వెళ్ళిపో..."

"సారీ.. ఒక్కరే వున్నారా? తలుపేసుకోండి. సానిముండలకోసం రెయిడు కొచ్చాం.. అన్ని రూములూ చెక్ చేస్తున్నాం"

"హండ్రెడ్ రుపీస్.. తీసుకొని నన్నొదిలేయండి"

అంతా గోలగా, హడావుడిగావుంది.

కాశీపతి జేబుల్లో చేతులు పెట్టుకుని నిలబడి చూస్తున్నాడు.

"పైని కూడా రూములున్నాయిసార్" ఓ కానిస్టేబుల్ కాశీపతికి చెప్పాడు.

తెలుసన్నట్టుగా తలవూపి అతణ్ణి తన వెంట రమ్మని సంజ్ఞచేసి మెట్లెక్కాడు కాశీపతి.

మేడమీది వరండాలో కుళ్ళుకుళ్ళుగా, చచ్చు వెలుతురుగావుంది. మెట్లు ఎక్కిన వెంటనే వున్న గది తలుపు వోరగా తెరిచి ఓ యువకుడు తలపైకి పెట్టి చూస్తున్నాడు.

కాశీపతి ఆ గుమ్మం ముందు నిల్చుని ఆ యువకుడికేసి పరీక్షగా చూశాడు.

"ఏవిటి కావాలి?" అని ఆ యువకుడు ఇంగ్లిషులో అడిగాడు.

"తలుపు తెరు" కఠినంగా అన్నాడు కాశీపతి. ఆ యువకుడు మాట్లాడలేదు.

"అడ్డులే" అన్నాడు కాశీపతి చేత్తో తలుపుని బలంగా తోస్తూ.

దెబ్బ తగలకుండా తప్పించుకోవడానికి తలుపు దగ్గరవున్న యువకుడు చటుక్కున లోపలికి జరుగుతూ "ఏమిటి ?" అన్నాడు.

తలుపులు రెండూ బార్లా తెరుచుకున్నాయి. బైట నిల్చునే గదిలోకి చూశాడు కాశీపతి.

తలుపులు తెరిచిన వ్యక్తికి ముప్పయి సంవత్సరాల వయసుంటుంది. అతని ఒంటిమీద తెల్ల లుంగీ మాత్రమే వుంది. జుత్తు చెరిగి వుంది.

గదిలో మరెవరూ కనిపించలేదు.

గదిలో వున్న డబుల్‌కాట్ మంచం మీద చౌకరకం దుప్పటి చెరిగిపోయివుంది కాళ్ళవేపు దండి మీద రంగుల చీర కుప్పగా పడేసి వుంది. గోడకు ఆనుకుని వో బల్ల, గోడమీద వో అద్దం, టేబిల్ పక్కనున్న స్టూలు మీద వో గాజు కూజా, రెండు గ్లాసులు, గోడకు వున్న వంకీకి తగిల్చి పేంటూ, షర్టూ వున్నాయి.

గదికి ఆనివున్న స్నానాల గది తలుపు దగ్గరగా వేసి వుంది.

కాశీపతి గదిలోకి అడుగు పెట్టేడు. జీరోవాట్. బల్బు కాంతి కంటికి సరిపడా వుంది.



"ఏం కావాలి ఇన్స్పెక్టర్... బలవంతంగా తోసుకుని మరీ గదిలోకి రావటం దేనికి?" అని ఆ యువకుడు అడిగాడు- వంకీనున్న చొక్కా తీసివేసుకుంటూ.

కాశీపతి మంచం దగ్గరకు నడిచాడు. దిండు పక్క నలిగిన మల్లె పూల దండ కనిపిస్తోంది.

దండెం మీదున్న చీర వంక చూపుడు వేలు చూపుతూ. "ఈ చీర విడిచిన వీర వనిత ఎక్కడుంది?' అని వెటకారంగా అడిగాడు.

"ఆ విషయం తెలుసుకోవటం అవసరమా?" అని ఆ యువకుడు మళ్ళీ ఇంగ్లీషులోనే అడిగాడు.

కాశీపతికి కోపం వచ్చింది "ఒరే కుర్రాడా! అవసరంఉంది గనుకనే అడుగుతున్నాను... ఇంగ్లీషు నాకూ వచ్చును. తెలుగు మాట్లాడు. ఈ చీర విప్పేసిన ఆడది ఎవరూ అని అడుగుతున్నాను..." అని గట్టిగా అన్నాడతను.

"ఆల్ రైట్... ఆమె బాత్ రూంలో వుంది...నాకాబోయే భార్య...చాలా... వుయార్ ఎంగేజ్డ్..." అన్నాడా యువకుడు విసుగ్గా.

"నీ పేరేమిటబ్బాయ్?"

"అయాం భాస్కర్...రాజాస్ కాలేజీలో ఇంగ్గిషు లెక్చరర్ని. ఆమె పేరు కమలి.. ఇంగ్లీషు రీసెర్చి స్కాలర్..."

"భాస్కరవా( నీ పేరు. సరేకాని పెళ్ళి కాని పిల్లను తీసుకొని నువ్వీ లాడ్జిలో ఎందుకు దిగేవో తెలుసుకో వచ్చా?"

భాస్కర్ మాట్లాడలేదు. జీరో బల్బు ఆర్పి ట్యూబ్ లైట్ స్విచ్ వేశాడు.





ఒక్క క్షణం ఆ గదిలో చీకటి. బాత్ రూం తలుపు సందునుంచి వెల్తురు కనిపిస్తోంది. ట్యూబ్ లైట్ వెలిగింది.

"నేన్చెప్పుతాను.. పెళ్ళి చేసుకుంటానని ఆ పిల్లకు చెప్పేవు.. ఈ రాత్రి గదికి తీసికొచ్చి పడుకోబెట్టేవు. రేపో ఎల్లుండో మరో రెండుసార్లు వాయించేసుకుంటావు.. తరువాత ఎవరెవు నువ్వంటావు..." కాశీపతి భాస్కర్ కళ్ళలోకి చూశాడు.

భాస్కర్ కొయ్యబారిపోయాడు.

కాశీపతి నవ్వాడు. "నీలాంటి జులాయి వెధవల్ని నేను లక్షమందిని చూసేను... పిలక పట్టుకొని కోర్టుకు ఈడ్చుకెళ్తే ఆర్నెల్లు వేసేస్తారు. ఇంతకీ ఏదీ అమ్మాయి.. నువ్వు చెప్పినట్టు ఆవిడ రిసెర్చి స్కాలరేనా లేకపోతే ఏ గంగమ్మ డిపోనుంచో కొట్టుకొచ్చేవా... బైటకు రమ్మను చూద్దాం... బాత్ రూంలో దాక్కుందా? గుడ్డలు తీసేసి రెడీగుంచే వేటి గురూ..."

"ఏవిటీ ప్రేలాపన? ఒంటిమీద తెలివుండి మాట్లాడుతున్నావా ఇన్స్పెక్టర్?" అన్నాడు భాస్కర్ ఇంగ్లీషులో. కాశీపతి మోటుతనం, భాష అతడిని హడలగొట్టాయి.

"నోర్మయ్ ఆ చీర పట్టుకెళ్ళి ఆ పిల్లకి ఇవ్వు. గుడ్డలు తొడుక్కొని బైటకు రమ్మను. ఇది పోలీసు వ్యవహారం"

భాస్కర్ మంచం దండెమీది బట్టలు తీసికొని బాత్ రూం తలుపు వోరగా తీసి లోపలవున్న కమలికి అందించాడు.

మేడమీద పక్క గదుల్లో కూడా అల్లరి ప్రారంభం ఆయింది.

"మేం పెళ్ళి చేసుకోబోతున్నాం.. రిజిస్ట్రార్ ఆఫీసుకు దరఖాస్తుకూడ పెట్టు

కున్నాం. ఇద్దరం చిన్నపిల్లలంకాదు. ఆవిడ యూనివర్శిటీ లేడీస్ హాస్టల్‌లో వుంటోంది. నేను వేరే రూంలో వుంటు న్నాను. సర్దాగా గడుపుదామను కున్నాం..ఇక్కడికి వచ్చాం.." భాస్కర్ సాధ్యమయినంత నెమ్మదిగా చెప్పేడు.

"పెళ్ళి చేసుకోకుండా లైంగికసంబంధం పెట్టుకోవడం వ్యభిచారం కిందికి వస్తుంది. వ్యభిచారం నేరం.. నేను మిమ్మల్ని వ్యానెక్కించి లాకప్‌లో పడి గల్ను. నువ్వు నోరుమూసుకుని వుండు.."కసరినట్టు మాట్లాడేడు కాశీపతి.

భాస్కర్ ఏదో చెప్పబోయి ఆగిపో యాడు. కాశీపతి ఖాకీ దుస్తుల్లో ఏదో ఒక జంతువు పొంచివున్నట్టు తోచింది అతనికి. బాత్‌రూం తలుపు తీసుకొని పాతికేళ్ళ కమలి బైటకు వచ్చింది.

ఏపుగా, ఎర్రగా వున్న కమిలి ముఖం అవమానంతో కందిపోయివుంది. కళ్ళెత్తి కాశీపతినీ, భాస్కర్‌నీ, నారాయణనీ బార్లా తెరిచివున్న తలుపు లనూ చూసి మళ్ళీ తలదించుకుని, గోడ వారనవున్నటేబిల్ దగ్గరకు వెళ్ళిగ్లాసుతో మంచి నీళ్ళుతీసుకు తాగింది.

కాశీపతి తన వెంట వచ్చిన నారా యణ చేతిలోని లాఠీ తీసికొని ఆమె వద్దకు నడిచాడు. "బేబీ! కమలి బేబీ.. అదే గదా నీ పేరు.. అంత ఆకలి మీదు న్నావా బేబీ?" అన్నాడు కాశీపతి.

"హద్దు మీరి పోతున్నావు" అన్నాడు భాస్కర్.

అతణ్ని ఖాతరు చేయలేదు కాశీపతి "పెళ్ళి చేసుకుంటానని వీడు కల్లబొల్లి కబుర్లు చెప్పేసరికి నమ్మేసి గుడ్డలు విప్పేసి మంచం ఎక్కేసేవు గదా... వీడొక వేళ మోసం చేస్తే ఏమైపోతావే బేబీ.." అని అడిగాడు.

"నేను బేబీని కాదు.. మేజర్ని. నా వ్యక్తిగత విషయాల జోలికి రావలసిన అవసరం నీకు లేదు. నాలుక సక్ర మంగా వాడుకో.." కమలి నెమ్మదిగానూ, కఠినంగానూ ఇంగ్లీషులో చెప్పింది.

కాశీపతి నవ్వేడు. "చూస్తుంటే నువ్వే ఈ బాసిగాడిని ఈ గదికి లాక్కొచ్చినట్టుంది."

కమలి మండిపడింది.."యూ...యూ.' అన్నది చూపుడువేలు ఆడిస్తూ. ఆవేశంతో ఆమె గుండెలు ఎగిసిపడ్డాయి.

కాశీపతి లాఠీతో ఆమె ఛాతీమీద నొక్కాడు. కమలి లాఠీ లాక్కొని విసిరేసింది.

"ముద్దుగున్నావు పాపా! బాసిగాడు మొత్తంమీద లక్కీ ఫెలోయే. వయసులో వున్నావు గనక మంచం సరదా వుంటుంది. నలభై ఏళ్ళు నాకు... నాకు ఇప్పటికీ రెండుమూడు మంచాలు కావాలి. ఆ సరదా అలాంటిది. నాకు తెలుసు. కానీ పెళ్ళి చేసుకుంటే కానీ మంచ మెక్కకు.. పోలీసాఫీసరుగా అదీ నా సలహా. నా రాయణా! ఆ లాఠీ అందు కోరా.. ఇలాగియి అదీ.. ముండల లాడ్జీలో దిగేరు జాగర్తగుండకపోతే నీలాంటి పాపలు ఇలాంటి లాడ్జీల్లోనే సెటిల్ అయిపోతారు. అదీ నే చెప్ప దలుచుకున్నది. ఈ బాసిగాణ్ని చూస్తుంటే నాకు అనుమానంగుంది. కడుపుచేసి.."

కాశీపతి మాటలు ముగియకముందే భాస్కర్ కేకలు వేయటం ప్రారం భించాడు– "నువు మనిషివిగాదు పశువ్వి, జంతువ్వి, మృగానివి. నువ్వెలాగ పోలీసు డిపార్ట్‌మెంట్‌లో చేరేవో నాకు అర్థం కావటం లేదు.. ఏం నోరు నీది? పెంట



నోరు..."

నారాయణ అందించిన లాఠీని ప్రయోగించాడు కాశీపతి. "నోరుముయ్యరా నాయాలా.. అమాయకురాల్ని తీసుకొచ్చి లాడ్జిలో దింపి, ముండల కంపెనీతో బేరాలు చేస్తుండగా పట్టుకున్నావని కేసు పెడితే ఆరేళ్ళు జైలుకి పోతావు.. నోరు మూసుకుని వుండు.. అదేపోయిందని వొదిలేస్తున్నాను.. ఈ కమలి, స్వీట్ గాల్ ఐ. సే.. ఈ కమలి మొహం చూసి, ఎత్తు గుండెలు జూసి నిన్ను వదిలేస్తున్నాను... బతికిపోయావు. ఏయ్ పిల్లా.. ఇదేం పోయే కాలం నీకు? బుద్ధిగా పెళ్ళి జేసుకొని అప్పుడు సరదా చేసుకో. ఈ సరదా కొంపతీస్తుంది... బుద్ధిగా రిక్షా జేయించుకుని హాస్టల్ కు వెళ్ళిపో..." అనేసి కాశీపతి చరచరా బయటకు వెళ్ళిపోయాడు.

గదిలో వాన వెలిసినట్టయింది.

కమలీ, భాస్కర్ ఎక్కడివారక్కడే నిల్చుండిపోయారు. నారాయణ ఒక్క క్షణం కంగారుపడి తరువాత కదిలాడు.

"ఏయ్ మిస్టర్.. మీ ఇన్స్‌పెక్టర్ పేరేవిటి? ఏ స్టేషనూ.." అని అడిగాడు భాస్కర్ అరచేతితో ముక్కు తుడుచుకుంటూ. సన్నగా నెత్తురు కారుతోంది ముక్కువెంట.

నారాయణ మాట్లాడకుండా గదిలోంచి బయటకు వెళ్ళాడు. మెట్లదగ్గర నిలబడి కాశీపతి ఎస్సయి మూర్తితో మాట్లాడుతున్నాడు.

"మొత్తం ఇరవై గదులున్నాయి సార్.. అందులో తొమ్మిది గదుల్లో ఇమ్మోరల్ ట్రాఫికింగ్ వుంది. ముగ్గురు విటులు మనవాళ్ళని తప్పించుకు పారిపోయారు.. ఒకాయన ఇన్‌కంటాక్స్ ఇన్స్‌పెక్టరు.. వదిలేసేం.. మీరు చెప్పుకోవచ్చుగదా అని. మిగిలిన వాళ్ళని వ్యానెక్కిస్తున్నాం..." అంటున్నాడు మూర్తి.

వింటూనే కాశీపతి నారాయణ వంక చూశాడు "సార్ ఆ అబ్బాయి మీ పూరూ, పేరూ భోగట్టా చేస్తున్నాడు" అని చెప్పాడు నారాయణ.

కాశీపతి దానిని వినిపించుకున్నట్టు కనిపించలేదు.

"సరే... ఆ ప్రొపరైటర్‌గాడి చేత సంతకాలు పెట్టించి రికార్డు సీజ్ చేసి వాడ్ని కూడా వ్యానెక్కించీ.. లంజకొడుకు స్టేషన్ మామూలు పంపించే సేట్టు.. ఇలాంటి నాకొడుకులవల్లనే డిపార్ట్‌మెంట్‌కి చెడ్డపేరు..."

"యస్సర్"

"సార్.. ఆ రూములో అబ్బాయి తమ పూరూ పేరూ..!" నారాయణ చెప్పటం పూర్తికాకముందే కాశీపతి చరచరా నడుస్తూ భాస్కర్ వున్న రూములోకి పాములాగ ప్రవేశించాడు.

జరిగింది పొరబాటని, తాను చేసింది తప్పని నారాయణకు హఠాత్తుగా తెలిసింది.

"ఏ అబ్బాయి?" అని కుతూహలంగా అడిగాడు మూర్తి.

నారాయణ అతడిని ఖాతరు చేయలేదు. కాశీపతిని తాను అనవసరంగా రెచ్చగొట్టి మళ్ళీ ఆ గదిలోకి పంపించేదేమోనని అతడికి బెంగ పట్టుకుంది.

భాస్కర్ గదిలోకి అతను కూడా వెళ్ళాడు. మూర్తికూడా వెంట నడిచాడు కుతూహలంకొద్దీ.

"ఏంరా బాసీ! నా పూరూ పేరూ కావలసివచ్చిందిరా నీకు?అయితే పీ.సీ.ని అడగడవెందుకూ? దమ్ముంటే నన్నే అడగవచ్చునుగదా... నన్ను అడుగు... విను... నా పేరు ఎస్. కాశీపతి. వెస్ట్ సర్కిల్ లా అండ్ ఆర్డరు ఇన్స్‌పెక్టర్ని... రెండేళ్ళ క్రితం ఈ వూరొచ్చాను. అంతకుముందు శ్రీకాకుళం జిల్లాలో పన్జేసేను. అక్కడ, ఐ కిల్డ్ హండ్రెడ్స్ ఆఫ్ నక్సలైట్స్... ఓకె... ఇప్పుడీ ఇన్ఫర్మేషన్ పట్టుకుని ఏంచేస్తావురా బాసీ? ఐజీకి, హోం మినిస్టర్‌కి ఫిర్యాదుచేస్తావా? లెటర్స్ టుది ఎడిటర్‌కి రాస్తావా? ఏంచేస్తావ్?"

భాస్కర్ నిర్లక్ష్యంగా తలఎగరేశాడు.

"ఆ సంగతి లాయర్ ద్వారా తెలుస్తుందిలే..."

కళ్ళు పెద్దవిచేసి, కనుబొమలు పైకెత్తి ఆశ్చర్యాన్ని అభినయించాడు కాశీపతి.

"అయ్‌బాబో కోర్టుకెళ్తారా భాస్కరం బాబుగారూ!?" అన్నాడు. అని ఒక్క క్షణం ఆలోచించాడు. భాస్కరం కేసి తీవ్రంగా చూశాడు.

"ఒరే బాసిగా... నువ్వెంత హెల్ప్‌లెస్ వెధవ్వో నీకేవన్నా తెలుసున్రటా... నీకాళ్ళూ, చేతులూ విరక్కొట్టి, పేన్‌లో పడేయించి ఏదోకేసులో ఇరికించేసి ఇరవై సంవత్సరాలు బొక్కలో తో యి ం చ గలను... తెలుసా? ఒరే బాసిగా, గోసిగా తెలుసురా నీకూ?... కో ర్టు కు వెళ్తావా? వెళ్ళు... కానీ ఏవిట్రా సాక్ష్యం... అసలు కేసేవిట్రా?...నో... నేను నీకు సాయంచేస్తాను..." అని క మ లి ని చూశాడు.

ఆమె దాదాపు వూపిరి బిగబట్టివుంది. తరువాత నారాయణ కేసి చూశాడు కాశీపతి. అతని పెదిమల మీద చిరునవ్వు పుట్టుకొచ్చింది.

చూపుడువేలు నారాయణకేసిచూపుతూ "ఒరే బాసీ! మనుషుల్లో మాలోడిలాగ ఈ కానిస్టేబుల్‌గాడు హీనం. వీడిప్పుడు నీ కమల్ని ముద్దుపెట్టుకుంటాడు...నీకేవయినా దమ్ములుంటే అడ్డుకో. ఆనక కేసు పెట్టుకో. కోర్టుకెళ్ళు...అక్కడ కూడా నీకు సాక్ష్యం వుండదు కాబట్టి గెలవ్వు. ఒరే నారాయణా వెళ్ళరా... నీ అదృష్టం పండింది. వెళ్ళి ఆ అమ్మాయి బుగమీద ఒకేవొక ముద్దు మాత్రం పెట్టుకో..."

నారాయణ నిర్ఘాంతపోయాడు. మేక బందీ అయిపోయినట్టు ని లు చు ం డి పోయాడు.

భాస్కర్ నిప్పులు కక్కుతూ చూశాడు.




కమలి నేల చూపులు చూస్తోంది.

నారాయణ కదలకపోవటం చూసి కాశీపతికి కోపం వచ్చింది "వెళ్ళరా పిరికి లంజా కొడకా...వెళ్ళు..."

నారాయణకు పై ప్రాణాలు పైనే పోయాయి.

"నారాయణా! వెళ్ళు" మూర్తి మృదువుగా సలహా ఇచ్చాడు.

"మీరు పశువులు కూడా కాదర్రా... రాక్షసులు..." అన్నది కమలి.

"ఒరే లక్ష్మీకి వెళ్ళరా...నిన్ను సరసం చెయ్యమనటం లేదు...ఆర్డరు పాటించమంటున్నాను. వెళ్ళు... నేస సలే పిచ్చి లంజాకొడుకుని..." కాశీపతి దాదాపు అరిచాడు.

నారాయణలోని యంత్రాలు అసహాయంగా, నెమ్మదిగా కదిలాయి. ఒక్క అడుగు అటు వేశాడు.

భాస్కర్ మెరుపులా కదిలి, పెను బలంతో కాశీపతి చేతిలోని లాఠీ లాక్కుని "ఒరే దొంగ లంజాకొడుకుల్లారా...పొండి బైటకి...కావలిస్తే కేసు పెట్టుకోండి...మీ ఇష్టం వచ్చిన కేసు పెట్టుకోండి. పదండి ష్టేం వేనెక్కుతాం. అంతేకానీ కమలి ఒంటిమీద ఏలంజ కొడుకన్నా వేలుమోపాడా ఈ లాఠీ కర్రతో బుర్ర బద్దలు కొట్టేస్తాను... చంపేస్తాను" అని వెర్రికేకలు వేశాడు.

ఎస్సయి మూర్తి చురుకుగా కాశీపతి కేసి చూశాడు. కాశీపతి తల పంకించాడు.

మూర్తి మెరుపు వేగంతో కదిలి పక్కనుంచి భాస్కర్ డొక్కలో బూటుకాలితో తన్నేడు.

భాస్కర్ గావు కేక వేశాడు. అతని చేతిలోని లాఠీ జారిపోయింది. డొక్క చేతితో పట్టుకొని అతను కూల



బడిపోయాడు.

అంతవరకూ సందేహిస్తూ, నత్త నడక నడిచిన నారాయణ ఈ హఠాత్సం ఘటనకు హడలిపోయి ఒక్క అంగలో కమలి వద్దకు వెళ్ళి కొయ్యబారిపోయి నట్టు నిల్చున్న ఆమె చెంపకు పెదాలు ఆన్చి క్షణాల మీద వెనక్కి వచ్చేశాడు.

నడుం విరిగిపోయిన మృగంలాగ బాధగా, గాయంగా, పెను కోపంగా చూశాడు భాస్కర్.

''చూశావ్రరా బాసీ... నేను తలుచుకుంటే ఏమైనా చేయగలను. ఏమైనా సరే.. నాకు భయంలేదు జ్ఞాపకం ఉంచుకో. దమ్ములుంటే నన్నేమయినా చెయ్యి ఇక్కడకాదు, ఇప్పుడు కాదు. ఎప్పుడయినా సరే...ఎక్కడయినా సరే నేను నీకు అపకారం చేయగలను. కానీ నువ్వు వెర్రి వెధవ్వనే జాలి కూడా నాలో వుంది.. అందుచేత వదిలేస్తు

న్నాను..." కాశీపతి వచ్చినంత వేగం గానూ గదిలోంచి బైటకు వెళ్ళిపోయాడు.

* * *

తెల్లవారెప్పుడో ఇంటికిపోయి పడుకున్న నారాయణకు నిద్రలో వున్న భార్యను చూడగానే చటాలున కమలి జ్ఞాపకం వచ్చింది.

పడుకున్నవాడల్లా లేచి కూచున్నాడు. అతని గుండెలు గుబగుబలాడాయి.

భార్యకు అవతలి పక్క పడుకుని అమాయికంగా నిద్రపోతున్న ఏణ్ణర్థం కూతురు నిద్రలో ఎందుకోగానీ ఒక్క సారి ఏడ్చి వూరుకుంది.

"ఓరి కసాయి లంజకొడుకా.. నాచేత ఎంత పాపం చేయించేవురా? కాశీ లంజి కొడకా...!" అని అతను కాశీపతిని తిట్టు కున్నాడు.

నేల కూలబడిపోయిన భాస్కర్ నిప్పుల కళ్ళతో చూసిన చూపు నారా యణకు జ్ఞాపకం వచ్చింది.అతని మూలుగు వినిపించింది.

పాపం నానించే కదా ఆ కుర్రాడు అంత దెబ్బతిన్నాడు అని నారాయణ గింజుకున్నాడు.

కమలి చెంపల చల్లదనంలోని ఛావు జ్ఞాపకం వచ్చింది.

గదిలోంచి బైటకు వచ్చేస్తున్నపుడు ఆమె కళ్ళలోకి అప్రయత్నంగా చూశాడు నారాయణ.

ఇప్పుడతనికి ఆ కళ్ళు జ్ఞాపకం వచ్చేయి.

ఆమె కనుపాపలలోని బాధలూ
భయంగా కదిలే అందలి నీరూ
అక్కడి బాధ
అప్పటి యాతనా
కాటుక చీకటి

అన్నీ అతనికి జ్ఞాపకం వచ్చి భయ పెట్టాయి.

లంజకొడకా... దుర్మార్గపు లంజ కొడకా..ఒరే కాశీ...నీబుగ్గ తిపొయ్యా... నాచేత ఎంత పాపపు పని చేయించే వురా...ఆ పిల్ల వుసురు నీకు తగల్గా... నా పాపకి...నా చిట్టితల్లికి ఆ పాపం తగి లితే ఆ వుసురు నీదే... అలాంటిదేదైనా జరిగితే నిన్ను నేనే చంపేస్తాను...పళ్ళు పట పట కొరికాడు నారాయణ.

అతను పాప భీతితో గజగజ వణికి పోయాడు.

కమలి కళ్ళు...

కమలి కళ్ళు...

ఏ అన్నవరం సత్యనారాయణమూర్తో, సింహాచల నరసింహుడో, తిరుపతి వెంక టాచలపతో, బెజవాడ కనకదుర్గమ్మో ఆ కళ్ళలోంచి తనని వురిమి చూసినట్టు, కళ్ళెర్రజేసి చూసినట్టు అనిపించిందతనికి.

హఠాత్తుగా లేచి—

చకచకా యూనిఫారం వేసుకుని బెల్టుబిగించి, బూట్లు వేసుకున్నాక అత డిని ఆవహించిన వణుకు తగ్గింది. భయం తగ్గింది.కాకీ కవచంలో మాత్రమే అతనికి నిద్రపట్టింది.




వన్ టౌన్ పోలీస్‌స్టేషన్ ముందున్న రోడ్డు మీద నుంచి గబగబా నడు




స్తున్న ఒక వ్యక్తి పోలీస్‌స్టేషన్ ముందు చటుక్కున్న ఆగి, స్టేషన్‌కు దండం పెట్టి మళ్ళీ చక చకా నడుస్తూ వెళ్ళి పోయాడు.

"అదేటి గురూ! ఎవడా పిచ్చినాకొడుకు టేషన్‌కి దండ వెట్టి పోతన్నాడూ" అన్నాడు కిటికీలో నుంచి రోడ్డు మీదికి చూస్తున్న అప్పలకొండ.

"పాత కేడీగాదయి వుంటాడు" అన్నాడు ద్వారం దగ్గిర నిల్చున్న సుబ్బారావు.

"నీ మొహం. ఆడు ఖద్దరు బట్టలేసు కున్నాడు. చూళ్ళేదూ? గొప్ప దేశభక్తుడు. పెతిరోజూ ఏదో ఒక బ్యాంకుకో, పోలీస్ స్టేషన్‌కో దండం పెట్టిగాని ఆడే పని ప్రారంభించడు. దేశమంతా బ్యాంకుల మీదా, పోలీస్‌స్టేషన్‌లమీదా ఆధారపడి వుందని ఆడి వాదన. వడ్డీలరాజు అంటా రాణ్ణి" అని వివరించాడు రైటర్ కాంతా రావు.

"గమ్మత్తుగుందే" ఆశ్చర్యపోయాడు అప్పలకొండ. "బాబూ...బాబు సుబ్బన్న బాబుగారూ" స్టేషన్ లోపలినుంచి ఓ గావుకేక వినిపించింది.

"చూడు సుబ్బారావ్! పాపారావుగాడు లాగుంది. నాలుగు తగల్నీ లంజ కొడుక్కి. స్టేషన్‌లో ఆ అరుపులేవిటి" అని రైటర్ కాంతారావు ఆజ్ఞాపించాడు.

సుబ్బారావు మొహం చిట్లించుకుని లేచి లోపలవున్న కటకటాల గది దగ్గిరకి వెళ్ళాడు. "ఏరా పళ్ళు రాలగొట్టేగల్ను ఆ కేకలేటి? ఎక్కడున్నావో మర్చిపోయా వెటి?"

పాచిపళ్ళు బైటపెట్టాడు పాపారావు "కబురు"

సుబ్బారావు కటకటాల గది దగ్గిరకి వెళ్ళాడు "ఏట్రా?"

"ఒక సిగరెట్ పీకుంటే పడేయండి" అని కోరాడు పాపారావు.

"తన్నండిరా కేడీలమ్మికిని. సిగరెట్ కావాలా సిగరెట్!? కొంచెంసేపుండు. మేస్ట్రీటు కోర్టులో ఆయన్నే అడగొచ్చు"

"ఆన్యాయం కాదు సార్. రాత్రి స్టేషన్‌కి తెచ్చినపుడు నా జేబీల రెడ్‌విల్స్ పెట్టె వుంటే మీరే దాన్ని తీసేసుకున్నారు గదా కనీసం సార్మినార్ సిగరెట్టుంటే పడే యండి"

సుబ్బారావు నవ్వేడు "నీ రెడ్‌విల్స్ నేనొక్కణ్ణే తీసుకున్నాననుకున్నావెటి. రైటర్ అందులో అయిదు సిగరెట్లు దొబ్బేడు. పేరు నాది... కాల్చింది రైటర్ గారూను"

"పోనీండిగాని సిగరెట్టుంటే పడే ద్దురూ"

"లేవురా పాపారావ్. పది గంటల యింది గాని ఒక్కపైసా దొరకలేదు"

"పోనీ నన్నోసారి బెటకి వదలండి. అర గంటలో వచ్చేస్తాను. పార్టీజేసుకుందాం"

"నాయనా నువ్వెంత ప్రయోజకుడివి కాబట్టే కటకటాల వెనక్కి జేరేవు. జేబిలు కొట్టే నాయాలా! మక్కెలు విరగదంతాను మళ్ళీ అలాంటి కబుర్లు చెప్పు"

"జేబీ దొంగనై పుట్టి తెల్లవారేసరికి పోలీసోణ్ణి సిగరెట్ పీక అడుక్కోవటం నాకెంత నామోసీగుందో ఆలోచించేరా? కాలం కలసిరాక దొరికిపోయాను. అంచేత మాటలు గూడా పడవలసొస్తంది. అయితే సిగరెట్టివ్వరన్నమాట"

"లేవురా పాపారావంటే నమ్మవెటి?"

"పోలీస్ టేషన్నిండా పాపం పెరిగి పోతున్నది గురుగారూ! రెడ్‌విల్స్ దొబ్బి



సార్కి నారన్నా ఇవ్వకపోవటం ఘోరం"

"సీ నోమ్మయ్" సుబ్బారావు అక్కణ్నించి ముందు గదిలోకి వచ్చేశాడు.

టేబిల్ మీది చారల టోపీ అందుకున్నాడు.

"నేనలాగ బైటకు వెళ్ళొస్తాను. సిరిమాలక్ష్మి మనకాడికి రాకపోతే మనమే ఆ తల్లిని వెతుక్కుంటూ వెళ్ళాలన్నారు గురువులు. రైటరుగారండీ! అలాగెళ్ళి ఓ అరగంటలో వచ్చేస్తాను"

"ఇప్పుడా...సరిగ్గా ఎస్సయి వచ్చే టైములోనా? వద్దు. గురువు తిడతాడు"

"పర్లేదులెండి సార్! నిన్న వుదయం నుంచి తెల్లారి మూడు గంటల వరకూ డీ.ఎస్.పీ. అరవసాకిరీ చేయించుకోలేదా. నాలాంటి ఏకపత్నీవ్రతుణ్ని సాని కొంపలంట కుక్కని దిప్పినట్టు తిప్పేడుగదా. ప్రకాశరావుగారికి మీరు చెప్పండి. గంటలో వచ్చేస్తాను. కూర కొని పట్టికెళ్ళాలి. అదీ పని. కడుపు కోసమేకదా గురువుగారూ మనందరం బతుకు

టున్నాం" అని వుపన్యసించి సుబ్బారావు కిరీటధారియై స్టేషన్ బైటకు వచ్చాడు.

ఆ వీధి బోడిగా, బోసిగా వుంది.

కాళ్ళు సారించడానికి ముందు కళ్ళు సారించాలనే జ్ఞానంతో అతను అటూ, ఇటూ వీధి అంతా పరికించేడు.

కాస్త దూరంలో వున్న చెత్తకుండీలో నుంచి ఓ ఇద్దరు పారిశుధ్య పనివారు చెత్తను తోడి ఒం టెద్దుబండిలో పోస్తున్నారు.

ఎద్దు ఏనుగంత వుంది. బండి బొమ్మంతే వుంది.

సిగరెట్ వెలిగించి ఆ వైపు నడిచాడు సుబ్బారావు. బండి దగ్గిర నిల్చొని రెండు మూడు సెకన్లు చూసి "ఒరే నాయనా! ఒళ్ళు దగ్గిర బెట్టుకు చెయ్యండిరా" అని సలహాఇచ్చాడు.

గడ్డపారతో పెంట ఎత్తుతున్న పారిశుద్ధ కార్మికుడు తలఎత్తి సుబ్బారావుకేసి చూశాడు. "ఏటిగురూ!"

"ఏటిలేదు.నువు పనిగానియ్.నా కొడుకులు సంవత్సరానికోసారి షికారొచ్చినట్టొస్తారు ఈ వీధికి. వచ్చినప్పుడన్నా శుభ్రంగా చెయ్యరు" అన్నాడు సుబ్బారావు.

మున్సిపల్ పనివారిద్దరూ మాట్లాడకుండా తమ పని తాము చేసుకుంటున్నారు. వాళ్ళ పని తీరును గమనించిన సుబ్బారావుకు ఒళ్ళు మండింది "సరిగా తియ్యడం చేతగాకపోతే ఆ పెంటను కుండీలోనన్నా వుండనివ్వండి. ఆహా! ఏం పనోడితనంరా బాబూ!? మీ చెయ్యి పడితే ఒక పెంటకుప్ప రెండవుతుంది. నాకు తెలీకడుగుతానూ ఇలాగ పనిచేస్తే మీకా జీతం డబ్బులు అరిగి ఒంటపడుతున్నాయిరా?"

పెంట బండిలో పోస్తున్న కార్మికుడు తల ఎత్తి సుబ్బారావుకేసి చూసి వెటకారంగానన్వేడు "మరేం పని లేదేటిగురూ! మాకాడికొచ్చి డాబు చేస్తన్నావు"

సుబ్బారావు ఆ మాటలు వినిపించుకోలేదు. పారతో పనిచేస్తున్న తణ్ని చూసి "ఏట్రా బాబూ అదీ!? ఏటా పార పట్టుకోవటం ఏటి? పంచదార గిన్నెలో చెంచా పెట్టినట్టు కుండీలో పార పెడితే పెంటొస్తాదిరా? వోరిబాబూ_ స్టూడెంట్ కుర్రోళ్ళు సర్దాకు శ్రమదానం జేసినట్టుగుందిరా మీ యవ్వారం" అన్నాడు.

పార పనివాడికి మండుకొచ్చింది "పొద్దునే మందుకొట్టేసినట్టున్నావుగురూ, ఇంటికెళ్ళిపో. ఊరందర్నీ వొరే గిరే అన్నకాడికొచ్చింది యవ్వారం. ఇంటికెళ్ళిపోయి మజ్జిగ తాగు"

నోట్లోని పొగ వదిలి నోరు ఆశ్చర్యంగా తెరిచాడు సుబ్బారావు. "అమ్మనాయిన.. నీకెంత పవురుసం వుందిరా నాయినా?"

"బాబూపోలీస్ జమాన్‌గారూ మీరేదో పనిమీద బైలెల్లినట్టుంది. ఎల్దురూ... పొద్దెక్కిపోయింది పని బోల్డంతుంది" బండి దగ్గిర కార్మికుడు బతిమాలేడు.

"జమాన్‌గారెక్కడికి బైలెల్తారు.. నీలాంటోణ్నీ, నాలాంటోణ్నీ పట్టుకొనేదీ జేబుల వున్న పావలా బేడా దొబ్బేది. ఎవరికి తెలీదీ జమాన్‌గారి సంగతి. మన జేబులు దొబ్బడానికేగదా పోలీస్ జమాన్లుండేది" పార పనివాడు పని చేసుకొంటూనే విమర్శించాడు.

"హోరి పాకీ నాకొడుకా.. పోలీసోడంటే నీకెంత అనువయి పోయిందిరా" అన్నాడు సుబ్బారావు ఆశ్చర్యపోతూ.

"మర్యాద్దక్కదు జమాన్‌గారూ... మార్యాదగా నీమానాన నువ్వు పో.. ఒరే గిరే అంటే, పాకివోడు, పీతోడు అంటే మర్యాద్దక్కదు. జాగ్రత్త రగుండు మమ్మల్ని అనావొద్దు, మా చేత తినా వద్దు" పార పట్టిన మున్సిపల్ కార్మికుడు హెచ్చరించాడు.

"నేనే గనుక అనదలుచుకుంటే నన్నెవడు ఆపుతాడు. సుబ్బరంగా 'పని చెయ్యండ్రా అని చెప్పేసరికి నీకిలాగ లేచిపోయింది. మీ సానిటరీ ఇన్స్‌పెక్టర్స్ ఆడారి నాకొడుకులు కాబట్టి సెల్లిపోతంది నేనే గనక మీ పైయ్యధికార్నయితేన ?"

"ఊ.. అయితే?" పార పీరుడు రెట్టించాడు.

"అయితేనా? నేనేగాని మీ పైఅధికారి నయితే.. ఒరే.. నువ్వూ, నీ ఎద్దూ ఇంతలాగ బలిసిపోడానికి ఒప్పుకొందు న్రాటా? తొక్కతీసేసి, కొవ్వంతా కరిగించేద్దును నీ ఎద్దు కసాయికొట్టుకీ, నువ్వు పెంటమీదికి పోయుందురు. మీ అధికార్లు ఆడారి నాకొడుకులు కాబట్టి నీలాంటి పాకీ నాకొడుకులిలాగ నీలుగుతున్నారు" సుబ్బారావు విసురుగా సిగరెట్ పారేశాడు.

తట్ట పట్టుకొని బండిదగ్గర నిల్చున్న కార్మికుడికి ఒళ్ళెరగనంత కోపం వచ్చింది. తట్టకింద పడేసి–

"ఏ్రటా ఎ్రరటోపీ నీలుగుతున్నావు? ఒళ్ళుగానీ తీపుతుందా? ఎక్కణ్ణించి వొచ్చావో అక్కడికెళ్ళు. ఎక్కడికి బెల్లేవో అక్కడికి తొందరగెల్లిపో నాకసలే అద్దుమాలిన కోపం. తరువాత ఏం జరుగుతాదో కూడా చూసుకోను.





అసల్నిన్ను ఎవుడు రమ్మన్నాడిక్కడికి? నీవూసుకొచ్చావా?మేం నీ జోలికొచ్చావా? చూచూ అన్నావా? రారా అన్నావా?" అన్నాడతను.

"నన్ను కుక్కతో పోలుసావురా పీతి నా కొడుకా. పీతుళ్ళెత్తుకొనే లంజా కొడకా... జుత్తు పట్టుకుని ఈడ్చుకెళ్ళి బొక్కలో తోసేగలను. పాకీ లంజ కొడకల్లారా.. మంచి చెప్పితే విషమయి పోయిందిరా?.. వొరే నన్నుగాదురా.. ఈ యూనిఫారాన్ని జూసి మీరు వుచ్చపోసుకోవాల్రా. ఒరే ఈ టోపీకి రోజూ దండవెట్టుకోవాల్రా పాకీ లంజకొడకల్లారా.." సుబ్బారావుకు కూడా చాలా కోపం వచ్చింది.

"పోలీసోడా.. తగ్గు. నియ్యేకాదు, మాయికూడా ఖాకీ బట్టలే. మాంకూడా ఖాకీ బట్టలోళ్ళమే. బొక్కలో తోసేస్తానని నువ్వు బెదరిస్తే కుక్కల బండిలో తోసేస్తావని మేం బెదిరించగలం. లంజ కొడకా, లమ్డీ కొడకా అని తత్తరిస్తే పళ్ళు రాలగొట్టి టోపీలో పడేగలం... జాగర్త" పార పట్టిన కార్మికుడు దాదాపు సుబ్బారావు మీదికి వచ్చేశాడు.

సుబ్బారావు ఒక్క అడుగు వెనక్కి వేశాడు "ఏ్రటా కూసేవూ? పాకీ నాకొడకా, పీతినాకొడకా, ఎదవనాకొడకా, మురికి నాకొడకా, పెంట నాకొడకా. లాఠీ చేతిలో వుంటే కాళ్ళు విరగ్గొట్టేద్దునురా"

"కొట్టు చూద్దాం? ఎందుకురా కొడతావు? జేబులు కొట్టేవని కొడతావా? కేడీగాళ్ళవని కొడతావా? పేకాటాడి, సారాదాగి, సానింట్లో దొరికావని కొడతావా? లేకపోతే నా యప్పచెల్లెళ్ళి రెక్కట్టుకు లాగేదని కొడతావా? ఎందుకురా కొడతావూ? బోడిగాడివి.. నువ్వూ నీ టోపీ మర్యాదగుండండి. లాఠీవుంటే

కొట్టేస్తాడంట. మేవంత గాజులు తొడు క్కుని లేం. దమ్ముంటే వొంటి మీద చెయ్యేయ్యి. నువ్వేగనక ఒక అమ్మకీ, అబ్బకీ పుట్టిన మనిషివయితే, నీకేగనక దమ్ములుంటే నా వొంటిమీద చెయ్యి వెయ్యి చూద్దాం. ఖమాన్.. సాలెంజ్" పారవీరుడు వొళ్ళు, పై తెలియనంత కోపంతో సుబ్బారావు ఎదురుగా వచ్చి బొరవిరుచుకుని కవ్వింపుగా నిలబడ్డాడు.

సుబ్బారావులోని ఖాకీ నిపుణుడు క్షణాలమీద పరిస్థితిని ఆకళింపు చేసు కున్నాడు. క్రీగంట పోలీస్ స్టేషన్ వైపు చూసాడు. గేటు దగ్గిర నిలబడి అప్పలకొండ, కాంతారావు ఇటే చూస్తు న్నారు..ఫరవాలేదు అనుకుని

"కొట్టేదా? కొడితే కాసుకోగలవురా లంజకొడకా..." అని ప్రారంభించి సుబ్బారావు పెనువేగంతో మున్సిపల్ కార్మికుడి దవడమీద ఆచి కొట్టాడు. హటాత్తుగా తగిలిన దెబ్బను తట్టుకోలేక పోయిన మున్సిపల్ కార్మికుడు తూలి చె త్తకుండీ పక్క పడిపోయాడు. అతని చేతిలోని గడ్డపార అంత దూరాన పడి పోయింది. ఇది చూసిన రెండో వుద్యోగి సుబ్బారావు మీ ది కి. రాబోయేడుగాని లాఠీ పట్టుకుని పోలీసు స్టేషన్ లోంచి అప్పుడే బైటకు వచ్చిన అప్పలకొండను చూసి జంకి, నిల్చున్న చోటునుంచి కదలలేదు.

వెల్లకిలా పడిపోయిన మున్సిపల్ కార్మికుడి ఛాతీమీద బూటు కాలుంచాడు సుబ్బారావు. "తెలిసిందిరా లంజకొడుకా! పాకీ నా కొడకా! ఈ కాలిలాగ గట్టిగా నొక్కానంటే ర క్తం కక్కుకొని మరీ చస్తావు.. పోలీసోడంటే నీకు తమాష లాగుందిరా? జాగ ర్త.. నేనేసినయీ ఖాకీ బట్టలే.. నువ్వేసినయీ ఖాకీ గుడ్డలే. కాని నే నేసినయి గంజి పెట్టి ఇస్త్రీ చేసిన రాజా ఖాకీ.. నువ్వేసినయి కుక్కతోలు లాంటి పాకీ ఖాకీ. అదీ తేడా. ఇప్పుడు తెలిసిందా? ఏ లంజా కొడుక్కయితే పోలీసులంటే ఏమీ కాకుండా వుం దో ఆడికి కూడా ఈ సంగతి చెప్పు.. నీ బాబుతో చెప్పుకో..." అని ఉపదేశించి సుబ్బారావు కాలు తీశాడు.

కిందపడిన మున్సిపల్ ఉద్యోగి హడావుడిగా లేచి బ ట్ట లు దులుపు కున్నాడు. జుత్తు సద్దుకొని "నీకు తగిన శాస్తి చెయ్యకపోతే నా పేరు పరిదేశే కాదు..'' అని శపథం పట్టి చరచరా అక్కణ్నుంచి నడిచి వెళ్ళిపోయాడు. రెండో కార్మికుడు పరుగులాంటి నడకతో అతణ్ని అనుసరించాడు. అప్పటికి అప్పల కొండ అక్కడికి చేరుకున్నాడు.

"ఏంటి గురూ.. ఏటి గొడవా"

"ఏటీ లేదులే...పాకీ లంజకొడుకులు. సంవత్సరానికోసారిగానీ ఈ వీధిని శుభ్రం చేయడానికి రారు వచ్చి మరీ పెంటజేసి వెళ్తారు. సరిగ్గా తియ్యండ్రా అంటే నీలిగారు. నీలిగితే నేనూరుకుం టానా. నేనా వూరుకుంటాను? ఒక్కటి చ్చాను.. కిందపడ్డాడు. గుండెమీద కాలేసి తొక్కి సంపేస్తానన్నాను. బిక్కచచ్చి పోయాడు. కాలుతీసేశాను. తోక ముడిచి వాకటే పరుగు" సుబ్బారావు రొప్పుతూనే విజయ గర్వంతో చెప్పేడు.

''కేకలినబడుతూంటే బైటకొచ్చి చూశాం.అలాగొచ్చి చూస్తున్నాం అంత లోకి నువ్వు ఆడ్నెవణ్నో కొట్టేవు.ఎందు కయినా మంచిదని నేను లాఠీ పట్టుకుని వచ్చాను అ దు గో.. కాంతారావు..

చూడెలాగడే న్నాడుతున్నాడో"

అప్పలకొండ చెబుతుండగానే సుబ్బా రావు చూశాడు. స్టేషన్ గేటు దగ్గిర నిల బడి కాంతారావు అసహనంగా ఏవిటేమిటి?' అని చేతులు వూపుతున్నాడు.

సుబ్బారావు చిరునవ్వునవ్వాడు "మన గురూగార్ని తీసికెళ్ళి సెంటర్లోని ట్రాఫిక్ ఐల్లాండ్ మీద పడీయాలి. ఈడి డాన్స్ చూసి జనాలు రోజుకు తొంభై ఏక్సి డెంట్ లు చేసేస్తారు..."

అప్పలకొండ నవ్వేడు. "జాగా చెప్పేవు"

"సుబ్బారావు చొక్కామీది దుమ్ము దులుపుకుంటూ "నేను అరగంటలో వచ్చేస్తాను" అన్నాడు.

"తొందరగొచ్చే. ప్రకాశ్‌రావు తిడ తాడు."

సుబ్బారావు తలవూపి బయలు దేరాడు.

అప్పలకొండ స్టేషన్‌వైపు తిరిగి నడి చాడు.

ఏనుగంత మున్సిపల్ ఎద్దు తోకైనా కదపకుండా నిలబడి వుంది.




బ్రాయిలర్ చికెన్‌షాపులోకి ప్రవేశిం చాడు సుబ్బారావు. "నమస్కారమండి నవాబుగారు సలాం" అని షాపు కౌంటర్‌లో కూచునివున్న ఉస్మాన్‌ని పలుకరించాడు.

"రండి రండి సుబ్బారావుగారూ..."

సుబ్బారావు స్టూలు సర్దుకుని కూచు న్నాడు టోపీ ఒళ్ళో పెట్టుకున్నాడు.

"ఏవి పెక్కడా కనబడ్డవేలేదు"

"ఏమిటి కనబడతావండి... జేబులో డబ్బులు లేకపోతే మీరు మీషాపు గుమ్మం తొక్కనివ్వరు. మా దగ్గిర డబ్బులే వుండవు. మరెలాగ కనబడతాం చెప్పండి"

పోలీసు జోక్కి, ఉస్మాన్ వ్యాపారపు నవ్వు సమాధానంగా ఇచ్చి;

"మిమ్మల్ని డబ్బులడిగితే మేం బతక గలవటండీ..." అన్నాడు.

"అలా అనకండి... చాలా అర్థాలు న్నాయి దాంట్లో. అలాగయితే మేం మీ దగ్గిర ఇన్నిసార్లు మాంసం కొన్నా డబ్బులివ్వకుండా పట్టికెళ్ళావని అర్థం వస్తుంది"

"చంపీసేరు... నేనలాగ అనలేదే. మేం మిమ్మల్ని డబ్బులు అడిగితే బతక లేవన్నాను. అలాగే మీరు డబ్బులు ఇవ్వకపోయినా కూడా బతకలేం...అదే సంగతి... వూ... ఎలాగున్నారు మీ కొత్త ఆఫీసర్లు?"

"ఎర్రబూట్లన్నీ ఒక్కలాగే వుంటాయి నవాబుగారూ... కొత్తయయితే సోగ్గా వుంటాయి; పాతయయితే మెరుగ్గా వుంటాయి. మా కొత్త ఎస్పీకి అనగూడదు గానీ ఖద్దరంటే వుచ్చా, ఖాకీ అంటే సుల కనా. ఎడిషనలెస్పీకూడా కొత్తోడే... కానీ అతగాడి సోదేదో, అతగాడి లోక వేదో మనకి తెలీదు...ఎంతసేపూ నడ్డెన కాతల సేతులు కట్టుకొని తిరుగుతాడు. డి. ఎస్. పీ. కూడా కొత్తోడే... ఈడు డీ.ఐ.జె.కి చుట్టపట. అంచేత మా

 



యస్పీకి ఇప్పుడు ఈడే మొగుడు ఎస్పీకే కాదులెండి... ట్రాఫిక్కోళ్ళకి కూడా ఈడు మొగుడే ఎంతసేపూ ఈడిచ్చే మందుపార్టీలకి చందాలు దండటంతోనే ట్రాఫిక్కోళ్ళకి తెల్లారిపోతాది."

ఉస్మాన్‌కి ఏదో జ్ఞాపకంవచ్చినట్లు కళ్ళూ, కనుబొమలూ ఎగరేసి "అన్నట్టు త్రీటౌన్‌లో వుంటాడు కాశీపతిగారు... సర్కిల్ కదా...అతగాడో ఫస్టుక్లాసగుబ్బ గుంటని పట్టేట్ట నిజమేనా?నాకు ఈమధ్యనే తెలిసింది. చాలా కాలమయిందట కదా? నాకు ఇంతవరకూ తెలీనేతెలీదే" అన్నాడతను.

సుబ్బారావు చీదరించుకొంటున్నట్టు మొహం పెట్టాడు. "ఉస్మాన్‌గారూ! అలాంటి భోగట్టాలే నాకు గిట్టవు. నేను లంచాలు తీసుకొంటాను, జులుం చేస్తాను, ఏదయినా చేస్తాను. కానీ రంకుతనమంటే నాకు గిట్టదు. కాశీపతి పాపిష్టిముండా కొడుకు. గౌరి అని...ఆ పిల్లకు పదహారేళ్ళయినా వుండవట. అడి సంగతి నా

దగ్గిర ఎత్తొద్దు..."

ఉస్మాన్ మొహంలో త్తొట్రుపాటు కనిపించింది-"నిజమే! మా మతం కూడా వ్యభిచారాన్ని అంగీకరించదు" అన్నాడతను పొడిగా.

"అరకేజీ బ్రాయిలర్... అయ్యబాబోయ్... గురువుగారిక్కడున్నారా!? గుడ్మార్నింగ్ అండీ" హడావుడిగా వచ్చిన నారాయణ సుబ్బారావుని చూసి సంబరపడిపోయాడు.

"ఏమయ్యా... సన్నపూసవయిపోయావు?"

"అలాగనీకండి బాబోయ్! మేం బతకలేం... మీలాంటి సీనియర్ల కళ్ళకి మేం కనబడ్డంలేదంటే అది మా దురదృష్టం అనుకోండి. మీరు కూడా మాంసం కొండానికొచ్చారా? సాయిబుగారూ నాకో అర, కేజీ మా గురువుగారికో అర కేజీ చికెన్ కావాలండీ"

"నేను వేరేగా తీసుకుంటాలే నారాయణా! మా ఇంట్లో మంద ఎక్కువ గదా... కేజీ అయితేనేగానీ పంటికిందకో ముక్కరాదు"

"పోనీ కేజీయే తీసుకుందాం. అదేవిటి గురూగారూ నాదగ్గిర అలాగ మొహమాట పడిపోతారేమిటి? భలేవారే"

"థేంక్సయ్యా... ఆమాత్రం అభిమానముంటే అదేచాలు. నవాబుగారూ నాకో కేజీ ఇవ్వండినా డబ్బులు నేను సాయంత్రం ఇస్తాను..."

"అదేటండీ గురువుగారూ" నారాయణ నిష్ఠూరంగా అన్నాడు.

"అదంతే! నారాయణా నువు మరి మాట్లాడకు" సుబ్బారావు గొంతులో సీనియారిటీ ధ్వనించింది.

నారాయణ మరి మాట్లాడలేదు.

మాంసం తీసుకొన్న తరువాత నారాయణ డబ్బులు చెల్లించాడు. సుబ్బారావు థేంక్స్ చెప్పాడు ఉస్మాన్‌కి. తరువాత ఇద్దరూ కలసి బయటికొచ్చారు.

"గురువుగారూ! చాలా ఘోరం జరిగిపోయిందండీ... మీకు చెప్పుకోవాలి. అలాగ హోటలుకెళ్ళి కూచుందాం"

"నేను తొందరగా వెళ్ళాలే... అర్జంటా?"

"అయ్‌బాబోయ్... చాలా అర్జంట్ విషయం గురువుగారూ...అయిదే అయిదు నిమిషాలు..." నారాయణ బతిమాలి సుబ్బారావుని దగ్గిరలోవున్న బ్రాహ్మణ కాఫీ భోజన ఫలహారశాలకు తీసుకు వెళ్ళాడు.

కాఫీ వచ్చినతరువాత ఒకగుక్క తాగి నారాయణ ప్రారంభించాడు. "గురువుగారూ... నాకు దేవుడంటే చాలా బయ్యమండీ. ఆఫీసర్లంటే కూడా నాకు హడలే. మీ దగ్గిర నాకు మొహమాటం ఏటి? రాత్రి మా సీ ఐ నాచేతో ఘోరం చేయించాడు. నాకింతకు ముందు వో కొడుకు పుట్టి పోయాడు. వోసారి మా యావిడికి అబార్షనయిపోయింది. తరువాత భగవంతుడి దయవల్ల వో కూతురు పుట్టి కులాసాగా వుందనుకోండి. కానీ రాత్రి మా కాశీపతిగారు నాచేత చేయించిన పని పాపపుపని. నాకుగానీ, నా కుటుంబానికిగానీ ఆ కీడు చుట్టేస్తాదేవోనని బయ వేసుందండీ చాలా ఘోరమండీ..." అని ప్రారంభించి రాత్రి కోమలా లాడ్జింగ్ హౌస్‌లో జరిగిన సంఘటన వివరించాడు.

కాఫీ తాగుతూ విన్నాడు సుబ్బారావు. చెప్పటం పూర్తి చేసిన తరువాత సుబ్బారావు ఏం చెబుతాడోనని చూశాడు




నారాయణ.

"ముందు కాఫీ తాగు..."

సాసర్‌లో పోసి చల్లార్చుకొని తాగేడు నారాయణ. తాగేసిన తరువాత సుబ్బారావు కేసి చూశాడు.

''నువ్వు నన్ను గురువు కింద ట్రీట్ చేస్తున్నావు కాబట్టి నీకు నిజం చెప్పవల సిన బాధ్యత నామీద వుంది. రైటేనా... రైట్.. విను. నీకు ఎర్రబూట్లంటే భయం, ఖాకీ టోపీ అంటే నీకు వుచ్చ. అదీ సంగతి నువ్వలాంటి పిరికిగొడ్డువుకాబట్టే, ఎర్రి గొర్రెవి కాబట్టే కాశీపతి అలాంటి పని నీచేత చేయించాడు. అలాంటి పని నాకు చెప్తే చెప్పు పట్టుకొని కొట్టేస్తాను. ఖాయంగా.. అందుకే ఆడసలు నాలాం టోడికి అలాంటి పని చెప్పడు. ఇది ఒక పాయింటు. ఇంక రెండో పాయింటు.. ఆడంత దురమార్గపు లంజకొడుకు మన డిపార్ట్‌మెంట్‌లో కనీసం ఇక్కడ మరోడులేడు. అబ్బో రాక్షస లంజ కొడుకు. పోలీసు రావణుదని పేరు పెట్టొచ్చు మనం. గౌరని ఓ అమ్మాయి నీకు తెలుసుకదా.. ఈ లంజకొడుకు ఆ అమ్మాయి తండ్రిని నానా అవస్థలూ పెట్టి దానిని పట్టుకున్నాడు. ఛీ.. లంజ కొడుకు. ఆడి పాపమే ఆడ్ని ఎప్పుడో వో రోజున తినేస్తాది. ఇక మూడో పాయింట్ కొద్దాం. ఇది అసలు పాయింటు. నువు జరిగింది మర్చిపో పాపాలన్నీ ఎర్ర బూట్లకీ, ఖాకీ టోపీలకీ తగుల్తాయి. దేవుడున్నాడు. ఆడుమనల్ని కాపాడు తాడు. నువు అనవసరంగా వర్రీ అయి పోకు. మనం ఎప్పుడూ కూడా మన టోపీని కాపాడుకోవడానికే కష్టపడాలి. ఎలాగైనా పై అఫీకార్లని మంచి చేసు కోవటం ముఖ్యం. అప్పటికిగానీ మనకి లాభం వుండదు. ఒకటి చెప్పు.. పోలీ సోడు నాపాటి ముదిరేసరికి కనీసం హెడ్‌కానిస్టేబుల్ కావాలా వద్దా? అవ్వాలి కదా? నేనయ్యానా? లేదే! ఎందుచేత? నాకీ సంగతి చెప్పే నాధుడు లేక, చెప్పినా అర్థం చేసుకొనే బుర్ర నాకు లేక... మొత్తం మీద నేను నష్టపోయాను. నీ మీద నాకు అభిమానం వుంది. అందు చేత నీకిదంతా చెప్పేను. జాగ్రగుండు. ఎప్పుడూ ఎస్సను, యస్సార్ అను. మనయి యస్సార్ బతుకులు... తెలి సిందా? జరిగింది మర్చిపోయి నేన్చెప్పి నట్టు చెయ్యి. మనం ఎప్పుడూ కూడా పైకి ఎదగడానికే చూడాలి. పక్కకు తప్పుకోడానికి దిక్కులు చూడకూడదు. నువ్వా భయం తగ్గించుకోవాలి. పిరికోడు ఎందుకూ పనికిరాడు. ఇదొకటి నేను చెబుతున్నాను విను. లే.. నాకు టైమ యింది" ఉపన్యాసం చాలించి సుబ్బా రావు లేచాడు.

నారాయణ మొహం చింకి చాటంత అయింది. "థేంక్స్ గురువుగారూ! అందికే నేను మిమ్మల్ని గురువుగారని పిలుస్తాను. ఓ రోజెప్పుడయినా మీరు మా యింటికి భోజనానికి రావాలి. మా యావిడ రెయ్యల పులావు చాలా బాగా చేస్తాది"

సుబ్బారావు నారాయణ భుజం మీద చేయివేసి నొక్కాడు. "నువు పిచ్చి మాలోకానివయ్యా" అన్నాడు.

"థేంక్స్ గురువుగారూ" అన్నాడు నారాయణ.

నారాయణను వదిలించుకొని, ఇంటికి మాంసం ఇచ్చేసి మళ్ళీ స్టేషన్‌కు బయలు దేరాడు సుబ్బారావు.






మున్సిపల్ ట్రాక్టరొకటి అతడిని దాటుకుంటూ వెళ్ళింది. ట్రాక్టర్ మీద అయిదుగురు కూచుని వున్నారు. వెనకాలున్న తట్టిలో మరో అయిదారుగురున్నారు.

"ఎదవనా కొడుకులు" అని వాళ్ళందర్నీ కలిపి తిట్టుకొన్నాడు సుబ్బరావు. నడుస్తూ నడుస్తూ అతను అనాలోచితంగా వెనక్కి తిరిగి చూశాడు.

నిడుపైన వెడల్పయిన ఆ రోడ్డు మీద అతనికికనిపిస్తున్నంతమేరఓపదిపది ష చె త్తబళ్ళు తమకు సాధ్యమయినంత వేగంగా వస్తూ కనిపించాయి.

సుబ్బారావు తల తిప్పి ముందుకు చూశాడు.

ముందురోడ్డుమీద అంత దూరాన వో అయిదారు బళ్ళు కనిపించాయి.

అతనికి అనుమానమే గుండెలలో పీకగా ప్రారంభం అయింద.

'ఎక్కడికి చెప్మా పాకీనాకొడుకులంతా కలిసి ఒక్క దగ్గిరకే బయలు

దేకిసట్టున్నారు' అనుకున్నాడతను.

అతని ప్రయత్నంలేకుండానే నడకలో వెగం పెరిగింది.

ఓ ఇరవై అడుగులు వేసేసరికి అత నికి అనుమానం గట్టిపడిపోయింది.

'రైటే! ఈ బళ్ళన్నీ వన్‌టౌన్ మీదికే గావాల్లా దేవుడా' అనుకున్నాడతను.

ఊర్లో పెతి లంజకొడుక్కీ పోలీసో దంటే అనువయిపోయింది. కొట్టకూడదు, తిట్టకూడదు. కొట్టానికి, తిట్టానికి వీలులేక పోతే ఎలాగ? లంజకొడుకులకి యూని యనుంది గదా. గొడవ చేస్తారు. చెయ్యనీ, చెయ్యనీ..

మరింత వేగంగా నడవటం ప్రారం భించాడు. ఒక చెత్త బండిని దాటేడు.

"కానిస్టేపు దొరగారు సికారుకి బయ ల్దేరి నట్టున్నారు. గురప్పగారూ! మీదే పేష నండీ?" ఆ బండిలో నుంచున్న ఓ ఆసామీ అడిగాడు.

సుబ్బారావు సమాధానం చెప్పలేదు.

"ఒక వేళ వన్‌టౌన్ అయితే మా రథమెక్కిపోండి. మేం కూడా అక్క డికే బయలుదేరాం" ఆ వ్యక్తి ఆహ్వా నించాడు వెటకారంగా.

సుబ్బారావు మాటాడలేదు.

"ఏవిటి గురూ.. మాట్లాడ్డవేలేదు. వన్‌టౌన్ పోలీస్‌స్టేషన్‌ల చాలా చెత్త పేరుకుపోయిందిటగదా. మేమందరవూ అక్కడికే ఎల్తన్నాం.చెత్తంతాతీసి పెంట మీద పారేస్తాం... ఇంటన్నారా?" బండి లోని వ్యక్తి కేకవేస్తూ చెప్పాడు.

'అక్కడికేనన్న మాట, అందుకేనన్న మాట. రండి లంజకొడకల్లారా. స్టేషను దగ్గిర మీకివాళ బడితపూజ చేయిస్తాను. రండ్రండి' అనుకొంటూ అతను చాలా కోపంగానూ, వేగంగానూ నడుస్తూ వన్ టౌన్ పోలీస్‌స్టేషన్ వీధికి వెళ్ళేలోపల అయిదారు బళ్ళను తప్పించుకున్నాడు.

వీధిలోకి తిరుగుతూనే అతను చటు క్కున నిల్చుండిపోయాడు.

దాదాపు వీధి పొడవునా చెత్తబళ్ళే. స్టేషన్‌కు అటూ, ఇటూ జనమే.

'పెద్దగొడవే అవుద్ది'గొణుక్కున్నాడు సుబ్బారావు.

గుండె దిటవుచేసుకొని శత్రువాహనా లను చకచకా దాటుకుంటూ అతను స్టేషన్ సమీపానికి వచ్చాడు.

స్టేషన్ దగ్గరవుతున్న కొద్దీ శత్రుపక్షం ఎక్కువగా వుంది. నాలుగయిదు ట్రాక్టర్లు తగిలాయి. వాటిమోతా,పారిశుధ్య పనివారి కేకలూ అంతా గందరగోళంగా వుంది.

చేతులో లాఠీయైనా లేదు. ఏ పిచ్చి నాకొడుకైనా చెయ్యిచేసుకోవచ్చు. కాలం అలాగుంది. పోలీసోడంటే లెక్క లేనంటా వుంది. ఇంతమందిని దాటుకొని స్టేషన్‌కి వెళ్ళటం రిసుకే. ఎవదన్నా పోలిసే చికాకు. కానీ తప్పుతుందా? టోపీనితీసి చంకనపెట్టాడు. ఊపిరితిత్తుల నిండా ధైర్యాన్ని బిగపట్టేడు.

మెరుపులాగ జనాన్ని చీల్చుకుని స్టేషన్ ముందుకొచ్చాడు. అతనిముందు పదిమంది రిజర్వు పోలీసులు ఖాకీకంచె కట్టివున్నారు. వెనకాల మున్సిపల్ నాల్గోతరగతి ఉద్యోగుల సేనలున్నాయి.

పరవాలేదు అనుకున్న మీదట సుబ్బా రావు ఊపిరివదిలి శత్రుసేనకేసి చూశాడు పరీక్షగా.

అతనిచూపు తిన్నగా ప్రధాన శత్రువు మీదే పడింది. సుబ్బారావు చేతిలో దెబ్బ తిన్న కార్మికుడు తలకు ఏడు గజాల

బాండేజీ చుట్టినట్టున్నాడు. అతను కూడా సుబ్బారావుని చూసి చూపుడువేలు సాచి-

"అదే[నా ! అదే[నా నాయినా... అదే[నాబాబూ అదేఅదే... అదే[నాఅదే" అని అతను గోలగోలగా అరుస్తూ సుబ్బారావుని మిగిలినవారికి చూపించాడు.

సందడంతా ఒక్కక్షణం తగ్గింది.

కొన్ని వందల కళ్ళు సుబ్బారావుని చూసేయి.

సుబ్బారావు గభాలున రిజర్వ్ పోలీసుల దడి చీల్చుకుని, వారి వెనుకకు వెళ్ళి నిల్చుని మున్సిపల్ వుద్యోగులకేసి చూశాడు. వాళ్ళు గుంపుగాచేరి ఏదో మాట్లాడుకుంటున్నారు. ఒకవ్యక్తి చేతులు పైకెత్తి నిశ్శబ్దంగా ఉండమన్నట్టు సంజ్ఞ చేశాడు.

అదేసమయంలో వీధి రెండోవైపు నుంచి కం[ట్రోల్‌రూం వ్యాను ఒకటి మలుపు తిరిగింది.

సుబ్బారావు స్థిమితపడ్డాడు. ఫరవాలేదు. ఈ ఫోర్సుచాలు పొకీనాకొడుకుల్ని పాతేడానికి అనుకొన్నాడతను.

వున్నట్టుండి వీధిలో నిశ్శబ్దం అలుముకుంది. కార్మిక నాయకుడు వొకతను పిడికిలి బిగించి చేయి పైకెత్తి-

"పోలీస్ జులుం" అని పెను కేక వేశాడు.

"నశించాలి"

"నశించాలి" వందలాది గొంతులు శపించాయి.

మళ్ళీ నిశ్శబ్దం.

మళ్ళీ కేక

"గంజిపెట్టిన ఖాకీ దుస్తులూ ఏమి కావాలిరా?"

"చిరిగిపోవాలీ"



"చిరిగిపోవాలీ"

"చివికిపోవాలీ"

"చివికిపోవాలీ"

'హమ్మ లంజాకొడకల్లారా... ఎంత బాగా [టెయినింగయినార్రా' అని సుబ్బారావు ఆశ్చర్యపోయాడు.

నిశ్శబ్దం

దాన్ని చీల్చుకుని మరోకేక-

"నాయినా! నావావేసిన నల్లబూట్లన్నీ ఏమి కావాలిరా?"

"అరిగిపోవాలీ"

"అరిగిపోవాలీ"

"చిరిగిపోవాలీ"

"చిరిగిపోవాలీ"

వింటున్న సుబ్బారావు భుజమ్మీద ఎవరో చెయ్యివేశారు.

సుబ్బారావు వెనక్కి తిరక్కుండానే "వుండు" అని సంజ్ఞచేశాడు చేతితో.

కార్మికనాయకుడు మరో నినాదం ఇచ్చాడు-

"బాబూ పాలీష్ కొట్టిన ఎర్రెర్ర బెల్టులూ ఏమి కావాలిరా?"

"ముక్కిపోవాలీ"

"ముక్కిపోవాలీ"

"ముక్కలై పోవాలి"

"ముక్కలై పోవాలి"

వందలాది గొంతులు సుశిక్షితంగా, స్పష్టంగా అరిచాయి.

"పోలీసువారికిది ఏమి కాలమురా?" మరో కేక.

"చెడ్డకాలం బాబూ"

"చెడ్డకాలం"

"చేటుకాలం బాబూ"

"చేటు కాలం"

"మీ యందరికీ మాత్రం పోయేకాలం" అన్నాడు సుబ్బారావు కోపంగా.

"లోపలికిరా గురూ!"

సుబ్బారావు తల తిప్పి చూశాడు. రిజర్వ్ కానిస్టేబుల్ లక్ష్మణరావు.

"మీ యస్సాయి అగ్గిమీదున్నాడు. రమ్మంటున్నాడు."

"దవడ పళ్ళు రాలగొట్టేసాను మా యస్సాయికీ, నీకూను. ఎవడిమీద అగ్గయి పోతాడు. పద లోపలికి. నేనూ చూస్తాను ఎవడిమీద అగ్గయిపోతాడో?" సుబ్బారావు చిటపటలాడుతూ లోపలికి ప్రవేశించాడు.

పిడకలపొయ్యి మీద నీళ్ళ కాగు కూచున్నట్టు కుర్చీలో కూర్చుని వున్నాడు ఎస్సాయి ప్రకాశరావు.

లోపలికి వస్తూనే సెల్యూట్ చేసిన సుబ్బారావుని చూసి అతను నీరు మరిగి నట్టు సలసలా మరిగేడు.

"ఏం సుబ్బారావు! ఏవిటి న్యూసెన్స్? మున్సిపాల్టీవాళ్ళ జోలికెందుకెళ్ళావు? నేనో, ఇన్‌స్పెక్టర్‌గారో ఏవైనా అంటే అధికార్ల జులుం ఎక్కువయిపోయిందని సణుగుతారుగదా! నీకేం అధికారం వుందని ఆ స్వీపర్ మీద జులుం చేసేవు? చూడి ప్పుడు. మొత్తం టౌన్‌లో స్వీపర్స్ అందరూ స్టేషన్ మీదికి దాడి చేసేశారు. చూడు వాళ్ళెలాగ తిడుతున్నారో? అసలే మన్ది తిట్లుతినే డిపార్ట్‌మెంట్. అసలు సువ్వా సమయంలో ఏమి పనుందని బయటకెళ్ళేవు? నేనొచ్చే లోపల ఏమి అర్జంట్ పనుందని దొబ్బేసేవు. ఛ..ఛ.. నేనెంత మర్యాదగా చూద్దామనుకున్నా మీరిలాంటియి మానరు. ఎస్పీకి అప్పుడే నెత్తికెక్కిపోయింది. జనాన్నేవన్లేడు. నిమీదా, నా మీద ఎగిరిపోతాడాయన.."

"అదికాదుసార్! నాదేం తప్పులేదుసార్! సక్రమంగా పని చెయ్యవోయ్ అని హితం చెప్పేను సార్! అదిసార్ నేన్చేసిన తప్పు. ఆ మాట అన్నానని ఆ లంజ కొడుకులు నన్నూ, డిపార్ట్‌మెంట్‌నీ అమ్మా ఆలీ బూతులు తిట్టేరు సార్ ఈ టోపీ పెట్టుకున్నాక అలాంటి తిట్లు తింటూ పడివుండగలనా సార్? ఆడు నా మీదకి కొట్టడానికి వచ్చినప్పుడు కూడా నేను గాంధీ పోలీసులాగ కిక్కురుమన కుండా వుండగలనా సార్? పోలీసువాడి ఒంటిమీద చెయ్యివేసినోడు బతికి బైట పడొచ్చా సార్? అయితే నేను చాలా నిగ్రహించుకున్నాను సార్! ఒట్టిచేత్తో చెంప మీద వొక్క దెబ్బ కొట్టేనుసార్! తమరేగానీ ఆ సీన్లో వుంటే అడ్డీ కాల్చి పారేసేవారు సార్."

"పీకమీద అడుగేసి చంపబోయా వ్రట"

"నేనేగాని ఈ బూటుకాలితో ఆడిపీక మీద అడుగేస్తే ఆడింకా బతికి వుంటాడా సార్? మీరే చెప్పండి. బైట ఆ లంజ కొడుకులు మనల్నందర్నీ ఎలాగ తిడు తున్నారో వినిపిస్తూంది కదా సార్! నేను తప్పుజేస్తే నన్ను తిట్టాలి. నా యింటి మీదికి వచ్చిపడాలి. కానీ మొత్తం డిపార్ట్ మెంటంతా తిట్లుతిని వూరుకోవాలా సార్? ఏకంగా స్టేషన్ మీదికి వచ్చి పడ్డారంటే మనవంటే ఎంత అలుసుగుందో చూడండి సార్. నేనేగాని తమ స్థానంలో వుంటే వాళ్ళలో సగంమందికిఈపాటికి బడితెపూజ చేయించేద్దును. మిగిలిన లంజాకొడుకులు ఈపాటికి పుంజాలు తెంపుకు పారి పోదురు" సుబ్బారావు ఆవేశపడ్డాడు.

అదే సమయంలో బైట గోల ఎక్కు వయింది. "ఎస్.పి. దొరగారొచ్చేరు" అని ఓ కానిస్టేబుల్ ప్రకటించాడు.

ఎస్సాయి ప్రకాశరావు నిట్టూర్చి బైటకి నడిచాడు.



సుబ్బారావు తల లాటించాడు.

'రానీ..ఏవిటి? మహాఅయితేసస్పెండు జేస్తాడు. అంతేగదా! పీక తీసేలేడుగదా' అనుకున్నాడతను. గోడ మీద అంకెల కాలెండర్‌కేసి చూస్తూ నించున్నాడతను.

అయిదు నిమిషాలు భారంగా గడిచాయి.

బైట అప్పుడప్పుడు గోల ఎక్కువయి తగ్గుతోంది.

మరో అయిదు నిమిషాలు.

రిజర్వ్ కానిస్టేబుల్ లక్ష్మణరావు సుబ్బారావు దగ్గిరకొచ్చి "నిన్ను రెండ్రోజులు సస్పెండు చేస్తే చాలంటున్నాడు ఆళ్ళ యూనియన్ లీడరు. ఎస్.పీ. బేరవాడతన్నాడు" అని సమాచారం అందించాడు.

సుబ్బారావు వెర్రినవ్వు నవ్వేడు.

మరో నాలుగయిదు నిమిషాల తర్వాత ఎస్.పీ. లోపలికొచ్చాడు.

అతను చాలా కోపంగా, చికాకుగా, ధుమధుమలాడుతూ వున్నాడు. అతని వెనుకనే వచ్చిన ప్రకాశరావు సుబ్బారావు ఎవరో ఎస్.పీ.కి చూపించాడు.

ఎస్.పి. పార్థసారథి సుబ్బారావు పెట్టిన వందనాన్ని స్వీకరించకుండా వచ్చి ఎదురుగా నిల్చుని,

"రెండు రోజులపాటు నిన్ను సస్పెండ్ చేస్తున్నాను" అన్నాడు.

సుబ్బారావు సెల్యూట్ చేశాడు.

"యస్సర్"

బైటనుంచి మున్సిపల్ వుద్యోగుల జయజయ ధ్వానాలు వినిపించాయి.

ఎస్సయి ప్రకాశరావు సుబ్బారావు కేసి జాలిగా చూసేడు.




కాశీపతి తాపీగా బట్టలుతొడుక్కున్నాడు.

ఒంటిమీద బట్టలు లేని గౌరి వెల్లకిలా పడుకుని రొమ్ముల మీద మంట పెడుతున్న పంటిగాట్లను తడుముకుంటోంది.

సగం చచ్చిన వెలుగు బెడ్‌రూం దీపం నుంచి బూడిదలాగ రాల్తోంది.

స్టూలుమీద పడివున్న చీరా, జాకెట్టు, లంగా తీసి మంచం మీదికి విసిరేడు.

"కట్టుకో"

గౌరి కదల్లేదు.

"బట్టలు కట్టుకోవా? ఏం నేనెల్లేక మరెవడన్నా వస్తాడా?" అని అడిగాడు కాశీపతి.

గౌరి చివాలున లేచి కన్నార్పకుండా కాశీపతికేసి ఓ క్షణం చూసి, మవునంగా బట్టలు కట్టుకుంది.

కాశీపతి గదిలోని పెద్ద దీపం వెలిగించాడు. చేతినున్న గడియారంకేసి చూసుకున్నాడు.

తరువాత మంచం మీద కూచుని సిగరెట్ వెలిగించాడు.

"ఇందాక నేను ఇక్కడికి వచ్చేసరికి రోడ్డుమీద ఎవడో గుంటడు తారట్లాడుతున్నాడు. ఇంతకు ముందొకసారి కూడా వాడ్ని వీధిలో చూశాను. ఎవడాడు?"

"నాకు తెలీదండీ"

"నీకు తెలీకపోయినా నాకు తెలుస్తావిలే. పిచ్చి పిచ్చి వేషాలేస్తే నరికి పోగులు పెట్టేస్తాను.జ్ఞాపకం వుంచుకో. ఆ... మీ పెద్దయ్యా, పెదనాన్నా ఆడికి ఇంక అయి పోతాది. పూరాగా ఖర్చుకిచ్చేస్తాను. తాగేసి నన్ను నానా పేలాపనా పేల్తున్నాట్ట కాళ్ళూ, చేతులూ తీయించేస్తాను. కాస్త మీ నాన్నకి చెప్పు"

గౌరి తల వూపింది ముని వేళ్ళతో జుత్తు సర్దుకుంటూ. కాశీపతి మరోసారి వాచీ చూసుకుని లేచి నిలబడ్డాడు.

"నేను పోతానిక. ఇందాక నేనన్న మాటలు గుర్తు పెట్టుకో. నాకు వుత్తపుణ్యానికి అనుమానం రాదు. అనుమానం వచ్చిందంటే వూరికే వదలను"

గౌరి మాట్లాడలేదు. కాశీపతి వీధి తలుపు తీస్తుండగా "ఏమండీ" అని పిలిచింది.

కాశీపతి వెనక్కి తిరిగాడు "ఏమిటి?"

గుటకలు మింగింది గౌరి "అయ్య దబ్బులుంటే అడగమన్నాడు"

కాశీపతి జేబులోనుంచి పర్సుతీశాడు. పది పదులు లెక్కపెట్టి గౌరికి ఇచ్చి



"వారానికో, పదిరోజులకో ఎంతకావాలో అడుగు. కంపినీ లంజలాగ రోజుకోసారి అడక్కు. నాకు అసహ్యం" అన్నాడు.

గౌరి కళ్ళల్లో రివ్వున నీళ్ళు తిరిగాయి.

ఏమీ అనలేదామె. ఆమె చేతిలోని కాగితాలు కరుగ్గా వున్నాయి. "తలుపు వేసుకో" కాశీపతి బైటకి వచ్చాడు.

తలుపు దగ్గిరకొచ్చి నించుంది గౌరి.

కాశీపతి వీధంతా పరికించాడు.

పన్నెండు గంటల రాత్రి వీధిలో ఒళ్ళు మరిచి నిద్రపోతోంది.

కాశీపతి మోటార్ సైకిల్ స్టార్ట్ చేసి స్టాండు దించాడు. సైకిల్ మీద కూచుని గౌరికేసి చూసి తల వూపాడు.

గౌరి మొహం కనిపించటంలేదు. సైకిల్ పోనిచ్చాడు కాశీపతి.

వీధి చివరి వరకూ వెళ్ళి బ్రేకువేసి వెనక్కి తిరిగి చూశాడు.

అప్పటికే గౌరి తలుపు మూసేసి నట్టుంది. చీకటిగా వుంది ఆ ఇంటి వరండా.

కాశీపతి బ్రేకు వదిలి గేరు మార్చాడు. సైకిల్ ముందుకు దూకింది.

అయిదు నిముషాలపాటు ప్రయాణం చేశాక తానుండే ప్రాంతం దగ్గిర పడింది. వీధులన్నీ నిర్జనంగా వున్నాయి.

మురికి వీధిలోకి అతని వాహనం మలుపు తిరిగింది. ఆ వీధి దాటి కుడి వైపు సందులోకి మళ్ళితే అతని ఇల్లు.

మురికి వీధి మరీ చీకటిగా వుంది.

అతని సైకిల్ చప్పుడు వికృతంగా వినిపిస్తోంది.

వీధి మధ్యకు వచ్చాడతను. రోడ్డు మధ్య ఎవరో నించుని వున్నారు.

సైకిల్ లైట్ ఆ వ్యక్తిపై పడింది.

పేంటూ, లాల్చీ కనిపిస్తున్నాయి. సైకిల్ ఆపమన్నట్టుగా అతను చేయి వూపుతున్నాడు.

కాశీపతి బ్రేకు వేశాడు.

ఆ వ్యక్తిని దాటి పది గజాలవతల సైకిల్ ఆగింది. బ్రేకు మీద వుంచి, తల తిప్పాడు కాశీపతి.

ఆ వ్యక్తి పరుగు పరుగున వచ్చాడు.

"ఏవిటి" అని అడిగిన కా శీ ప తి 'అమ్మా' అని కేక వేశాడు వెనక్కి చూస్తూనే.

కుడిచేతి పక్కనుంచి అతని వీపులోకి పిడిదాకా దూసుకుపోయింది ఓ కత్తి.

కాశీపతి అమ్మా అని కేక వేస్తుండ గానే మళ్ళీ మరో పోటు. వీపునున్న కండ రాల్ని చీల్చి, ఎముకల గూడును కోసిన రెండో పోటు అతని హృదయాన్నే తాకింది.

భగ్గు భగ్గున ప్రాణాన్ని పీల్చివేస్తూ బాధ.

చావుకాటు చీకటి కోర.

డాక్టర్.. డాక్టర్ అంది కడగట్టి పోతున్న అతని స్పృహ. బ్రేకు వదిలి అంత బాధలోనూ గేరుమార్చి ఆక్సిలేటర్ తిప్పాడు కాశీపతి పళ్ళ బిగువున.

అప్పుడు మూడో పోటు.

ఎడమపక్క ఎముకల్లో చిక్కుకుని కత్తి దూరి పోయింది. భగ్గుభగ్గున బాధ.

వీపంతా తడిసిపోతూ వె చ్చ గా వెచ్చగా...

సైకిల్ ముందుకు దూకింది.

పెనుకేకలు వేస్తూ అది ముందుకు పోయింది.

కాశీపతిని చల్లటిదేదో ఆవహిస్తోంది.

మొదటి పోటు తిన్నప్పుడు, చటాలున తల తిప్పినప్పుడు మసక వెల్తుర్లో

తనని పొడిచిన వ్యక్తి మొహం చూసే దతను.

కాశీపతి చేతులు విడిపోతున్నాయి. ఆ మొహం ఎవరిదో చటుక్కున జ్ఞాపకం వచ్చింది కాశీపతికి.

సరిగ్గా అప్పుడే అతని చేతులు జారి పోయాయి హేండిల్ నుంచి.

వీధి మలుపులో వున్న ఇంటి ఇనుప గేటుకి అతని మోటారుసైకిల్ ఢీకొనే టప్పటికి కాశీపతికి జ్ఞాపకం లేదు.

* * *

సూరీడు సంతోషంగా చప్పట్లు చరిచాడు. మూసేసిన కిరాణాకొట్టు మెట్ల మీద కూచుని వున్నాడతను. అతని పక్కనే మరో ముసలతను కూచుని వున్నాడు.

పరమ సంతోషంగా నవ్వేడు సూరీడు "సెభాష్. ఒక్కడయినా వున్నాడు మనూర్ల మొనగాడు. సెభాష్. కాశీపతిగోడ్ని ఒక్కేటుకు సఫా జేసి నోడు! సెభాషరా బిడ్డా! నీ వల్ల వూరికి పేరు. మరికొంచెం మందేసుకునుంటే నీ మీద పదం కడుదును. ఈ యాపున నువ్వేగాని కంటికి అగుపిస్తే నా పేగులు తీసి మెడలో దండేద్దును..."

"వొల్లకోరా ముసిలి నా కొడకాతా గే సేటి నూసెన్సు" సూరీడు పక్కనున్న వ్యక్తి కసిరాడు.

"కాశీలంజికొడకు. ఎలాగుండీవోడు.. ఎనుబోతులాగుండీవోడు. ఆబోతులాగ పోతరించి పోయి తిరిగేవోడు. సవర్తి సాప మీద నుంచి లెగిసి ఏడాదయినా అవలేదు. నా తమ్ముడి కూతురు ఈ లంజ కొడుకు కళ్ళ బడింది. అయిపోయింది దాని బతుకు. లంజకొడుకు నాశనం జేసే శాడు. ఈడేగాని దాన్ని చెరబట్టకపోతే ఈపాటికది మాసక్కా కాపరం జెయ్యా వలిసింది. ఎంత సక్కని పిల్ల రాసో లింట పుట్టవలసినంత సక్కగుంటాది ఆ సక్కదనవే దానిబతుకునిలాగ చేసింది. ఈ లంజకొడుకు దాన్ని చూసేడు. అనుంగా పీనుగులాగ, అన్నం మెతు కోసం అల్లాడిపోయిలాగున్న నా తమ్ముడ్ని చూసేడు. ఆడిమీద తన పోలీసు తనవంతా చూపించాడు. కేసు బనాయించి బొక్కలెట్టేడు. లాఠీ చూపించాడు, తుపాకి చూపించాడు, ఆ యెనక ఈ ఖాకీ లంజికొడుకు డబ్బులు చూపించాడు. కుళ్ళు దగ్గుతో సచ్చీలా గుండి, కూలిదొరక్క యాతన పడి పోతున్న నా తమ్ముడు పడిపోనాడు. సేతిల్తో కూతుర్ని ఆడికి అప్పగించీ సేడు. మజ్జానం నా తమ్ముడింటికెళ్ళాను. మొగుడే పోయినట్టు శోకాలెదతాంది ఆ ముంత పాప. ఇకనెలాగరా బతకడం అంటన్నాడు నా తమ్ముడు. సీ ఆడా. ఆ సచ్చు సన్నాసి లంజకొడుకా నా తమ్ముడు. ఆడ్నా తమ్ముడే కాదెయ్. వొయసు వంటి మీదికొచ్చి నేనిలాగ అయిపోన్ను. లేకపోతే ఈ కాశీగాడు నా సేతిల ఎప్పుడో మట్టిలో కలిసి పోవల్సింది..."

ముత్యాలు మోచేతితో సూరీడి డొక్కలో పొడిచి, వేలితో స్తంభం పక్క నీడలో నిల్చునివున్న ఇద్దరు పోలీసు కానిస్టేబిల్స్ని చూపించాడు.

"ఇందాకట్నించి చూస్తున్నాను. తెగ పేలుతున్నావు. మందుమీదున్నట్టున్నావు జాగర్త" అని సుందరయ్య హెచ్చ రించాడు ముందుకు వచ్చి.

"మందుమీదుండబట్టే దయిర్యంగా

మాటాడతన్నాను బాబూ.. కాశీపతిని ఖూనీ చేసినోడెవడో తెలిస్తే చెప్పవయ్యా దేవుడా"

"చూస్తుంటే ఆ ఖూనీ చేసింది నువ్వే లాగుంది" అన్నాడు సుందరయ్య పక్కనేవున్న జోసెఫ్.

"నానా ?" సూరీడు వడలిపోయి వేలాడుతున్న తన దండల్ని. పండి పోయిన చేతులనూ చూసుకున్నాడు. "నాకంత సతువుంటే ఈ ఖూనీ ఎప్పుడో జరిగిపోయివుండేది. ముసిలోడ్నయి పోనాను కొడకా" అని, రాలిపోగా మిగిలిన పళ్ళు బైటపెట్టి నవ్వాడు.

"ఎదవ పేలాపన. ఎదవ పేలాపన... ఇంటికి పోయి తొంగో... పోలీసోళ్ళ సంగతి నీకెందుకు. బేడసారా తాగి పీకల మీదికి తెచ్చుకుంటారు. పిచ్చి నాకొడుకులు" మందలించాడు సుందరయ్య.

"బాబూ... ఆ మాటకేటిగానీ మద్యాన్నం చేసి పోలీసులందరూ



వూరేగింపు తీసేరట నిజవేనా?" ముసిలిగా, మర్యాదగా అడిగాడు సూరీడు.

సుందరయ్య, జోసెఫ్ వెళ్ళిపోయే వుద్దేశంతో కదిలారు "కాశీపతిగారి శవాన్ని ఊరేగింపుగా తీసుకెళ్ళి దహనం జేసేం".

"అదా...అదదీసంగతి.నాయనలారా అలాంటి వూరేగింపులు వారానికోటి జరగాలని నేను సింహాచలం అప్పన్న బాబుకి దండవెడుతున్నాను. అలాంటి దుర్మార్గుల్ని వారానికొకడ్ని వొసనాలకి పంపీయాలని తిరపతి దేవుడు బాబుని కోరుతూ ఈ ఎల్రిట్రీ తంబానికి మొక్కుతున్నాను.." అన్నాడు సూరీడు తూలుతూ లేచి విద్యుత్ స్తంభానికి సమస్కారిస్తూ.

"పద సుందరయ్యా. ముసిల్లంజ కొడుకుని తీసికెళ్ళి మర్దనా చేద్దాం. తెగ నీలుగుతున్నాడు. పోనీకదా అని వూరు కుంటే మరీ పెట్రేగిపోతన్నాడు. ప్రతి లంజాకొడుక్కీ పోలీసోడంటే అనువయి పోయినట్టుంది. ముసలి పీనుగు. తోసే తొంభయి దిక్కుల పడేలాగున్నాడుగానీ తెగనీలుగుతున్నాడు" జోసెఫ్ కోపంగా సూరీడు వంక ఒక అడుగు వేశాడు.

సుందరయ్యా అతడ్ని వారించి "ఒరే ముసిలోడా. నేనేగాని లేకపోతే మా బ్రదరీపాటికి నీ కీళ్ళు విరిచేసును. ఇంటి కెళ్ళి తొంగుండిపో. రేపోమాపో సచ్చేలా గుండి నీకిదేం పోయేకాలం. నిన్ను జూస్తే మంచాన వున్న మా నాయిన గుర్తుకొస్తున్నాడు. అందుకని జాలి చూపిస్తున్నాను" అన్నాడు.

సూరీడు జోగిపోతూ పకపకనవ్వేడు. "వోరి పోలీసు బిడ్డా. నన్ను జూస్తుంటే నీకు మీ నాయిన గుర్తుకొస్తన్నాడా? నాకు మాత్రం నిన్ను జూస్తుంటే మన ముసలి సేర్మెనుగారు గుర్తుకొస్తన్నారా. నువ్వు ఎప్పురికి పుట్టేవో నాకు అనుమానంగుంది" అన్నాడు.

మరుక్షణంలో సూరీడు పక్కనున్నాడు సుందరయ్య. అతని చేతిలో సూరీడు జుత్తుంది "ముసిల్లంజకొడకా. ఏట్రా పేలావు. ఏట్రా కూసేవు. నిన్నెంత మర్యాదగా చూస్నేనా నేనూ. అలాంటిది ఏట్రా పేలేవు. నీ నాలిక చీరేసానుండు. ముసిలి లంజకొడకా. పీకమీద అడుగువేసి మట్టేగల్ను" తిడుతూనే సూరీడ్ని వంచి వీపుమీద పిడిగుద్దు గుద్దేడు.

"సంపేసినార్రోయ్" గావుకేక వేస్తూనే సూరీడు సుందరయ్యా చేతుల్లోంచి తప్పించుకోబోయి మెట్ల దగ్గిర తూలి కిందపడ్డాడు.

సుందరయ్య అతని దగ్గిరకు వెళ్ళి నిల్చున్నాడు "లెగరా ముసలితొత్తు కొడకా. ఇవాళ నీ ప్రాణాలు తీసేస్తాను. లెగుముందు. ఈవాల్టితో నీ పని సఫా.. నువు నా చేతిలో సఫా. లెగు చెపుతాను."

అంతవరకూ వీధి అరుగుల మీదా, గుమ్మాల ముందున్న మంచాల మీదా, పక్కనే వున్న కిళ్ళీ బడ్డీ దగ్గిరా, రోడ్డు పక్కనా నిల్చుని వున్న చాలామంది ఈ లోపున అక్కడికి చేరేరు.

ముసలి ఎద్దు నానాయాతనా పడిలేచినట్టు లేచేడు సూరీడు. లేస్తూనే తిట్లు ప్రారంభించాడు.

"సియమ్మా యాలీ ముండ మొయ్యా.. ముసలోడ్ని అనుంజేసి కొడతార్రా? మీ రక్తం తాగుతానీయేళ. ఏటనుకుంటున్నారో ఏటో. సవాల్.."

సుందరయ్య పిడికిలి బిగించి సూరీడి డొక్కలో పొడిచాడు. బూటుకాలుతో సూరీడి మోకాలిమీద తన్నేడు.

"సూరీడు పెనుకేకవేస్తూ నేలకూలి వానపాములాగ గింజుకుని భళ్ళున కక్కుకున్నాడు. "సంపేసేరు. సంపేసేరు లంజకొడుకులు" అని అతను గొణుక్కున్నాడు.

"పీకమీద అడుగేసి తొక్కేగురూ లంజికొడుకులు పోలీసోడంటే లెక్కలేకుండ పోయింది"

సుందరయ్య జోసెఫ్ సలహా కొంతయినా పాటించాలనే సంకల్పంతో వంగేడు.

"సాల్లెండయ్యా! ఆడు సగం సచ్చే సచ్చేడు."

సుందరయ్య నిటారుగా నుంచుని చుట్టూమూగిన జనాన్ని చూసి "ఎవడా జడ్డి?" అనడిగేడు.

"ముసిలి ముండకొడుకుని సంపేకండ్రా అని చెప్పడానికి జడ్డీలే వుండక్కర్లేదయ్యా. మనిషయినోడెవడన్నా ఆ మాత్రం మాటంటాడు" గోల్డుఫ్రేం కళ్ళద్దాలు పెట్టుకున్న ఓ వ్యక్తి అన్నాడు.

"అబ్బొసి.. ఈ కాపు వీధిలో మనుషలు కూడా వున్నారా? మరయితే ఈ ముసలి లంజకొడుకు పోలీసుల్ని నానా బూతులూ తిడుతుంటే ఈ మనుషులంతా ఏవైనారో? అప్పుడు మీరందరూ నోట్లో ఏటిపెట్టుకున్నారు?" సుందరయ్య కోపంగా అడిగాడు.

"తాగినోడు పేల్తే బుద్ధివున్నోడెవడూ పట్టించుకోడు. అదే తాగనోడు పేల్తే చెప్పుతీసి కొట్టేస్తారు. నువు మాటలు జాగర్తగా రానీయ్ గురూ.. తాగినోడు పేలేడు. కాబట్టి నువ్వాడ్ని కొట్టేవు. సరిపోయిందికదా." కళ్ళద్దాల వ్యక్తి అడిగాడు.

"లేనిపోని విషయాల్లో కలగజేసుకోడం మానేసి ఎవడిదార్ని వాడు పోడం మంచిది. మీకే చెబుతున్నాను. ఈడు మమ్మల్నీ, డిపార్ట్‌మెంట్‌నీ తిట్టేడు. మేం ఆడ్ని కొడతాం, తంతాం. ఇంకా కోపం వస్తే పాతేస్తాం. అది మీకు అనవసరం" జోసెఫ్ గద్దించాడు.

"ఆడు మావోడు కాబట్టి మాయందరికీ అవసరం అయింది. కొట్టేసి, తన్నేసి, పాతడానికి ఇక్కడెవరూ సవగ్గా లేరు. ఇది కాపు వీధి. జ్ఞాపకం వుంచుకోండి. ఆడసలు సచ్చేలాగున్నాడు మీరు కొట్టిన దెబ్బలకే కునికీసును. సారా తాగి పేలాడుగానీ, లేకపోతే మాట్లాడ్డానికయినా ఆడికి వోపికుందా? వూపిరుందా.. ఆడేటి తిట్టేడో నాకు తెలీదు కానీ తిట్టేవుంటాడు. ఆ ముసిలోడి నోరు మంచిదికాదు. తిట్టేడు కాబట్టే మీ చేత తిన్నాడు. ఆడికి శాసి అయింది" కళ్ళద్దాల వ్యక్తి సర్దిచెప్పే ధోరణిలో నెమ్మదిగా మాట్లాడేడు.

"అబ్బొసి ఈ వీధికో నాయకుడు కూడా ఏడిచినట్టుంది. పెతీ లంజకొడుకు నోరు పారేసుకోవడమే! పెతీ లంజకొడుకు తీర్పులుచెప్పేవోడయిపోయాడు" మొహం గంటుపెట్టుకుని అన్నాడు జోసెఫ్.

"మర్యాదగా మాట్లాడమని ఇందాకో సారి చెప్పేను. నేనెంత హద్దుల్లో వుండి మాట్లాడుతున్నాను... నువ్వేలాంటి మాటలు మాట్లాడుతున్నావు?" కళ్ళద్దాల వ్యక్తి ఈమారు గొంతు పెంచాడు.

జోసెఫ్‌కు ఒళ్ళు మండుకొచ్చింది. తల తాటించి-




"సుందరయ్యా! పద. ఈ ముసిలాడ్ని స్టేషన్‌కి ఈడ్చుకు వెళ్తాం. ఏ లంజ కొడుకు అడ్డతాడో నేనూ చూస్తాను" అన్నాడతను.

కళ్ళద్దాల వ్యక్తితో ఆడుగు ముందుకు వేసి, చేతులు రెండుచాచి "ఆముసిలతడ్ని ఎవరూ తీసికెళ్ళలేరు. నేనిప్పుడు చెబుతున్నాను... అడ్ని అలాగ వదిలేసి మర్యాదగా మీరు ఇంటికి నడిచేయండి" అన్నాడు స్పష్టంగా.

"చిన రవణ చెప్పేక మరింక తిరుగు లేదు మర్యాదగా ఎలిపోండి గురూ..."

"వెళ్ళండెళ్ళండి"

"భోజనాల టయిమయింది.. ఇంక పదండి"

చుట్టూవున్న జనం ఎవరికివారు సలహా ఇవ్వటం మొదలుపెట్టేరు.

కానిస్టేబుల్స్ ఇద్దరూ సందేహంలో పడిపోయారు. కళ్ళద్దాల వ్యక్తిగొంతులో బెదిరింపు స్పష్టంగా తెలుస్తూనేవుంది. దాన్ని చుట్టూవున్న జనం కూడా గుర్తించారు. అది సుందరయ్యకు, జోసెఫ్‌కు కూడా బోధపడింది.

ఈ లోపల సూరీడు నెమ్మదిగా, కష్టం మీద లేచి నిల్చున్నాడు. అతని మత్తు చాలావరకు విరిగిపోయింది.

"నాయనలారా! సగం చచ్చిన ముసిలోడి మీద మీ ప్రతాపం అంతా చూపించేరు. మంచిది. మీ టోపీలు సల్లగుండాల. మీ ఖాకీలు విస్త్రీ మడతలతో కత్తుల్లాగ కరుగ్గుండాల. మీ బూట్లు దిట్టంగా వుండాల. మీ యిద్దర్నీ వొక్కపాలే దీవించాను. గౌరిలాంటి వెర్రిముండ పాపలు మీ ఇద్దరికీ దొరుకుతుండాల ఇందాక తిట్టినందుకు తన్నేరు. ఇప్పుడు దీవించినందుకు తన్నండి. రండి నేను తయారుగున్నాను. మా కుటమానవంత పోలిసోళ్ళ సేతిలోనే సఫా అయిపోవాలని దేవుడ్రాసినట్టున్నాడు రండి..." సూరీడు నిదానంగా మాట్లాడుతూ వంగి వీపు చూపించాడు.

చుట్టూవున్న జనం ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ముందుగా సుందరయ్య వెన్ను చూపాడు. ఒక్కక్షణం సందేహించి జోసెఫ్ అనుసరించాడు.

"రెండు తన్ని మరీ పంపవలసింది" అని ఎవరో రవణకు సలహా ఇచ్చారు.

చుట్టూవున్న జనం నవ్వేరు.

రవణ చేయి చూపిస్తూ వారించాడు. జోసెఫ్ నడుస్తూ నడుస్తూ ఒకసారి వెనక్కి తిరిగి చూశాడు.

"యెనక నడిసేవోడి కాళ్ళిలాగ వాణికి పోతన్నాయో సూడండి..."

ఆ వీధి మలుపు తిరిగే వరకూ సుందరయ్య జోసెఫ్ మాట్లాడుకోలేదు

"మస్కెట్టుంటే లంజకొడుకుల్ని కాల్చి పారేద్దును. పద స్టేషన్‌కెళ్ళి అప్పుడు..." జోసెఫ్ రాజుకుంటున్నాడు.

సందులోంచి మెయిన్ రోడ్‌లోకి వచ్చేరు. సైకిళ్ళపై వెళ్తూ ఇద్దరు ట్రాఫిక్ పోలీసులు కనిపించారు.

సుందరయ్య రెండు చేతులూ చాపి, వారిని ఆపేడు.

"ఏటిగురో..."

జోసెఫ్ జరిగినదంతా చెప్పాడు.

ట్రాఫిక్ పోలీసుల్లో ఒకతని పేరు బైరాగి. అతను ఏనుగంత మనిషి. చాటంత మొహం. అతను జరిగినదంతా విని, సైకిల్‌ను ఎత్తి సందువైపు పెట్టి "సుందరయ్యా! నువ్వు ఆనందం సైకిలెక్కు.

జోసెఫ్! నువ్వొచ్చి ఇక్కడ కూచో.రండి వెళ్దాం. మనం ఇలాగ తోక ముడిస్తే ఆళ్ళు పీక కోసేడానికి చూస్తారు."

రెండు సైకిళ్ళ మీద నలుగురు పోలీసులు మళ్ళీ కాపు వీధిలోకి బయలు దేరారు. దారిలో వాళ్ళు మాట్లాడుకో లేదు.

పరాభవం జరిగిన స్థలం దగ్గిరికి వచ్చేరు.

ఇందాకటి జనం చాలామంది వెళ్ళి పోయారు. కళ్ళద్దాల రవణ కిళ్ళీ కొట్టు దగ్గిర నిలబడి సిగరెట్ వెలిగించుకొంటు న్నాడు. బడ్డీ ముందరున్న క్రర బెంచ్ మీద కూచొని సూరీడు జీవభాషలో పోలీసు శాఖను తిట్టిపోస్తున్నాడు.

జోసెఫ్ బైరాగికి చిన రవణను చూపిం చాడు. బైరాగి సైకిల్ స్టాండు వెసి నడుం మీద చేతులు వెసుకొని నిల్చుని, "ఎవడాడు ? ఎవడికివాళ కొమ్ములు మొలిసిపోయాయి. ఎవడాడు ? ఎవడి కంత కండలు తిరిగిపోయాయి? ఒరే... ఎవ్రడాడూ ? ఎవడికంత కొవ్వు పట్టి కావరవెక్కిపోయింది? ఎవ్రడా అంతలాగ పోతరించిపోయాడు" అని అరిచాడు.

రవణ నవ్వేడు. నవ్వి "ఈళ్ళుద్దరెళ్ళి మరొకిద్దరు పోటుగాళ్ళని తీసుకొచ్చారు. అంటే గొడవ తప్పదన్నమాట. అలాంటి అవసరం వస్తే నాలుగు తన్ని పంపుదాం. అవసరవైతే మనం హైదరా బాదన్నా వెళ్దాం కాని జంకద్దు. మన జనాన్ని మోపుచెయ్యి" అని తన పక్క నున్న వ్యక్తితో చెప్పేడు.

ఆ వ్యక్తి తలవూపి అక్కడ్నించి తప్పుకున్నాడు.

"ఒరే పదండి..ఆడేనా...? ఆ ముసి లాడ్ని జుత్తుపట్టుకొని ఈడ్చుకెల్దాం" బైరాగి తక్కిన పీసీలను పిలిచాడు.

సూరీడు లేచి నిల్చున్నాడు.

"అది జరగని పని. నేనిందాకే చెప్పేను. మళ్ళీ ఇప్పుడు చెబుతున్నాను. ఆ ముసిలోడిప్పుడు మీతో రాడు"

ఆ సరికి వో ఇరవై మంది వ్యక్తులు వచ్చి చుట్టూ నిలుచున్నారు.

బైరాగి చిన రవణ మీదికి వెళ్ళాడు. "ఏట్రా ఆ ముసిలోడ్ని తీసికెళ్తే కొడ తావా ? ఏటా పొగరేటి నీకు..." అని అడిగాడతను.

"మీద పడకు. దూరంగా వుండి మాటాడవలసిందేవైనా వుంటే మాటాడు"

"మీదికొస్తే ఏటి చేస్తావు" బైరాగికి ఉడుకుమోతనం పెరుగుతోంది.

"ఏటి చేస్తాను...మీదపడితే, అనవస రంగా జులుం చెలాయిస్తే పట్టుకు తంతాను" రవణ తాపీగానే మాట్లాడేడు.

బైరాగి ఒకఅడుగు వెనక్కివేసి అచి పెట్టి రవణ గూబమీద కొట్టేడు. రవణ కళ్ళద్దాలు తూలిపోయాయి.

చుట్టూవున్న వ్యక్తులు హఠాత్తుగా కదిలారు.




టౌన్‌లో దిగినప్పటినుంచీ మొహం ముడుచుకునే వున్నాడు డి.ఐ.జి. బ్రహ్మా నందం.

కాశీపతి శవాన్ని చూసినప్పుడూ,

అతని భార్యనూ, కొడుకునూ వోదార్చి నప్పుడూ, శ్మశానానికి వూరేగింపుతోపాటు నడిచినపుడూ అతను మొహం ముడుచు కునే వున్నాడు.

చివరికి చీకటయిన తరువాత ప్రభుత్వ విశ్రాంతి గృహంలో 'స్కాచ్ విస్కీ' గ్లాసు పట్టుకొని సుఖమయిన కుర్చీలో కూచున్నప్పుడు కూడా అతను మొహం మాడ్చుకొనే వున్నాడు.

అతని ఎదురుగా వున్న కుర్చీల్లో ఎస్.పి., అడిషనల్ ఎస్. పి., టౌన్ డి.ఎస్. పి కూర్చుని వున్నారు. క్రయిం సర్కిల్ ఇన్స్పెక్టర్ ప్రభాకర్ నించుని వున్నాడు.

మరో గుక్క విస్కీ తాగి వాళ్ళం దరికేసి చూశాడు బ్రహ్మానందం. "ఇరవై నాలుగు గంటల్లో కాశీపతిని చంపినవాణ్ణి పట్టుకొని నా ముందు నిలబెట్టాలి.. ఓకే" అన్నాడతను.

కింది అధికారులెవరూ మాట్లాడలేదు



విస్కీ బ్రహ్మానందంలో ఏ మూలో వున్న విషాదాన్ని అధికం చేసింది. "మంచివాడయ్యా కాశీపతి. ఏ గుడ్ అప్ కమింగ్ ఆఫీసర్. నక్సలైట్ మూమెంట్ టైంలో డిపార్ట్‌మెంట్‌కి గుండె కాయలాగ పనిచేశాడు. వేటకని వెళ్ళి నోసారి అక్కడెవడో నక్సలైట్ లీడర్ దొరికితే జంతువుని వదిలేసి తనరైఫిల్‌తో వాడ్ని చంపేశాడు. అంత జాగ్రత్త యిన ఉద్యోగస్తుడు. అంత డ్యూటీ మైండెడ్... అందుకే ఇలాగ ఆఖరై పోయాడు. ఇరవై నాలుగు గంటల్లో ఆ హంతకుడ్ని పట్టుకోకపోతే మనందరం గాజులు తొడిగించుకోవడం మంచిది" అన్నాడతను.

"యస్సర్ తప్పకుండా..."అన్నాడు పార్థసారథి.

"ఏవిటి తప్పకుండా!? గాజులా? నా కోసం స్కాచ్ విస్కీ వెతకడానికి కష్టపడ్డారు కానీ ఆ కిల్లర్‌ని పట్టుకోవడం కోసం ఏవన్నా చేశారా? ఏవన్నా అంటే తిట్టేనని ఏడుస్తారు మళ్ళీ. ఇప్పుడెం దుకు చెప్పండి ఈ విస్కీలు, సోడాలు, ఐస్ ముక్కలూను" అన్నాడు బ్రహ్మానందం మరోచుక్కపుచ్చుకుంటూ.

ఏమనాలో తోచింది కాదు పార్థసారథికి వెంటనే. "ఏమయ్యా...నువ్వు.. ఏమం టావు?"

"యస్సర్... నా పేరు ప్రభాకర్.కేసు క్లిష్టమైనదేసార్. హంతకుడు వుపయో గించిన కత్తి దొరికింది సార్! తమరు చూసే వుంటారు. దాని మీద వేలిముద్ర లేమీ లేవు. తమకు తెలిసే వుంటుంది. అది మామూలు కత్తి.పదిపదిహేను రూపా యలిస్తే ఏ కొట్లోనైనా దొరుకుతుంది. వ్యక్తిగతమైన కక్షతో ఈ నేరానికి పాల్పడి వుంటాడని నా అనుమానం సార్ తమరు చెప్పినట్టుగా ఆ వివరాలు సేకరిస్తున్నాను. అవసరం అయితే శ్రీకాకుళం కూడా వెళ్దామనుకుంటున్నాను. ఏ క్లూ దొరక్కపోవడంతో కేసు హోప్‌లెస్‌గా తయారయింది సార్! నా శాయశక్తులా కష్టపడతాను సార్!కాశీపతి గారి పర్సనల్ ఫైలు కూడా చూస్తున్నాను. కేసు రికార్డులు కూడా... ఇదెవరో కక్షకొద్దీ చేసిన పనిఅయితే ఆయనమీద కక్ష వుండటానికి కారణం ఎవరెవరికి వున్నదీ దర్యాప్తులో తేలిపోతుంది. నెమ్మది మీద జరగవలసిన ఇన్వెస్టిగేషన్ సార్"

"నెమ్మదిగా జరగడానికి వీల్లేదు. క్విక్ క్విక్"

"యస్సర్"

"సరే నువ్వింకా ఎందుకిక్కడ? పో పోయి పని చూడు. అర్జంటు"

"యస్సర్" ప్రభాకర్ శలవు తీసు కొని వెళ్ళిపోయాడు.

బ్రహ్మానందం గ్లాసు ఖాళీచేసి టీపాయ్ మీద పెట్టేడు "పాసార్థీ! నువ్వు కూడా తాగవయ్యా" అన్నాడు.

"నో... థాంక్స్ సర్"

"అంటే అక్కడికి నేనేదన్నమాట తాగుబోతుని" బ్రహ్మానందం కళ్ళు ఆర్పుతూ అడిగాడు.

పార్థసారథి గభాలున గ్లాసు ఒకటి తీసుకుని విస్కీ ఒంపి నాలుగు అయిసు ముక్కలు, సోడా వేసి ఎస్.పి.కి ఇచ్చి, మరో గ్లాసు కామేశ్వరరావుకు ఇచ్చి, తానో గ్లాసు తయారుచేసుకుని, బ్రహ్మా నందానికి మరో పెగ్ కలిపాడు.

"చీర్స్"

"చీర్స్ గుడ్ బాయిస్" అన్నాడు బ్రహ్మానందం. నిషా ఎక్కుతున్నకొద్దీ అతను ప్రసన్నుడు కావటం ప్రారంభించాడు.

బ్రహ్మానందం పక్కనున్న ఫోను మోగింది. అతను ఓ గుక్క విస్కీ తాగి "స్టిఫ్ దోసు కలిపేసేవయ్యా" అని "చూడు ఫోన్" అన్నాడు.

ఎస్.పి. అడిషనలెస్పీకేసి చూసేడు. అడిషనలెస్పీ కామేశ్వరరావుకి కళ్ళతోనే పురమాయించాడు.

కామేశ్వరరావు లేచి ఫోన్ అందుకున్నాడు. అవతలి వ్యక్తి చెప్పింది వింటూనే టైం చూశాడు. తరువాత ఫోన్ మౌత్ పీస్ మూసి "కాపు వీధి రౌడీలు ఇందాక నలుగురు పీసీల్ని కొట్టేరట. ఒకతనికి గట్టి దెబ్బలే తగిలాయట. కాశీపతి వుంచుకున్న అమ్మాయి పెత్తండ్రి తాగేసి డిపార్ట్‌మెంట్‌ని నానా బూతులు తిడుతుంటే దారిన పోతున్న మన పీసీలు కలగజేసుకొని వాడ్ని దెబ్బలాడేరట. వాడు తిరగబడితే స్టేషన్ తీసుకెళ్ళాలని ప్రయత్నించేరట. అప్పుడా వీధి రౌడీలు మన పీసీల్ని కొట్టేరట సార్! త్రీటౌన్ నుంచి ఫోనొచ్చింది"

బ్రహ్మానందం భగ భగ మండిపోయాడు.

"దిసీజ్ టూమచ్" అని అరిచాడతను. "ఈ టౌన్‌కి ఏదో మూడింది. రాత్రి ఓ ఆఫీసర్‌ని పొడిచి చంపేరు. మళ్ళీ ఇవాళ్ళీవిధంగా పీసీలమీద చెయ్యి చేసుకున్నారు. అంటే డిపార్ట్‌మెంట్‌ని ఎవరూ కేర్ చెయ్యటంలేదన్నమాట. మనవంటే ఏవీ ఖాతర్ లేదన్నమాట. గాడ్ దిసీజ్ టూమచ్. ఐ కెనాట్ టేక్‌దిస్. ఏయ్ పాసార్థీ! నీ పరిపాలన ఇలాగ తగలిడింది.నీ అసమర్థతే దీనంతటికీ కారణం. తెల్సిందా ? ఏ వీధి అది? కాపు వీధా? కాపు వీధయినా, రెడ్డి వీధయినా, కమ్మ వీధి, కోమటి వీధి, బేపన వీధయినా మొత్తం వీధంతట్నీ రౌండప్ చేసేయండి. అడ్డుతగిలినవాడినల్లా చావచితక్కొట్టేయండి. పోలీస్ అని వినిపిస్తేచాలు వుచ్చ పోసేయాలి టౌనంతా. ఇదే టైము. కేసొద్దు, కోర్టొద్దు. అందినంతమందిని జుత్తు పట్టుకుని త్రీ టౌన్‌లో కుక్కేయండి. తెల్లవార్లూ తన్ని పొద్దున వదిలి పెట్టేయండి. చాలకపోతే రేపుకూడా అదే పని. లేకపోతే మనకి విలువ వుండదు. గాంధీ పోలీసులు ఈదేశానికి పనికిరారు" అన్నాడతను కోపంగా.

కామేశ్వరరావు ఫోన్‌లో "స రే తే దెబ్బలు తగిలిన వాడ్ని ఆసుపత్రికి పంపించు. తరువాత వాళ్ళలో ఒకడ్ని తిన్నగా కంట్రోల్‌రూముకు పంపించు. నేను అక్కడికి వస్తాను. అక్కడ్నించి మనం వెనేసుకుని ఆ వీధికి వెళ్ళాలి. అదీ...సరే" అనిచెప్పి ఫోన్‌పెట్టేశాడు.

తరువాత "సార్! ఈ పని నాకు అప్పగించండి సార్. పోలీస్ అంటే ఏమిటో ఈ టౌనుకి నేను తెలియజెప్పుతాను. తమరు కాస్త అండగా వుంటే చాలు. ఎక్కడివాళ్ళను అక్కడ తొక్కిపెట్టి, డిసిప్లిన్ చేస్తాను. ఇప్పుడా వీధికి నేను వెళ్తాను. కంట్రోల్‌రూము నుంచి దొరికినంత మంది ఫోర్సును తీసుకువెళ్ళి మీరు అప్పగించిన పని పూర్తి చేస్తాను. మనం వూరుకుంటే లాభంలేదు. మొన్నటికి మొన్న పాకి వెధవలు వన్‌టౌన్ స్టేషన్ మీదికి వచ్చిపడ్డారు. పోలీసు తప్పు చేసినా, మంచి చేసినా అడిగే దమ్ములు

ఫోన్‌చేసి బైటకి వెళ్ళిపోయాడు.

బ్రహ్మానందం ఒళ్ళు విరుచుకుని లేచి నిలబడ్డాడు.

పార్థసారథి ఎ.ఎస్.పీ. వంక చూసి



. వడికి వుండకూడదు. అలా వున్నప్పుడే డిసిప్లిన్ సాధ్యమవుతుంది. ఈ అవకాశం నాకు ఇప్పించండి. ప్లీజ్! "అన్నాడతను.

డి.ఐ.జీకి అప్పటికి బాగానే తిమ్మిరెక్కింది. చిరునవ్వు నవ్వాడు. "గుడ్ గో ఎహెడ్" అన్నాడు.

కామేశ్వర్రావు సెల్యూట్‌చేసి థాంక్స్ చెప్పాడు. తరువాత కంట్రోల్ రూముకి

ఇంక వెళ్ళమన్నట్టు సౌంజ్ఞచేశాడు.

ఎ.ఎస్.పీ. శలవు తీసుకున్నాడు

బ్రహ్మానందం కాసేపు గదిలో పచార్లు చేశాడు. తరువాత మళ్ళీ సోఫాలో కూలబడి "వెధవది తోచటం లేదోయ్" అన్నాడు నెమ్మదిగా

పార్థసారథి లేచి బైటకు వెళ్ళి వాచ్‌మన్‌తో మాటాడి వచ్చేడు.

"సార్! ఇప్పటికే లేటయిపోయింది. డిన్నర్ వస్తుంది. పుచ్చుకుని రెస్ట్ తీసుకోండి. చీకట్నే వస్తాను" అన్నాడు బైటకి వెళ్ళబోతూ.

డి.ఐ.జీ. మొహమాట పడుతూనే తల వూపాడు. పార్థసారథి బైట ద్వారం దగ్గిరకు వెళ్ళేసరికి గదికి వున్న రెండో ద్వారానికి కట్టిన కర్టెన్ వెనుక గాజుల చప్పుడు వినిపించింది.

పార్థసారథి తలుపు దగ్గిరగా లాగి బైటకు వెళ్ళిపోయాడు.

* * *

"సార్...!" నెమ్మదిగా పిలిచాడు. లక్ష్మణరావు.

కుర్చీలో కూచుని దినపత్రిక చూస్తున్న యస్సయ్ తలెత్తకుండా "ఏమిటి" అని అడిగాడు.

"ఓ పాతిక రూపాయలుంటే కావాలి సార్...! పీ.సీ. లందరి దగ్గర ట్రయి చేసేను. సార్! ఎక్కడా దొరకలేదు. చాలా అవసరం. ఇంట్లో బియ్యం అయిపోయాయి"

"నా దగ్గర లేవు. తర్వాత ఇక ముందు కూడా ఎప్పుడూ నన్ను అడగవద్దు. తెలిసిందా. పీ.సీ. లందరికి అప్పులివ్వటం నా ఉద్యోగం కాదు. ముందూ వెనకా చూసుకుని ప్రవర్తించు. వెళ్ళు" యస్సయ్ చీదరింపుగా అన్నాడు - ఓసారి లక్ష్మణరావు మొహంలోకి చూసి.

"యస్సర్."

లక్ష్మణరావు ఆగదిలోంచి కంట్రోల్ రూం వరండాలోకి వచ్చి నిల్చున్నాడు. ఆ ఆవరణలో రెండు వేనులున్నాయి. వరండాలో ఓ మూల నలుగురయిదుగురు రిజర్వ్ పోలీసులు కూచుని వున్నారు. మెట్లు అవతలగా డ్యూటీలో వున్న ఓ రిజర్వ్ పోలీసు కానిస్టేబుల్ నీరసంగా తుపాకీకి ఆనుకుని నిల్చున్నాడు. ఆవరణలో వున్న మెర్క్యూరీ దీపాలు కళ్ళార్పకుండా వెలుగుతున్నాయి.

పళ్ళు బిగించాడు లక్ష్మణరావు.

ఎదవ బతుకయిపోయింది. పాతిక రూపాయల అప్పుకోసం నాలుగు గంటల సేపు అడ్డమయిన లంజకొడుకుల్ని బతిమాలుకున్నా దొరకలేదు. ఈ నాలుగు గంటలు రోడ్డు సైడున కూర్చుని అడుక్కుంటే కనీసం పది రూపాయలన్నా దొరికేవి.

ఇంట్లో బియ్యం లేవు.

అయిదు నోళ్ళు మాత్రం తెరుచుకొని వున్నాయి. ఉదయం లోపల సంపాదిస్తే సరి. లేకపోతే రేపు మధ్యాహ్నం పస్తు.

ఎదవుజ్జోగం

రోజుకి ఇరవై గంటలు పని చేసినా, సంవత్సరానికి మూడు వందల రోజులు ఇంటి మొఖం చూడకుండా ఖాకీ కాకుల్లాగ తిరిగినా ఇంట్లో బియ్యంలేవు.

సవ్వొచ్చెండలనికి.

తుపాకీ ఇస్తారు.

బాయినెట్ బాకు ఇస్తారు.

వెన్నెముకలాంటి లాఠీ ఇస్తారు.

ఉండటానికి గొడ్లపాకలిస్తారు.

తింటానికి మాత్రం సరిపడా ఇవ్వరు.

గుండెలమీద చెయి వేసుకుని పడుకోనివ్వరు.

తిన్నది వంటబట్టే విశ్రాంతి ఇవ్వరు.

చివరికి లంజకొడుకులు ప్రాణాలు పోతున్నా అప్పు అయినా ఇవ్వరు.

వరండా చివరకొచ్చి ఉమ్ము వూసేడతను.

"ఏటన్నాడు లక్ష్మణా?" కూచున్న పి.సి.ల్లో ఒకతను అడిగాడు.

"ఇక ముందుకూడా అడగొద్దన్నాడు. కంయ్‌మని లేచాడు..."

"సర్లే... నా దగ్గిరో పదున్నాయి తీసుకో"

లక్ష్మణరావు మాట్లాడలేకపోయాడు. చేయి చాపి డబ్బులు అందుకుని జేబులో పెట్టుకున్నాడు.

లోపల ఫోను మోగింది.

"సరే... నేను ఇంటికి వెళ్ళి ఈ డబ్బులు ఇచ్చివస్తాను. నీ సైకిల్ పట్టి కెల్తాను. ఎస్సయి అడిగితే క్యాంటీన్‌కి వెళ్ళానని చెప్పు"

లక్ష్మణరావు రెండో కానిస్టేబుల్ దగ్గర సైకిల్ తాళం తీసుకొని బయలుదేరాడు.

మెట్లుదిగి సైకిల్‌స్టాండ్‌వంక తిరిగాడు.

పిలుపు. తలవంచుకొని మెట్లెక్కి వరండాలోకి వచ్చేడు.

"రెండు నిమిషాల్లో రెడీకావాలి. కాపు వీధిలో రౌడీలెవరో మన కానిస్టేబుల్స్‌ని కొట్టేరట. డీఎస్పీ కామేశ్వరరావు గారొస్తున్నారు. మనం ఇప్పుడక్కడికి వెల్తున్నాం" ఎస్సయి కత్తులు విసిరినట్టు మాటాడతాడు.

అంతలోనే త్రీటౌన్‌నుంచి జోసెఫ్ వచ్చాడు. జరిగినదంతా అతనుచెప్పేడు. అతను చెప్పడం పూర్తికాకుండానే నీలం రంగు మైక్ కారు రయ్‌మని కంట్రోల్ రూం ఆవరణలోకి ప్రవేశించింది.

కారులోంచి భగభగ మండుతున్న కామేశ్వరరావు దిగేడు.

"రైఫిల్ మెన్ అయిదుగురు కావాలి. జస్ట్ ఇన్ కేస్...ఓ సెక్షన్ రిజర్వ్‌ఫోర్స్. లాఠీలు చాలు... దిగుతూనే వీధిలో కనబడినవాడినల్లా చితక్కొట్టేయాలి. ఇంటి తలుపులు తెరిచి, లోపలున్న లంజకొడుకుల్ని బైటకు ఈడిచి మరీ తన్నాలి. ద ఎయిమ్ ఈజ్ టు స్కేర్ దెం... ఖాకీ అంటే హడలిపోవాలి. క్విక్..." కామేశ్వరరావు ఆజ్ఞాపించాడు.

లక్ష్మణరావు తప్పించుకో చూశాడు.

"బాస్టర్డ్... వేన్ ఎక్కు"

జోసెఫ్ కామేశ్వరరావుతోపాటు మైక్ కారులో కూచున్నాడు.

ముందు కారు కదిలింది.

వెనుకనే వ్యాను.

పది నిమిషాల్లో పోలీసు వాహనాలు రెండూ కాపువీధిలోకి ప్రవేశించాయి.

కాపువీధి అప్పటికి నిద్రలోకి జారుతోంది. మూసేసిన కిళ్ళీబడ్డీ ముందున్న కర్ర బెంచీ ముందు ముగ్గురు నిల్చునివున్నారు.

"మమ్మల్ని కొట్టించినోడి పేరు రవణ. ఆడి ఇల్లెక్కడో తెలీదు. అక్కడున్న వాళ్ళకి తెలుస్తుంది. నేను అడుగుతాను" జోసెఫ్ అటు నడిచాడు కారు దిగి.

ఆగిన వ్యాన్‌లోంచి రిజర్వ్ పోలీసులు బిలబిల దిగారు.

పూరిగుడిసెలముందు కుక్కిమంచాల మీద పడుకొనివున్న జనం ఆ చప్పుడుకి లేచి భయంగా నిల్చున్నారు.

"చినరవణగాడిల్లెక్కడా ?" అని జోసెఫ్ అడిగాడు కిళ్ళీబడ్డీదగ్గిరనుంచొనివున్న వాళ్ళని.

వాళ్ళెవరూ మాట్లాడలేదు.

"వోలమ్మా పోలీసోళ్ళు...వోలమ్మో పోలీసోళ్ళు... ఎంతమందివొచ్చారో... ఓలమ్మో ఓలమ్మో..." అని ఓ ఆడమనిషి వీధి వీధి అంతటినీ భయపడుతూ అరిచి గోలపెట్టింది.

"సార్. వీళ్ళు అడుగుతుంటే మాట్లాడ్డంలేదు సార్..."

"ముందరా లంజకొడుకుల్ని ముగ్గుర్నీ నాలుగు తన్ని వెనెక్కించేయండి... ఆ రవణగాడెక్కడో వీధంతా వెతకండి. ఆ ముసలి వెధవెక్కడో కూడా వెతకండి" కామేశ్వరావు కోపంగా అరిచాడు.

బడ్డీదగ్గర నుంచున్న ముగ్గురిలో ఒకతను హఠాత్తుగా పరిగెత్తడం ప్రారంభించాడు. అతను ఇరవైగజాలు పరిగెత్తాడో లేదో ఓ రిజర్వ్ కానిస్టేబుల్ లాఠీతో కొట్టిన దెబ్బకి దొరికిపోయి కింద కూలిపోయాడు.

వ్యాన్లోంచి అందరికంటే ఆఖర్న దిగిన లక్ష్మణరావు పళ్ళు బిగబట్టివున్నాడు. 'ఏ లంజకొడుకులైతే నానా అల్లరీచేసి మమ్మల్ని అర్ధరాత్రిపూటా, అపరాత్రిపూటా కుక్కల్లాగ వీధుల్లోకి తిప్పుతారో, ఏ లంజకొడుకులయితే మమ్మల్ని మా పెళ్ళాంబిడ్డల మొహం చూడనివ్వకుండా చీటికిమాటికి తగువులు తెస్తారో ఆ లంజాకొడుకులందరి పనీ సఫా... దొరికిన లంజాకొడుకు కాలోచెయ్యో విరచకపోతే నాపేరు లక్ష్మణరావేకాదు, నేను రిజర్వోణ్నికాదు... ఈపూపున దొరికనోడ్నల్లా చంపేస్తాను. పాతేస్తాను' అనుకుని అతను లాఠీ పైకెత్తి ఎద్దులా గా కనిపించిన పెంకుటింటివైపు పరిగెత్తి, అరుగెక్కి, మూసివున్న తలుపుల్ని బూటుతో దడదడా తన్నేడు.

లాఠీతో దబదబా తలుపుల్ని బాదేడు.

"వచ్చే..వచ్చే..." లోపలినుంచి కేక.

'రా లంజకొడకా.. దొరికావు నాకు. సఫా నీ పని.. రా' కసిగా అనుకున్నాడు లక్ష్మణరావు.

అతనికి విపరీతమైన కోపం వచ్చింది. తలుపులు మళ్ళీ బాదేడు.

బారెడు గడ్డంతో, ఒంటిని చొక్కా లేకుండా లుంగీ మాత్రం కట్టుకొని వున్న ఓ ముసలతను తలుపు తెరిచాడు.

అతడ్ని చూస్తూనే మీద పడ్డాడు లక్ష్మణరావు.

"దొరికావురా లంజకొడుకా.. గెడ్డపు లంజకొడుకా" అంటూనే ఆ వ్యక్తి పొడవయిన గడ్డం గుప్పిటితో బిగించి పట్టుకొని గభాలున గుంజాడు.

"అమ్మయ్యో చంపకురా" అని అరుస్తూ ఆ వ్యక్తి విలవిల్లాడిపోయాడు.

"ముసలి లంజికొడుకా.. రాత్రీ పగలూ లేకుండా మీ ఇళ్ళ చుట్టు కుక్కల్లాగ తిరగడానికట్రా మేమీ ఉద్యోగాల్లో చేరింది? గెడ్డపు లంజకొడుకా.. మాకు పెళ్ళాం బిడ్డలుండరట్రా .. వో కొంపా గూడు వుండవనుకున్నార్రా ? నీయమ్మా ... మీమానాన మీరు బతక్క మమ్మల్నెందుకురా ఏడు పించుకు తింటారు?" లక్ష్మణరావు పెనుకోపంతో తిడుతూ ఆ వ్యక్తిని గడ్డం పట్టుకొని విసురుగా ముందుకు లాగి మెట్లమీద వదిలేశాడు.

ఆ ముసలతను తూలి మెట్లమీద నుంచి నేలమీద మట్టిలో పడ్డాడు.

"ఇంకెవడీఇంట్లో వున్నాడు. నా కంట పడినోడల్లా సఫా..సఫా.."అని వెర్రిగా అరుస్తూ లోపలికిదూరాడు లక్ష్మణరావు.

లోపలి గదిలోంచి చిన రవణ బైటకొచ్చాడు కళ్ళద్దాలు సద్దుకుంటూ. అతని మీదకు దూకిన లక్ష్మణరావు లాఠీతో చిన రవణ భుజం మీద బలంగా కొట్టేడు.

"కాపువీధి లంజకొడుకుల్లారా.. మేం మీకు బంట్రోతులనుకొన్నారట్రా? పోలీసులంటే మీకు అంత సవకయిపోయినారట్రా.. ఆఫీసర్ నా కొడుకులొక పక్క

మీరొక పక్క మమ్మల్ని పీక్కు తింటూంటే మేంఎంత కాలవని వోర్చుకుంటాంరా లంజకొడకల్లార.. లంజకొడకల్లారా.. లంజకొడకల్లారా" లక్ష్మణరావుచినరవణ జుత్తు పట్టుకొని వీధిలోకి బరబరా లాక్కొచ్చాడు.

అప్పటికి మసక చీకటిగా వున్న వీధంతా గందరగోళంగా వుంది. ఇటూ అటూ పరిగెత్తుతూ వెతుకుతున్న జోసెఫ్‌కి లక్ష్మణరావు దగ్గిర చినరవణ కనిపించాడు.

"దొరికాడు లంజకొడుకు.. ఇక్కడ దొరికాడు.. ఈడే రవణంటే. ఈ లంజకొడుకే మమ్మల్ని తన్నించేడు" అని కేకలు పెట్టేడు జోసెఫ్.

"ఈడేనా? ఈడయితే నా చేతుల ఈడి పనిసఫా.. వుండీడ్ని పాతేస్తాను..ఏరా.." అంటూ లక్ష్మణరావు చినరవణ జుత్తు పట్టుకొని జాడించాడు. రవణ కళ్ళద్దాలు కిందపడిపోయాయి.

లక్ష్మణరావు బూటుతో ఆ కళ్ళద్దాలను సలిపి, చితకగొట్టేడు.

అంతలో కామేశ్వర్రావు అక్కడికి వచ్చాడు.

"ఏవిటిది? ఊరా? అడివా? మనుషలా పశువులామీరు? నేనెవడ్ననుకున్నారు.. పీకలు కోయించీగలను. జాగ్రత్త ఏంటిది? ఏటి పని.. అర్ధరాత్రి పూట ఈ కిరాతకవేటి" రవణ జుత్తు విడిపించుకుంటూ అడిగాడు కోపంగా.

"ఒరే వీడ్ని కాళ్ళు విరిసేసి ఆ వేన్‌లో పడేయండి..స్టేషన్‌లో చెపుతాను నీకు.. వీడేన్రా జోసెఫ్. ఒరే పద నీకుందిఇవ్వాళ. పెళ్ళి చేసేస్తాను. పద..."

ఇద్దరు కానిస్టేబుల్స్ బలవంతాన రవణను ఈడ్చుకొని వ్యాన్ వైపు నడిచారు.

లక్ష్మణరావు మరో వైపు పరుగెత్తాడు.

ఇరవై సంవత్సరాలబట్టి ఇదే బతుకు. కుక్క బతుకు.. దుఃఖం...ఇరవై ఏళ్ళ దుఃఖం..కంచంలోని ముద్ద నోట్లోకి వెళ్ళే లోపల పిలుపు.. పరుగు, హింస.. రాళ్ళ దెబ్బలు.. లాఠీతో జవాబులు. నిద్రలేని రాత్రిళ్ళు, కూచోడానికి తీరికలేనిపగళ్ళు.. పగా పగ్గా వున్నాడు లక్ష్మణరావు. కంటికి కనిపించిన ఇంట్లోకి పరిగెత్తాడు. అదే సమయంలో అంతకుముందే అక్కడికి వచ్చిన వో రిజర్వ్ పోలీస్ ఆ ఇంటి ఇల్లాలి మెడలోంచి వొంటి పేట గొలుసు తెంచి జేబులో వేసుకుంటున్నాడు.

"తీసుకో సోదరా... దోసుకో.దానికి కూడా దమ్ములుండాల. జీతాలతో మనవెలాగూ బతకలేకపోతున్నాం.తీసుకో తీసుకో" అంటూ లక్ష్మణరావు ఆ ఇంటిలోంచి బైటికి వచ్చాడు.

లక్ష్మణరావు వెళ్ళిపోవటం చూసిన ఆ రిజర్వ్ కానిస్టేబుల్ ధైర్యంగా ఆ స్త్రీ రొమ్ములమీద చెయ్యి వేశాడు.

అంత వరకు స్తబ్దంగా వున్న స్త్రీ పెను కెరటం లేచినట్టు ఆతరపడి, ఆ కానిస్టేబుల్ చేతిలోని లాఠీ లాక్కుని దానితో కనుమూసి తెరిచేలోగా అతని మోకాలి మీద విసురుగా, బలంగా కొట్టింది.

ఆ కానిస్టేబుల్ 'అమ్మ'ని తలుచుకుంటూ నేలమీద పడ్డాడు చేతితో మోకాలు తడుముకుంటూ.

ఆమె పరుగున లోపలికి వెళ్ళి తలుపు గడియ వేసుకొంది.

ఆ రిజర్వు కానిస్టేబుల్ వోపిక తెచ్చుకుని లేచి, కుంటుకుంటూ బైట రోడ్డు మీదికి వచ్చాడు.




ఎదరింటి అరుగుమీద పడుకొనివున్న సూరీడ్ని అప్పటికే జోసెఫ్ గుర్తించి వ్యాన్ వైపు లాక్కుని వెళ్తున్నాడు.

లక్ష్మణరావు అక్కడ ఆగి సూరీడి వంక చూసేడు. "ఇంత ముసలి లంజ కొడుకు కూడా మనల్ని ఏడిపించుక తింటున్నాడన్న మాట. అందరూ... ఒరే సివిల్ నా కొడకా! మీ జనాలూ అందరూ కలిసి మమ్మల్ని పీక్కుతినండి" అని జోసెఫ్‌ను కూడా కలిపి తిట్టి, లాఠీతో సూరీడి మోకాలు మీద కొట్టేడు లక్ష్మణ రావు.

"సంపేసినాడు లంజకొడుకు" అని కూలబడిపోయాడు సూరీడు.

"చంపేస్తాను. పాతేస్తాను" అనిపిచ్చిగా అరుస్తూ గందరగోళంగా వున్న రోడ్డు మీదికి లాఠీ పైకెత్తి పరుగులు పెట్టాడు లక్ష్మణరావు.




పెంకుటింటి ముందు పోలీసు జీపు ఆగింది. ముందు ప్రభాకర్ దిగాడు. డ్రయివింగ్ సీట్లోంచి ఓ రిజర్వ్ కాని స్టేబుల్, వెనుక నుంచి ఓ ఇద్దరు సివిల్ పోలీసులు దిగారు.

ఉదయం ఏడున్నరే అయింది.

ఆ ఇంటి వీధి తలుపులు వేసే వున్నాయి. పోలీసు జీపు రావటం చూసిన ఒకామె పెంకుటింటి పక్కనున్న కమ్మలింట్లోంచి వచ్చింది.

"గౌరి అనే అమ్మాయి వుండేది ఈ ఇంట్లోనే కదమ్మా!?" అని సర్కిల్ ఇన్స్‌పెక్టర్ ఆమెను ప్రశ్నించాడు.

"ఆఁ...ఆరేడు నెలలయింది ఇక్కడికొచ్చి. అంతకముందు ఆ కనిపిస్తున్న కమ్మలింట్లో వుండేవోరు. మళ్ళీ అక్కడికి ఎలిపోతారనుకుంటాను. మీ ఇన్స్‌పెక్టర్ సచ్చిపోనాడటగదా..!?" అన్నదామె.

ప్రభాకర్ మూసిన తలుపుల వద్ద నించుని ఓ క్షణం సందేహించాడు.

"తలుపు కొట్టండి తీస్తారు. ముసిలోడు ఈపాటికి బైటకొచ్చి అరుగు మీద కూకుసుండేవోడు. ఈయాళ ఎందుసేతో బయటకి రాలేనట్టుంది. ఆ యమ్మి మాత్రం రోజూ ఈపాటి పొద్దెక్కినాక గానీ లెగదు. కుర్రదిగదా అందులోనూ మీ ఇన్స్‌పెక్టర్ రాతిరంతా వుండిపోయే వోడు. నిద్దరుండిచ్చేవోడు కాదుగావాల" అని పక్కింటావిడ చాలా పచ్చిగా మాట్లాడింది.

ప్రభాకర్ తలుపు తట్టేడు.

మరి కాస్త గట్టిగా.

ఇంకొంత గట్టిగా.

తలుపుల వెనుక ఎవరిదో మూలుగు. నిద్ర ఊబిలోంచి సర్వశక్తులూ కూడ దీసుకొని లేచి నిలుచోడానికి ఎవరో ప్రయత్నిస్తోన్న చప్పుడు.

తర్వాత

గజ్జలమోత. మెత్తని అడుగుల చప్పుడు.

గడియ తీసిన శబ్దం. తలుపు తెరుచు కుంది.

గాయపు చూపులతో, ఎర్రనెర్రని కన్నులతో, రేగిన జుత్తుతో, అస్త



వ్యస్తమైన పైటతో ఇంకా నిద్రను రాల్చుతూ గౌరి.

ఖాకీ ప్రభాకర్‌ని చూసి ఒక్క అడుగు వెనక్కి వేసింది.

"గౌరి అంటే నువ్వే కదమ్మాయీ!"

అవునన్నట్టుగా తల వూపుతూ ప్రభాకర్ పక్కనుంచి వీధిలోకి చూసి అక్కడ జీపునూ, కానిస్టేబుల్స్‌నూ చూసి కంగారుపడింది గౌరి.

"నీతో కాస్త మాట్లాడాలి" అన్నాడు ప్రభాకర్.

"మా అయ్యున్నాడు. పిలుస్తా నుండండి" గౌరి తలుపు బార్లా తెరిచి లోపలికి వెళ్ళింది.

ప్రభాకర్ గదిలోకి అడుగుపెట్టి గదంతా కలియజూసేడు.

పరుపు వేసివున్న పట్టెమంచం. ఒక పేముకుర్చీ. గోడకు రెండు కాలెండర్లు. ఒక స్టూలు. గోడకు ఒక అద్దం. లోపలి గదిలోకి మరో ద్వారం.

ఆ ద్వారంలోంచే గౌరి లోపలి గదిలోకి వెళ్ళింది.

"కెవ్వు"మని కేక.

గజ్జలు గిజగిజలాడిన చప్పుడు.

ధబ్బున మనిషి నేలకూలిన శబ్దం.

రెండు అంగల్లో ప్రభాకర్ లోపలి గదిలోకి దారి తీసిన ద్వారం దగ్గరకు వెళ్ళాడు.

గతుక్కుమని నిల్చుండిపోయాడు.

పెంకుల నుండి గదిలోకి కారుతూ మసక చీకటి.

దిగువగా వున్న దూలానికి తాడుతో వేలాడుతున్న శవం.

దరిద్రం వాసన.

భయం వాసన

చావు వాసన

గదిలో వున్న నులకమంచం పక్క కుప్పకూలి వుంది గౌరి.

'సూయిసైడ్' గొణుక్కున్నాడు ప్రభాకర్.

బైటనుంచి వచ్చిన పి. సీ. ప్రభాకర్ పక్కనే నిలబడి గదిలోకి చూశాడు.

"అతను గౌరి తండ్రికదూ.."

"అవున్సార్. వురేసుకుని చచ్చి పోయినట్టుంది". ప్రభాకర్ నిట్టుర్చాడు.

పదిన్నర వరకూ అతనికి అక్కడే సరిపోయింది. శవాన్ని మార్చురీకి పంపి ఒంటిమీద తెలివిలేని గౌరిని ఆసుపత్రికి పంపి, ఫొటోలు తీయించి, గదికి తాళం వేయించి త్రీటౌన్ పోలీస్ స్టేషన్‌కు వచ్చేడతను.

ఎస్సయి మూర్తి వరండాలో నించుని వున్నాడు. ప్రభాకర్‌ని చూసి అతను విష్ చేశాడు.

"మూర్తీ! రాత్రి కాపు వీధి నుంచి తీసుకొచ్చిన వ్యాన్‌లో సూరీడని ఒక ముసిలివాడుండాలే..."

"అతను సెల్‌లో వున్నాడు"

"అతడ్ని రిలీజ్ చెయ్యాలి"

"సారీ సర్! అందులో ఎవర్నీ ఎట్టి పరిస్థితుల్లోనూ రిలీజ్ చెయ్యవద్దని డి.ఐ.జీ.గారి ఉత్తర్వు"

ప్రభాకర్ మాట్లాడకుండా లోపలికి వెళ్ళి ఎస్.పీ. ఆఫీసులో వున్న డిఐజీతో మాట్లాడి ఫోను పెట్టేడు.

"యస్. డి ఐ జీతో మాట్లాడాను.అతడ్ని విడుదల చెయ్యవచ్చు. కాశీపతి మర్డర్ కేసు ఇన్‌వెస్టిగేట్ చేస్తున్నాను నేను. కాశీపతి మిస్ట్రెస్ గౌరి వుందికదా! ఇతను ఆవిడ పెద తండ్రి. క్వశ్చన్ చేయడానికి వుదయం ఆమె ఇంటికి వెళ్ళాను. ఆమె తండ్రి వురేసుకొని చచ్చిపోయాడు. ఆమె ఇప్పుడు హాస్పిటల్లో ఉంది. ఈ సూరీడు ఆమెకి మిగిలిన బంధువు అందువలన ఇతడ్ని అక్కడికి పంపాలి' ప్రభాకర్ వివరించాడు.

"అన్నట్టు కాశీపతిగారి కేసులో నేనొక ఇన్‌ఫర్‌మేషన్ ఇవ్వగలను సార్! అది పనికిరాకపోవచ్చు. పనికిరానూవచ్చు" అని ప్రారంభించి మూర్తి కోమలా లాడ్జింగ్ హౌస్‌లో కమలి సంఘటన పూసగుచ్చినట్టు చెప్పాడు.

కమలి, భాస్కర్ వివరాలు కాగితం మీద రాసుకొన్నాడు ప్రభాకర్.

ప్రభాకర్ అక్కడున్న కుర్చీలో కూచున్నాడు. మూర్తి లోపలికి వెళ్ళి రెండు నిమిషాల్లో సూరీడుతోసహా వచ్చాడు.

సూరీడు వస్తూనే ప్రభాకర్ కుర్చీ దగ్గిర కూలబడి అతని కాళ్ళు చుట్టేసు కున్నాడు.

"నా తప్పు కాయండి మారాజా. నన్నొగ్గీయండి మారాజా"

"హో కమాన్"అని గొణిగి"సూరీడూ! నిన్ను వదిలేస్తున్నాం.కానీ వో దుర్వార్త. తాతబాబు వురిపోసుకుని చచ్చిపోయాడు. గౌరి ఆ షాక్‌కి తట్టుకోలేక పరాకులోకి వెళ్ళిపోయింది. మున్సిపల్ ఆసుపత్రిలో చేర్చాం గౌరిని. తాతబాబు శవాన్ని కూడా అక్కడే అప్పగిస్తాను. ఆ సంగతి చూసుకో. మా వాళ్ళు నిన్ను జీపులో అక్కడికి తీసుకెళ్తారు" అని చెప్పాడ ప్రభాకర్.





కూర్చుని వున్న సూరీడు ప్రభాకర్ కాళ్ళు వదిలేసి బిగుసుకుపోయాడు.

వెర్రిగా, భయంగా చూసేడు ప్రభాకర్ వైపు.

"తాతబాబు సచ్చిపోనాడా?" అతని స్వరం పగిలి మాట ముక్కలయింది.

"సచ్చిపోనాడా, సంపీసేరా. వురితీసి సంపేసేరా? వోరి తమ్మడోరి తమ్మడోరి దేవుడో. ఎంత పన్జేసినావురో" కూర్చున్న చోటునే కూలిపోయాడు సూరీడు.

ప్రభాకర్ మాట్లాడలేదు.

సూరీడు లేచి కూచుని తాటాకు మంట లాగ ఒక్కసారి గప్పున లేచాడు "ఈ పాపమంతా మీదే మారాజా. కుర్సీ మీద రాజుల్దే ఈ పాపమంతా. అయ్యలారా పాపమంతా మీదే. ఆడు నాకు చెప్పనే చెప్పాడు. ఎర్రెదవ... పిచ్చినాగన్న నా తమ్ముడు ముందలే చెప్పేడు. కానీ ఆడియి వట్టి అపపులనుకుని నాను సమ్మ లేదు. నిన్నుదయం ఆడింటికెల్తే, ఓ రన్నయ్య, సూరన్నయ్య ఇప్పుడెలాగ బతకడంరా అన్నాడాడు. కాశీపతి సచ్చి పోనాడుగదా మరింక బువ్వెలాగరా అని అడి మనసులోని మాట. ఆడు సచ్చోడు. ఆడెంత సచ్చోడో మీకు ఎలాగ తెలు స్తాది బాబయ్యా. ఇప్పుడు నానేం జేసేది తండ్రుల్లారా...కడుపున పుట్టిన పిల్లని కంఠ కండలు గోసి అమ్ముతున్నా నా అన్నయ్యా అని ఆడోనాడు ఆడదాని లాగ రాగాలు దీసేడు బాబయ్యా. ఆడే గాని జబ్బుమనిసి గాకపోతే గౌరికేసే కన్నెత్తి సూసిన రోజునే కాశీపతిని కస క్కన తెగేసును. ఆడికంత పౌరుసం. అసలు మా కులానికే ఆ పవురుసం వుంది. అందికే కొన్ని జిల్లాల్లో మాం దొరలని అనిపించుకుంటాం. కానీ పాపిష్టి కడుపు. దానికోసవే ఆడు పౌరుసం అమ్ముకున్నాడు. కన్నకూతుర్ని ఖాకీ వోడికి అమ్ముకున్నాడు. అంచేత ఈ పాపమంతా మీదేరా బాబూ. నా కడుపుల ఇంత మంట వుండబట్టే నిన్న రాత్రి అంతలాగ అన్ని తిట్లు తిట్టేను. కొట్ట డానికి సత్తువ సాలకే తిట్టేను. వోరి తాతబాబు...నా తమ్ముడో...తమ్ముడో ఒక్క రోజయిన సంతోసించకుండా... ఒక్క పాలయినా సుఖపడకుండా ఏకంగ ఎల్లిపోయినావట్రా. నూరేళ్ళు నిండిపోనా యిట్రా" అని అతను శోకాలు తీశాడు.

"సరిసరి ఇంక వెళ్ళుమరి" అన్నాడు ప్రభాకర్ కుర్చీలోంచి లేచి నిలుచుంటూ.

"బేగెల్లి నాను చేసేదేవుంది మారాజా!? పీనుగులు మాటాడతయా తండ్రీ? నన్ను గూడా తమరు బూటుతో తొక్కి సంపీ యండి. అన్నదమ్ములిద్దర్ని వొకే రోజున సఫాజేసిన ఘనత మీ కందరికీ చెందు తుంది. నాలుక్కాలాలపాటు మీ పేరు నిలబడిపోతాది. నన్నిక్కడ సఫాచేసి, ఆ గుంట పాపనక్కడ ముక్క ముక్క లుగా నరికి పులావు చేసుకోండి. ఖాకీ బట్ట లేసుకున్న లంజకొడుకులంతా ఆ పులావు తిని కిళ్ళీవేసుకోండి"

"నోర్ముయ్... నోర్ముయ్" ఎస్సయి మూర్తి గర్జించాడు.

"బైట జీపుంది...ఏయ్ ఇతన్ని బైటకి తీసుకువెళ్ళు" అని ప్రభాకర్ అప్పుడే అక్కడికి వచ్చిన ఓ పీసీకి చెప్పేడు.

"దాని మొకం ఎలాగ సూద్దంరా బగవంతుడా? దానికి ఏవని జవాబు సెప్పడంరా దేవుడా" అని గొణుక్కుం టూనే సూరీడు బైటకి వెళ్ళాడు.

ప్రభాకర్ మళ్ళీ కుర్చీలో కూలబడి

అర చేతితో నుదురు రుద్దుకున్నాడు. అలా చేస్తే సకాలంలో చక్కని ఆలోచనలు పుడతాయని అతనికో నమ్మకం.

హటాత్తుగా లేచి నిల్చుని "మిస్టర్ మూర్తీ ! నాకో వాహనం కావాలి" అన్నాడు.

"నా స్కూటరుంది..."

"థేంక్స్! కీస్ ఇలా ఇవ్వు!" మూర్తి పెదాల మీద వంకర నవ్వు మెరిసింది. 'ఏ(టీడు కీసుకీసుమని అరుస్తున్నాడు' అనుకున్నాడతను స్కూటర్ తాళం ప్రభాకర్‌కి ఇస్తూ.

"స్కూటర్ స్టార్ట్‌చేసిన ప్రభాకర్ పదిహేను నిమిషాల్లో యూనివర్సిటీ లేడీస్ హాస్టల్ ముందు ఆగాడు.

యూనిఫారంలో వున్న ప్రభాకర్‌ని చూసి ఆఫీసుగదిలోని వార్డెన్ బిగుసుకుపోయింది.

"నా పేరు ప్రభాకర్. క్రియిం సర్కిల్ ఇన్స్‌పెక్టర్‌ని. ఎస్. కమలి అని ఓ రీసెర్చ్ స్కాలర్‌తో కాస్త మాట్లాడాలి అఫిషియల్ బిజినెస్. రెండు, మూడు నిమిషాలు మాత్రమే" అన్నాడు

"చాలా అవసరమా ?"

"యస్!ప్లీజ్. ఒకటి రెండు ప్రశ్నలు అడిగి పోతాను."

"ఎస్. కమలి అంటే వెంటనే లొకేట్ చేయటం కష్టం. ఇంగ్లీషు రీసెర్చ్‌స్కాలర్ ఒకామెవుంది. సైకాలజీలో రీసెర్చ్‌చేస్తున్న కమలి కూడా వుంది."

"ఈ అమ్మాయి ఇంగ్లీషులోనే రీసెర్చ్ చేస్తూందనుకుంటాను."

"ఈ పక్కనే విజిటర్స్ గది వుంది. అందులో కూచోండి. హాస్టల్‌లో వుందో, యూనివర్సిటీకి వెళ్ళిందో కనుక్కొంటాను" అన్నది వార్డెన్.

థేంక్స్ చెప్పి ప్రభాకర్ విజిటర్స్ గదిలో కూచున్నాడు. పది నిమిషాల్లో విజిటర్స్ రూములోకి కమలి వచ్చింది.

ఆమెను కూచోమన్నట్టుగా సంజ్ఞ చేసి "కమలి అంటే మీరేనా ?"

కమలి తలవూపింది కూచుంటూ.

"కాశీపతి హత్య కేసు నేను దర్యాప్తు చేస్తున్నాను" ప్రారంభించాడు ప్రభాకర్

"అయాం వెరీ హేపీ. ఆ దుర్మార్గుడు పోయినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను" అన్నది కమలి. ఆమెగొంతులో నుంచి క్రోధం ప్రవహించింది.

"ఐసీ..." తలపంకించాడు పోలీసు అధికారి. "మిస్ కమలీ! కాశీపతిని మీరు అంత దుర్మార్గుడని భావిస్తున్నారా! సరే.. ఆ రోజు ఏం జరిగిందో, కాశీపతి వెళ్ళిపోయిన తరువాత మీరూ, మీ బాయ్ ఫ్రెండ్.. భాస్కర్‌గదా ఆయన పేరు... ఆయనేం చేసేరో కాస్త చెపుతారా? ఇది కొటీన్ క్వశ్చనింగ్"

కమలి అరచేయి ఆడించి "లిసన్... నన్ను ప్రశ్నించటం అనవసరం. కాశీపతి హత్య సంగతి నేను పేపర్లలో చూశాను. చెప్పేను గదా అందుకు చాలా ఆనందించేను. కాశీపతిని చంపినది ఎవరైనా అతనీరోజున నా హీరో! నా బాయ్‌ఫ్రెండే గనుక కాశీపతిని చంపివుంటే నేను చాలా ఆనందిద్దును. కానీ భాస్కర్ అంతటివాడుకాడు. ఆ రోజునుంచీ అతను నా కంటికే కనిపించలేదు. సిగ్గుతోను, అవమానంతోను ఆ పిరికివాడు ఎక్కడికో పారిపోయాడు. కాలేజీకి కూడా రావటం లేదని తెలిసింది. శలవు కూడా పెట్టలేదట. అతని పేరెంట్స్ ఈ పక్క వూర్లోనే వుంటున్నారు. వారి





దగ్గరకు కూడా మనిషిని పంపేను. వాళ్ళకూ తెలీదు. ఇకపోతే మీ కాశీపతి నాకో పాఠం నేర్పేరు. అడవిలో అమాయకంగా బతికే జింకలకు వాడి కొమ్ములుండాలి. తోటలో తెల్లగా బతికే వైరిముండా పావురాలకైనా ఉక్కు ముక్కుఉండాలి పెరటిలో గంతులేస్తూ తిరిగే కుందేళ్ళకయినా పరమ విషపు కోరలుండాలి. వోట్లువేయ్యడానికి తప్పించి ఇంకెందుకూ పనికిరాని ప్రజలందరూ ఆత్మ రక్షణ కోసం విచ్చుకత్తులు పట్టుకుని తిరగాలి. స్త్రీలందరి దగ్గిరా మిషన్ గన్స్ వుండాలి. అదీ ఆ రాత్రి నాకు కాశీపతి మూలంగా తెలిసిన జీవిత సత్యం. నేను రివాల్వర్ కోసం లైసెన్సుకి ప్రయత్నిస్తున్నాను" అన్నది.

ప్రభాకర్ ఒక్కక్షణం నిశ్శబ్దంగా వుండి, చిరునవ్వు నవ్వేడు.

"మీకు లైసెన్సు ఇవ్వరులెండి.. మీకది అవసరం కూడా లేదులెండి"

"ఎందుకని?"

"కోపంతో ఉన్నవాళ్లు తుపాకీని సరిగా పేల్చలేరు. ప్రాణాలు తియ్యడానికి సహనం వుండాలి. అదీగాక మీకు లైసెన్సు ఇవ్వరు. అంతే!"

కమలి మాట్లాడలేదు.

"తరువాత..భాస్కర్ తప్పిపోయాడని మీరు భావిస్తున్నారా ?"

"పారిపోయాడనుకుంటాను."

"అంత తప్పుచేశాడా అతడు!". చుర చుర చూసింది కమలి. "ఆ రోజు అంత చేసిన కాశీపతిని చంపకుండా వదలటం తప్పుకదూ !?"

ప్రభాకర్ లేచి నిలుచున్నాడు "తప్పు కాదు గానీ అతని తల్లిదండ్రుల పేరూ, వూరూ ఓ కాగితం మీద రాసిస్తారా ?"

కమలి లేచి వార్డెన్ గదిలోకి వెళ్ళి వో కాగితం తీసుకుని భాస్కర్ తల్లిదండ్రుల అడ్రస్ రాసి తీసుకువచ్చింది.

థేంక్స్ చెప్పి తీసుకున్నాడు ప్రభాకర్

"నేను వెళ్ళొస్తాను. ఒక్క ప్రశ్న కాశీపతిని ఎవరు చంపివుంటారో మీకేమయినా తట్టిందా?"

కమలి వెటకారంగా నవ్వింది. "అధికారుల్లో రావణులున్నంత కాలం ప్రజల్లో రాముళ్ళు వుండనే వుంటారు"

* * *

ప్రభాకర్ సాధ్యమయినంత కిందకి వంగి ఆ గుడిసెలో ప్రవేశించాడు.

"రండిబాబూ! తమరా మంచం మీద కూకోండి.." వంటిన చొక్కా లేకుండా సారా కంపు కొడుతూన్న సూరీడు ఆహ్వానించేడు.

మట్టిగోడల మధ్య, తాటి కమ్మల కింద వొక్కటే గది.

ఒక నులక మంచం, చాప...

కాలుతున్న కడుపులాంటి కట్టెల పొయ్యి. దరిద్రంతో తొణికిసలాడుతూ నాలుగు కుండలు. మూడు రోగిష్టి సిల్వర్ గిన్నెలు.

ప్రభాకర్‌ని చూసి పొయ్యి దగ్గర్నుంచి లేచి నించుంది గౌరి.

"తవరా మంచం మీద కూకోండి.. కాశీగోర్ని ముందల మా తమ్ముడిలాగే మంచం మీద కూకుండబెట్టాడు. ఆ యెనక ఆ బాబు తొంగుంటానన్నాడు.."

సూరీడు నవ్వాడు.

"గౌరితో మాట్లాడాలి" అన్నాడు ప్రభాకర్.

"తమరు కూకోండి ముందు.. కాశీగోరి కన్ను బడకముందు మావోళ్ళి పాకలోనే

వుండేవారు.. ఆడు దీన్ని చెరబట్టినాక ఆ పెంకుటింట్లో దీన్ని పెట్టాడు కత ఈ రకంగా ముగిసిపోనాక మళ్ళీ మా విప్పుడీ గూటికి చేరేం.. పట్టె మంచం కొన్నాడు కాశీగోరు పడుకోడానికి పత్తెంగుంటాదని. బెత్తె కుర్సీ వొకటి. ఆ రెంటినీ నేను అమ్మిపారేశాను.. ఈయాళ, రేపు బువ్వకి కొరతలేదు.. మనం మందేసుకోడానికి కూడా సరిపో నాయి డబ్బులు.."

ప్రభాకర్ జేబులోంచి రుమాలు తీసి నులకమంచం దండెమీద వేసి జాగ్రత్తగా కూచున్నాడు.

"చూడు గౌరీ!.. మీ నాన్న పోవడం నీకెంత కష్టం కలిగించిందో, నీకెంత బాధగా వుంటుందో నాకు తెలుసును.కానీ ఉద్యోగ ధర్మంగా కాశీపతిగారి హత్య గురించి నిన్ను కొన్ని ప్రశ్నలడగాలి.."

"ఆ..అదీ..ఎవడి పని ఆడు సెయ్యక పోతే బువ్వెలాగొస్తాది? సరింగ మీరొస్తున్న టయానికి నేను మా అమ్మికి అదే బోధ జేస్తున్నాను...మీరు మంచి ముక్క చెప్పేరు.." సూరీడు చుట్ట వెలిగించుకొని చూరు దగ్గిర గొంతుక కూచున్నాడు

"చూడు గౌరీ.. ఆ రాత్రి.. అదే... కాశీపతిగారు పోయిన రాత్రి ఆయన ఎలా వున్నారు.. నీ దగ్గర నుంచి వెళ్ళిపోయేటప్పుడు ఆయన భయపడుతున్నట్లుగానీ ఆందోళన పడుతున్నట్టుగాని వున్నారా?"

"ఆ రోజాయన మామూలుగానే వున్నారు"

"మామూలుగా అంటే.."

"మామూలుగా అంటే మామూలుగానే... మాటల్తో మనిషిని సంపడం ఆయనకి సరదా..అలాగే వున్నారు.."





"అదా.. సరే.. ఆయన హత్యగూర్చి నువ్వేమనుకుంటున్నావ్.. ఆయనతో సన్నిహిత పరిచయం వున్న స్త్రీగా ఆయన్ను ఎవరు చంపివుంటారో నువ్వేమైనా వూహించగలవా? ఆయనకు శత్రువులెవరైనా వున్నారా?"

"ఏం తెలివైన ప్రశ్న అడిగారండీ బాబూగారూ! ఏం ప్రశ్న అడిగారు? పాముకి విరోధులుంటారా అని అడిగినట్టుంది" వెటకారంగా అన్నాడు సూరీడు.

"సూరీడూ..నువ్వు మాట్లాడకు ప్లీజ్" అన్నాడు ప్రభాకర్ విసుగ్గా.

"నాకు తెలిసినంతవరకు ఆయనను చంపగలిగే విరోధులెవరూలేరు.."

"అందుకే నిన్ను ఎంక్వైరీకూతురంటున్నాను" సూరీడు వ్యాఖ్యానించాడు.

"అంటే.. చంపడానికి శక్తిలేని విరోధులు వున్నారని నీకు తెలుసా?"

"ఎవడిదాకా ఎందుకండి.. నాకు బలవుంటే నేనే ఆయన్ని కత్తెట్టి పొడిచి నంపేద్దును.."అన్నది గౌరి ఆగ్రహంతో

"సెభాష్.. నా కూతురువనిపించినావు.. కాపోళ్ళ బొట్టివనిపించినావె కూతురా" అని మెచ్చుకున్నాడు సూరీడు.

ప్రభాకర్ గౌరి సమాధానం విని గతుక్కుమన్నాడు. అతనికి సూరీడు మీద కోపం వచ్చింది.

"సూరీడూ!నువ్వుకాస్త నోరుకట్టుకో. లేదా బైటకెళ్ళి నిల్చో. చూడు గౌరీ! నీక్కూడా ఆయన మీద అంతకోపం వుందన్నమాట... ఎందుకో నేను అడగొచ్చా...?"

"నన్ను బలవినిబట్టి నా బతుకు బుగ్గిపాలు చేసేసినాడు. అందుకని. ఆకలితో సచ్చిపోడవంటే మా అయ్యకి బయం. అన్నంమీద ఆకలితో మేం

వున్నాం. ఆడదానిమీద ఆకలితో ఆడు న్నాడు. ఆడి సేతిలో తుపాకీ వుంది... మాఅయ్యగుండెల్నిండాదగ్గరోగంవుంది. అంచేత నా బతుకు సల్లారిపోయింది" గౌరి మాట్లాడుతూనే బెక్కుల్లోకి దిగింది.

"ఏడకేడకు..." అని తమ్ముడి కూతుర్ని అనునయించాడు సూరీడు.

ప్రభాకర్‌కి ఏంచెయ్యాలో తోచలేదు. నిశ్శబ్దంగా వుండిపోయాడు. గౌరి కళ్ళొత్తు కుంది.

"మరో ప్రశ్న... నీ దగ్గరికి వచ్చిన రోజు కానీ, అంతకు కొంచెం ముందుగానీ తనకు ఎవరితోనైనా గొడవజరిగినట్టుగానీ, ఘర్షణ జరిగినట్టుగానీ కాశీపతిగారు నీతో చెప్పేరా? ఆయన ఆఫీసు విషయాలేవైనా నీకు చెప్తుండేవాడా?"

"బాగుందండి. సొగసైన ప్రశ్న అది ు.పు. అతగాడిక్కడికి వచ్చేపనేటి? నువ్వ డిగే ప్రశ్నలేటి ? బలేగుంది. రెంటికే మైనా సమ్మందవుందా?"

ప్రభాకర్ దిగ్గునలేచి సూరీడి జబ్బ పట్టు కున్నాడు. "నువు బైటికి వెళ్తావా? నేను పంపించాలా?" అని తీవ్రంగా అడిగాడు.

సూరీడు కళ్ళలో నిరాశలాంటి బూడిద పరుచుకుంది. చేతిని విడిపించుకోవ డానికి ప్రయత్నిస్తూ "పోతాను. మీరు ఇన్ని ప్రశ్నలడిగారు. నా కోరికమీద మరొక్క ప్రశ్న అడగండి.కాశీగాడి కాటు తిన్న గౌరీ! పిచ్చిముండా ! నువ్వింక ఎలాగ బతుకుతావే అని అ డ గ ం డి. సూరీడా ! పళ్ళూడిపోయిన ముసిలి లంజకొడుకా! నువ్వు ఏటి తిని బతుకుతా వురా అని అడగండి..." అన్నాడు.

ప్రభ కర్ వె ట కా ర పు చిరునవ్వు నవ్వేడు."నీ సంగతి కనబడుతూనేఉంది. నువు సారాతాగి బతుకుతావు..."

"సారా దాగినోడు సస్తాడుగానీ బత కడు. నాను సావడానికి తాగుతున్నాను గానీ బతకడానికి గాదు. అంచేత అది జవాబుగాదు...జవాబు నేను సెప్తానుగానీ ప్రశ్న మీరు అడగండి."

"ఎవ్వడెలాగ బతుకుతాడో అడగటం నా పనిగాదు..."

"పోనీ ఆ పని మీద ఎవ్వరున్నారో చెప్పండి ఆళ్ళనే అడుగుతాను"

ప్రభాకర్ దగ్గిర సమాధానం లేదు.

సూరీడు లేచి నిలబడి ప్రభాకర్ దగ్గరికి వచ్చి, వంగి అతని మొహంలో మొహం పెట్టి "పోనీ నేనో ప్రశ్నడుగు తాను...మావెలాగ బతకాలో చెప్పండి"

ప్రభాకర్ మళ్ళీ లేచి నిల్చుని జేబు రుమాలు మడిచి "సూరీడూ! నువు చాలా అల్లరి చేస్తున్నావు నన్ను మాట్లాడ నివ్వడంలేదు. ఇలాగయితే గౌరిని స్టేషన్‌కు తీసుకు వెళ్ళాల్సివుంటుంది" అన్నాడు.

కళ్ళు, కనుబొమ్మలు ఎగరేశాడు సూరీడు "అదీ.. అద్గదీ. ఈ ఖాకీ పామి ప్పుడు పడగ విప్పింది. అదిరా బాబు ఈ వంకతో నువు దీన్ని ఇప్పుడు స్టేషన్‌కి తీసుకెలావు. వొద్దంటే నన్ను తీసికెళ్ళి బొక్కలేస్తావు. కాశీగోడికంటే నువు తెలివైనోడివి. అంటే ఆడికంటే నీకు విసం ఎక్కువుంటాది. అలాగేనా బాబూ తీసికెళ్ళు. దాని బతుకిలాగే పోలీసు పాలయిపోతాది. నాకు తెలుసు" అన్నా డతను.

ప్రభాకర్ ని శ్చ ా ం త పో యా డు. "ఛీ... ఛీ... నీది మామూలు నాలిక కాదు" అన్నాడు

"నిజవే బాబూ... నాది నవాసారం

నాలిక. ఖాకీ నాలుక మాత్రం గాదు. ఇదిగో నేనిందాక అడిగిన ప్రశ్నకు, అడగమన్న ప్రశ్నలకు నేనే జవాబిస్తాను. ఆలకించు. ఇదిగో నా కూతురు భూదేవత. దాని కాళ్ళకు దండం పెడతాను.. ఇదిగో ఇది ఒళ్ళమ్ముకుని నాకు గెంజిపోసి, సారాపోసి, ఇదిగో రక్తమమ్ముకొని నాకు ప్రాణాలు పొయ్యడానికి తయారయి, సిద్ధంగావున్న నా కూతురికి నేను దండ వెడు తున్నాను సూడు. అంటే నేను దాని రక్తమాంసాలే తిని బతుకు తున్నాను. అది కూడా దాని రక్త మాంసాలే అది తింటన్నాది. మొత్తం మీద మేవిపుడు మా రక్తమాంసాలే తిని బతకాలి. మగోడ్నయి పుట్టినాను. కండ లమ్ముకుని బతికాను. నాతమ్ముడు అలానే బతికి సచ్చేడు. మా అయ్యా, తాతా, ఆడి తాతా అలాగే మట్టిలో కలిసిపోయారు. ఇదిగో నా తమ్ముడి కూతురు. ఆడదయి కాబట్టి అది ఒళ్ళమ్ముకుని బతకాలి. ఇది ఇలాగ బతికి బతికి దాని ఒళ్ళంతా పురుగుల తట్ట అయిపోనాక దాని కూతురు ఈ యాపారంలోకి దిగుతాది. దాని ఒళ్ళంతా కుళ్ళి కుళ్ళి...''

ప్రభాకర్ ఇంక భరించలేక చరచరా నడిచి గుడిసె బయటకి వచ్చేశాడు.

"బాబూ. బాబూ.." అంటూ చూరు దగ్గిరకు వచ్చి పిలిచాడు సూరీడు.

ప్రభాకర్ అయిష్టంగానే సూరీడి దగ్గిరికి వెళ్ళాడు.

"ఏవిటి?"

"బాబూ! నా మాటలకేంగానీ, దీన్ని మీరు వుంచేసుకోకూడదూ?"

ప్రభాకర్ కొయ్యబారిపోయాడు.



"ఎలాగా అది సెడే సెడిపోయింది. ఎలాగా ఇంకో ఆదరువు లేదు కాబట్టి ఇకది పదిమంది పక్కలా తొంగుండో వలిసిందే.పదిమందిరికెల్తే పది రకాల జబ్బులు తగులుకుంటాయి. కానీ ఇంతకుముందది మీ కాశీగోర్ని తప్పితే ఇంకొకడ్ని ఎరగదు. అంచేత వుంటే గింటే దానికిప్పుడు పోలీసు జబ్బే వుంటాది. అది మిమ్మల్నేం సెయ్యదు కదా! నా ఉద్దేశం ప్రకారం మీరే దాన్ని వుంచుకుంటే బాగుంటాది.."

మిగతా మాటలేం వినిపించుకోలేదు ప్రభాకర్. వెనక్కి తిరిగైనా చూడ కుండా చరచరా రోడ్డు పక్కన వుంచిన స్కూటర్ దగ్గిరికి నడిచాడు.

అదే సమయంలో అక్కడో పోలీసు జీపు ఆగింది. సబిన్స్‌పెక్టర్ మూర్తి, ఇద్దరు పీసీలు దిగారు.

మూర్తి ప్రభాకర్‌ని విష్ చేశాడు.

"ఏవిటి సంగతిలాగ వచ్చేరు?"

"రాత్రి కాపు వీధినుంచి తీసుకొచ్చిన వాళ్ళలో చినరవణ అని ఒకడుండేవాడు కదా. వాడు కస్టడీలో కునికేసేడు సార్! కార్డిక్ అరెస్టని సివిల్ సర్జన్ సర్టిఫై చేశాడు. ఇందాకే అతని శవాన్ని అతని పిల్లలకు అప్పజెప్పారు. దహనం అయి పోయేవరకూ మనవాళ్ళు అటెండవు తారు.ముందు కేసూగీసూ వద్దనుకున్నారు గానీ ఇది జరిగాక ఎందుకయినా మంచి దని కాపు వీధి ఎసాల్ట్ కేసొకటి తయారుచేస్తున్నారు. రేపుదయం కోర్టుకు హాజరుపరచాలి. ఇక్కడొక ముసలివాడుండాలి కదా సార్! ఆ గుడిసె దగ్గిరున్నాడు సూరీడు. వాడ్ని తీసుకెళ్దామనికొచ్చాం. మీరు వాడి దగ్గిరకే వచ్చినట్టున్నారు కదా.."

"కార్డిక్ అరెస్టా?"

మూర్తి నవ్వేడు! "కస్టడీలో చచ్చి పోయినవాడు ఎవడైనా పీకెతే కార్డిక్ అరెస్టుతోనే చస్తాడు కదండీ."

"మరేం గొడవ అవదుగదా?"

"గొడవ ఎందుకవుతుందండీ! సివిల్ సర్జెన్ సర్టిఫికేటుంది. ఎస్.పీ. గారి ఎంక్వాయిరీ జరిగిపోయింది. ఆదివారం కాబట్టి మెజిస్ట్రేటుగారి ఇంటికి ముద్దా యిల్ని కొందర్ని హాజరుపరిచి ముద్ర వేయించుకున్నాం. శవ దహనం ఈ పాటికి అయిపోయే వుంటుంది. రేపు మాజిస్ట్రేటు కోర్టులో క్రిమినల్ ఎసాల్ట్ కేసు విచారణకొస్తుంది. సాక్షుల్ని సిద్ధంచేశాం. కన్విక్షనయిపోతుంది. మరేం పరవాలేదు. డిపార్ట్‌మెంట్ జాగ్రత్త గానే వుంది."

"అయితే పరవాలేదు."

"మీ దర్యాప్తు ఎలా సాగుతోంది?"

"తలా తోకా లేకుండా వుంది. రేపు ఉదయం మీరు చెప్పిన భాస్కరం కోసం వేట మొదలుపెట్టాలి. అతను ఆ రోజు నుంచే కనిపించటం లేదట. దానికీ, దీనికీ సంబంధం వుందని పోలీస్ సెన్స్ చెబుతోంది.."

"మంచిది సార్.."




సాయంత్రమయింది.




యస్. పి. పార్థసారథి ముళ్ళ మీద కూర్చున్నట్టు కూచున్నాడు ఆఫీసులో.

అతని ఎదురుగా అడిషనల్ యస్.పి. కూర్చుని వున్నాడు.

ఫోన్ మోగింది.

ఏఎస్‌పి రిసీవరు తీసి విని "జస్ట్ ఎ మినిట్" అని లైన్‌లో ఉండమని అవతలి వ్యక్తికి చెప్పి "మీకే" అని ఫోన్ పార్థసారథికి ఇచ్చాడు.

"యస్..."

"సర్! నేను ఎస్సయి మూర్తిని మాట్లాడుతున్నాను సార్! కాపువీధి క్రిమినల్ ఎసాల్టు కేసులో ముగ్గురు ముద్దాయిలకు కన్విక్షన్ ఇచ్చారు సార్. తక్కిన వాళ్ళందర్నీ మేజిస్ట్రేటుగారు అక్విట్ చేశారు. చిన రవణ అనే ముద్దాయి కష్టడీలో వుండగా గుండెపోటు వల్ల మరణించినట్టుకూడా ధ్రువీకరించారు సార్"

"సరే.."

విని ఫోన్ పెట్టేసి తేలికగా నిట్టూర్చాడు పార్థసారథి.

"మేజిస్ట్రేట్ మాట నిలబెట్టుకున్నాడు" అన్నాడు ఏ. ఎస్. పి. వంక తిరిగి చిరునవ్వుతో.

"బతికించాడు."

"ఏం బతుకు? గుండెలు గుబగుబలాడుతున్నాయి– ఎప్పుడేమవుతుందోనని. కామేశ్వర్‌రావుకి దుడుకుతనం తగ్గాలి. ఐ.జి గారి చుట్టమయినంత మాత్రాన అంత మిడిసిపాటు తగదు. ఆ రవణ గాడికి పొలిటికల్ కనెక్షన్స్ వున్నాయి. హైదరాబాద్‌లో వాళ్ళకో లాబీవుంది.. ఇలాంటి విషయాలు ఒక్కోక్కప్పుడు పీకల మీదికి వస్తాయి. ఐ.జీ. గారు చెపుతారు. పోలీసాఫీసర్ పోయాడనే బాధ కొద్దీ, కోపంకొద్దీ ఆయన జనాన్ని చితక్కొట్టమని చెపుతారు. మనం లోకల్ పీపుల్స్‌తో డీల్ చేసేటప్పుడు కాస్త ముందూ వెనకా ఆలోచించాలి, ఇప్పటికి నాకు అనుమానంగానే వుంది. మనకిక్కడ బలం వుంది కాబట్టి హడావిడిగా శవాన్ని తగలెట్టించేసి, కేసు మూసేసాం. మేజిస్ట్రేట్ మంచివాడు కాబట్టి సరిపోయింది.. కానీ హైదరాబాద్ వుందికదా! ఏమిటో ఈ టౌన్‌కి నేను వచ్చిన వేళా విశేషం అలాగుంది. సుఖం తక్కువా టెన్షన్ ఎక్కువాను"

ఏ.ఎస్.పి. మహా శ్రద్ధగా, సంతోషంగా విన్నాడు. ఏలినవారు తమ కుటుంబ కష్టాలు చెప్పుకుంటూంటే అంతరంగిక సేవకులు అలానే వింటారు.

మళ్ళీ ఫోన్ మోగింది.

ఈమారు పార్థసారథే అందుకున్నాడు.

"యస్"

"ఎవరు సారథేనా?"

అవతలిది ఎవరి గొంతో చప్పున పోల్చుకున్నాడు. పార్థసారథి.

"యస్సర్.."

"విను.. ఓ ప్రాబ్లెం వచ్చిపడింది. చాలా జాగ్రత్తగా వుండాలి మనం. కామేశ్వర్రావు నాకు చెప్పేడు. నువు చెప్పిందేననుకో. కానీ ఇక్కడ నామీద ఒత్తిడి వచ్చింది.. తట్టుకోవడం కష్టం. కొంచెమన్నా మనం లొంగాలి. తప్పదు. కాపు వీధిలో పోలీసుల కిరాతకం అని వో దిన పత్రిక రాసింది. చూసేవుగదూ! దాన్ని ఆధారం చేసుకొని ఇక్కడొక పవర్‌ఫుల్ లాబీ వర్క్ చేస్తోంది. మొత్తం వ్యవహారం మీద దర్యాప్తు జరపవలసి రావొచ్చు. గట్టివర్గం మనకీ విషయంలో వ్యతిరేకంగా పనిచేసోంది"

వింటున్న పార్థసారథి మొహం పాలిపోయింది. "..అంచేత, విధిలేక నేనోటి అనుకున్నాను. కాపు వీధిలోకి ఆ రాత్రి వెళ్ళినవాళ్ళెంతమంది?"

"కామేశ్వర్రావు, కంట్రోల్ రూం ఎస్సయి కాక పదహారుమంది.

"రైట్. ఇపుడు విను. ఆ పదహారు మందినీ, ఆ రాత్రి ముందు తగవుకి దిగిన నలుగురు పీసీల్నీ మొత్తం ఇరవైమందినీ సస్పెండ్ చెయ్యి. చేసి నువ్వే ఎంక్వయిరీ జరుపు. ఎంక్వయిరీలో డిపార్టమెంట్ తప్పేమీ లేదని తేలుతుంది. అర్థమయిందా...మనవాళ్ళకి నచ్చచెప్పు. నేనిక్కడ హోమ్ మినిస్టర్‌ని పట్టుకుంటాను. మరో మార్గం లేదు. ఏదో ఒక డ్రామా చెయ్యకపోతే ఈ రాజకీయ వర్గం వూరుకోదు. జుడీషియల్ ఎంక్వయిరీ వరకూ వెళ్ళేలాగుంది. వెళ్ళినా మనకేం భయం లేదనుకో. కానీ రొష్టూ బురదానూ...ఐ డోంట్ వాంట్ దట్"

"అదికాదు సార్! ఇదంతా అక్కర లేదనుకుంటాను. ఇందాకే కా పు వీ ధి కేసులో మనం నెగ్గాం. ముగ్గురు ముద్దాయిలకు కన్విక్షన్ ఇచ్చాడు మెజిస్ట్రేట్"

"అది కుదరదులే. కాపు వీధిమీద. పోలీసులు దాడిచేసి అమానుషంగా, విచక్షణారహితంగా అందరినీ కొట్టినట్టు, గాయపరచినట్టు, లూటీలు చేసి స్త్రీలను అవమానించినట్టు మీ లోకల్ ఎమ్మెల్యే, ఆ వీధిలో మరికొందరూ నాకొక ఫిర్యాదు చేశారు. ఛీఫ్ మినిస్టర్‌కీ, హోం మినిస్టర్‌కి ఫిర్యాదు చేశారు. నీకు కూడా ఫార్మల్‌గా ఫిర్యాదు చేస్తారు. తీసుకో. మనం దానికి బదులుగా చేయగలిగింది నేన్చెప్పిందే. అంతమందిని సస్పెండ్ చేశారంటేనే చాలు వాళ్ళ కళ్ళు చల్లబడుతాయి."

"కానీ స్టాఫ్ డీమోరలైజ్ అవుతారేమో"

"అవకూడదు. అవకుండా చూసే బాధ్యత నీది".

"సరే సర్"

"ఆల్‌రైట్. నేను మళ్ళీ ఉదయం ఫోన్ చేస్తాను. ఉదయానికల్లా సస్పెన్షన్ ఆర్డర్స్ పంపించి అవసరం అయితే వాళ్ళతో మాట్లాడు"

"కాదు సార్! నాకు ఫిర్యాదు అందిన తరువాత చేస్తేనే బాగుంటుంది కదా"

"అవసరంలేదు. నేను అఫిషియల్‌గా ఆ ఫిర్యాదు అందుకున్నాను. నేను టి.పి.లో రిటెన్ ఆర్డర్స్ పంపుతాను. దర్యాప్తు చేయమని నీకు ఆర్డర్స్ కూడా టి.పి.లో పంపుతాను".

"సరే సర్!"

ఐ జీ ఫోన్ పెట్టేశాడు అవతల.

పార్థసారథికి చెమటలు పట్టాయి.

"గోడవొచ్చి పడింది" అని అన్నాడతను.

ఏమిటి అని అడగడానికి ఏఎస్పీకి గుండెలు చాలేయి కాదు.

పార్థసారథి బల్లమీద పేపర్ వెయిట్ చేతిలోకి తీసుకొని కాసేపు దానితో ఆడుకున్నాడు.

తర్వాత నెమ్మదిగా మాటాడుతూ విషయం అంతా ఏఎస్పీకి చెప్పేడు.

"సార్! ఫోర్సు డీమోరలైజ్ అవుతుందని నాకు భయంగావుంది సార్. మొన్న వన్‌టౌన్ పీ.సీ.ని సస్పెండ్ చేసినందుకే చాలామంది మనసు కష్ట పెట్టుకున్నారు. అందులోనూ ఆర్మ్‌డ్ రిజర్వ్ ఫోర్సులో ఇప్పటికే సర్వీసు కండిషన్స్‌మీద చాలా అసంతృప్తి వుంది. దీనితో అది మరింత అతిశయిస్తుందని నా భయం"

 

"ఇదే నాకు అసహ్యం. ఫోర్సు డీమోరలైజ్ అవుతుందంటే అవుతుంది మరి. కామేశ్వర్రావు ఒంటిమీద ఈగ వాలడానికి హైదరాబాద్ ఒప్పుకోదు. అప్పుడే అక్కడే పక్షపాతం. ఇవతల వాళ్ళు ఏమనుకుంటారో అని కూడా ఆలోచించరు. ఛీ ఛీ... ఎంత డిసిప్లిన్ వంకపెట్టినా నోళ్ళు నొక్కెయ్యగలమా? స్టాఫ్ కళ్ళు మూసేయగలమా?" ఏ.ఎస్.పీ. మాట్లాడలేదు.

"సరే. నువ్వు కాస్త సాయం చెయ్యాలి. కాపు వీధిలోకి వెళ్ళిన ఏ.ఆర్ సెక్షన్‌లోని వాళ్ళ పేర్లూ, ముందుగా ఆవీధిలోకి వెళ్ళి తగువులో ఇరుక్కుని దెబ్బతిన్నవాళ్ళ పేర్లూ నాకు కావాలి. ఇది చాలా కాన్ఫిడెన్షియల్‌గా జరగాలి. రేపుదయం సస్పెన్షన్ ఆర్డర్లు అంద జెయ్యాలి. ఎంత రాత్రయినా నేనిక్కడే వుండి ఆకాగితాలు తయారు చేయిస్తాను."

"సరే సర్" అని ఏ.ఎస్.పీ. లేచి బైటకు వెళ్ళిపోయాడు.

పార్థసారథి సిగరెట్ వెలిగించు కొన్నాడు.

చాలా చికాగ్గా, విసుగ్గా వుందతనికి. అందరి మీదా కోపంగా వుంది.

'వాడికేం? వాడు హైద్రాబాద్‌లో కూచుంటాడు. మధ్య – ఇక్కడ అన్ పాపులర్ అయిపోయి నానా బూతులూ పడేది నేను'అనుకున్నాడతను.

* * *

మూర్తి స్కూటర్ ఆపి, స్టేండ్‌వేసి త్రీటౌన్ స్టేషన్‌లోకి అడుగుపెట్టాడు.

సుందరయ్య, జోసెఫ్, క్రయిం పి.సి. అప్పలరాజూ ముందు గదిలో హస్కులో వున్నారు. వాళ్ళని చూసి తడబడ్డాడు మూర్తి. చేతిలోని ఫైల్‌పై వేళ్ళు మరింత గట్టిగా బిగుసుకున్నాయి. తల వంచుకుని లోపలికి వెళ్ళిపోయాడు. ఫైల్ టేబిల్ మీద పెట్టి కుర్చీలో కూల బడ్డాడు.

అతని గుండె దడదడా కొట్టు కుంటోంది.

'నచ్చచెప్పవలసిన బాధ్యత నీదే' అన్నాడు ఎస్.పీ పార్థసారథి అయిదు నిమిషాల కింద అతడ్ని సాగ నంపుతూ.

'నా మొహం నేనేం నచ్చచెప్పగల్ను. అది నీకే చాతనయ్యే పనిగాదు' గొణు క్కున్నాడు మూర్తి.

అయిదు నిమిషాల పాటు అతను అలాగే కూచున్నాడు.

ఫోన్ మోగింది.

తీసి "హలో.. త్రీటౌన్ పోలీస్ స్టేషన్ ప్లీజ్" అన్నాడు నీరసంగా.

"మూర్తీ... ఇచ్చేవా... ఏవిటంటు న్నారు?" అని ఆత్రంగా అడిగాడు పార్థ సారథి అవతల్నించి.

మూర్తి వెర్రినవ్వు నవ్వేడు "నేని ప్పుడే వచ్చాను సార్..."

"సరే.. సరే... తొందరగా ఇవ్వు. జాగ్రత్తగా వాళ్ళకి నచ్చచెప్పు. అంతా నువు మాట్లాడ్డంలో వుంది" అని పార్థసారథి ఫోన్ పెట్టేశాడు.

'అంత జాగర్తయిన పని నువ్వే చెయ్య కూడదురా పాసార్థీ' అనుకున్నాడు మూర్తి.

తరువాత రిసీవర్ క్రెడిల్ చేసేసి, ఫైల్‌లోంచి నాలుగు కాగితాలు తీశాడు.

సుందరియ్యా...

బైరాగి...

ఆనందం...

జోసెఫ్..

సస్పెన్షన్ ఉత్తర్వులు మరొక్కసారి చదివాడు.

"మే నాలుగో తేదీ నీవున్నూ, నీ సహచరులయిన పోలీస్ కానిస్టేబుల్స్ 15 మందిన్నీ విధి నిర్వహణకై పట్టణములోని కాపువీధిలోకి వెళ్ళి, అచ్చట చట్టవిరుద్ధముగా, అనుచితముగా ప్రవర్తించి, ప్రజలను భయభ్రాంతులను చేసి, స్త్రీలను పీడించినారనీ, పౌరులను హింసించినారనీ ఫిర్యాదు అందినది. డిపార్టుమెంటుకు ప్రజలయందుకల బాధ్యతను పురస్కరించుకొని, ఆ ఫిర్యాదుయందుగల నిజానిజాలను తెలుసుకొనవలెనని డిపార్టుమెంటు నిశ్చయించుకొనినది. అందుకోసమై జిల్లాస్థాయి సీనియర్ పోలీసు అధికారి యొకరు విచారణ జరిపెదరు. ఆ విచారణ సక్రమముగా సాగుటకున్నూ, నైతికబాధ్యత దృష్ట్యానూ నిన్నునూ, ఆరోజు నీతోపాటు కాపువీధిలోకి వచ్చిన ఇతర పి.సీ లనూ, కాపువీధి ఘర్షణకు మూలకారకులైన నలుగురు పీసీలను విచారణ పూర్తియగు వరకు సస్పెన్షన్‌లో వుంచుట వుచితమని నేను భావించుచున్నాను. డిపార్ట్‌మెంట్ ప్రతిష్టకు ఇది అత్యంత అవసరమనికూడా నేను భావించుచున్నాను. ఈ ఉత్తర్వు నీకు అందిన క్షణమునుంచీ ఇది అమలులోనికి వచ్చును.

ఇట్లు

(సం) జిల్లా పోలీసు సూపరింటెండెంట్.

మళ్ళీ వాటిని ఫైల్‌లోపెట్టి "సుందరయ్యా..." అని నెమ్మదిగా పిలిచాడు.

నవ్వుతూ వచ్చాడు సుందరయ్య.

"ఎస్ సార్!"

సుందరయ్య నవ్వుమొహం చూసి నీరుకారిపోయాడు మూర్తి. గుటకలు మింగి"అక్కడ జోసెఫ్‌కూడావున్నాడు. కాస్త పిలు. మీఇద్దరితోను కాస్త మాట్లాడాలి"

"ఏమిటిసార్ విశేషం..." అని అడుగుతూనే సుందరయ్య జోసెఫ్‌ను పిలుచుకొచ్చాడు.

"కూచోండి" తల వంచుకొని అన్నాడు మూర్తి.

"ఫర్వాలేదులెండి సార్.. చెప్పండి"

"ఏంలేదు... కూచోండి... అదీ... మరేంలేదు... చిన్న గొడవవచ్చి పడిందోయ్... ఈ మధ్యకాలంలో మన దేశంలో ప్రజాస్వామ్యం ఒకటి బలిసిపోయింది. చీటికీ, మాటికీ మనమీద ఖద్దరేసిన ప్రతివాడూ సవారీ జేసేస్తున్నాడు. మనందరం అహింసమార్కు పోలీసుల్లాగ వుండాలట. మనం అలాగుంటే తెల్లవారీసరికి దేశాన్ని తీసికెళ్ళి బంగాళాఖాతంలో కలిపేసే నేరస్తులున్నారు దేశంలో. ఏం.. అయితే మనది అలాంటి ప్రజాస్వామ్యం అయిపోయింది. ఏదో చావలేక బతుకుతున్నట్టు వుంది మన డిపార్ట్‌మెంట్ పని.ఇకపోతే ఒకపక్క విధులు,ఒకపక్క రూల్సు, ఒకపక్క ఖద్దరూ. మధ్యలో మనం చచ్చిపోతున్నాం. ఏ డిక్టేటరో వస్తే తప్పించి మనకి విముక్తి లేదు"

"మాకేమీ అర్థంకావడంలేదు సార్... మీరిదంతా ఎందుకు చెప్తున్నారో ఏటో" అన్నాడు సుందరయ్య.

మూర్తి వెర్రినవ్వు నవ్వేడు. "అక్కడికే వస్తున్నాను. కాపువీధి కేసు పెద్ద గొడవ అయ్యేటట్టుగా వుంది. మనం ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా నానా అల్లరి అవుతుంది".

"కాపువీధి గొడవేటి సార్!? అంతా

అయిపోయిందిగదా. నిన్ననే మేస్ట్రీటు తీర్పు అయిపోయిందిగదా" అన్నాడు జోసెఫ్.

మూర్తి నిట్టూర్చాడు. "అయిపోతే బాగానే వుండును. కానీ నిజానికి గొడవ ఇప్పుడే ప్రారంభం అవుతోంది. ఇక్కడయితే మనం నొక్కి పారేద్దుం. కానీ హైదరాబాద్‌లో...మనం చెయ్యగలిగింది డిసిప్లిన్‌తో వుండి డిపార్ట్‌మెంట్ పరువు కాపాడటం"

"దానికేం సార్. డిపార్ట్‌మెంట్ కోసం ప్రాణాలైనా ఇస్తాం. మా సంగతి మీకు తెలీదా?" అన్నాడు సుందరయ్య గట్టిగా.

అవునన్నట్టుగా తల వూపాడు జోసెఫ్

"అయినా ఖద్దరేసుకున్న ప్రతివాడూ మనమీద ఎక్కిపోడానికి చూస్తుంటే మన డిపార్ట్‌మెంట్ ఎందుకూరుకుంటుంది సార్. నాకు తెలీకడుగుతాను. నేరస్తుణ్ణి కొడితే కొడతాం, చంపవలసి వుంటే చంపుతాం. ఆ మాత్రం పవర్సు లేక పోతే మరి పోలీస్ డిపార్ట్‌మెంట్ ఎందుకు సార్!? మన ఐ జీ గారూ వాళ్ళు మెతక గనక ఖద్దరోళ్ళిలాగా మన ఖాకీ కొంప మీద ఎక్కిపోతన్నారు" అన్నాడు సుందరయ్య మళ్ళీ.

"రైటే. ఇప్పుడి సమస్య వచ్చి పడింది. దీనికి ముఖ్యంగా మీ సహాయం అవసరం అని ఎస్.పి. గారు స్వయంగా చెప్పమన్నారు. కాపువీధి వ్యవహారంమీద ఈ వూరినుంచి కొంతమంది పొలిటీషియన్లూ, హైదరాబాద్‌లో ఓ రాజకీయ వర్గం ఐ జీ గారికీ, హోం మంత్రిగారికీ, ఛీఫ్ మినిస్టర్‌గారికీ కంప్లయింట్ ఇచ్చి జుడిషియల్ దర్యాప్తు చేయించమని పట్టు పడుతున్నారట. దానికి ప్రతిగా ఐ.జీ. గారు ఓ ప్లానేసేరట. దాని ప్రకారం మన యస్ పీ గారే ఎంక్వాయిరీ చేస్తారు. మన ఎస్ పీ గారే ఎంక్వాయిరి చేస్తే రిజల్టు ఎలాగుంటుందో నేను వేరేలా చెప్పక్కరలేదు కదా".

"మంచిది సార్"

"అసలు విషయం ఇక్కడే వుంది. అటు రాజకీయ నాయకులనూ, ఇటు ప్రజల్నీ, పత్రికవాళ్ళనీ ఏమార్చాలంటే మనం పెద్ద నాటకమే ఆడవలసి ఉంటుంది. అందుకోసం మొత్తం ఇరవైమంది పీ.సీ.ల్ని సస్పెండు చేయవలసి ఉంటుంది. వుట్టిట్టి సస్పెన్షన్ అనుకోండి కానీ మనవాళ్ళకి ఈ విషయం అర్థంకాక పోతే ఈ సస్పెన్షన్ను చూసి అనవసరంగా భయపడతారు. ఆరోజు రాత్రి మీరు వెళ్ళిన తరువాతగదా ఆ గొడవ ప్రారంభం అయింది. నువ్వూ, జోసెఫ్, బైరాగీ, ఆనందం మన స్టేషన్‌కు సంబంధించి నలుగురు. ఆ తర్వాత కంట్రోల్ రూం నుంచి వెళ్ళిన పదిహేనుమంది మొత్తం 19 మందిని ఈ నాటకంలో భాగంగా సస్పెండు చేయవలసి వుంటుంది"

చివాలున లేచిపోయాడు సుందరయ్య

అతని మొహం పాలిపోయింది.

"నాటకాలు ఆడదలుచుకుంటే రాజకియ నాయకులు, మీరూ ఆడుకోండి మధ్య మాకేంటి సంబంధం. తియ్యతియ్యగా చెప్తుంటే ఏటో అనుకున్నాను. ఇదా సంగతి. మీరూ మీరూ కులాసాగా వుండడానికి పీ సీ ల్ని సస్పెండు చేస్తారా? ఎవడొప్పుకుంటాడు? ఎవడొప్పుకున్నా ఒప్పుకోకపోయినా నేనొప్పుకోను" అన్నాడతను.

మూర్తికి కోపం వచ్చింది. మొహం గంటుపెట్టుకున్నాడు. ఫైల్‌లోంచికాగితాలు

తీసి సుందరయ్యకు, జోసెఫ్‌కు సంబంధించిన రెండు కాగితాలు తీసి, "ఇదిగో ఎస్.పీ. చెప్పమన్నది చెప్పాను. అటుపైన మీ ఇష్టం. మధ్యలో నాదేముంది? వారూ వారూ చూసుకుంటారో, మీరూ మీరూ చూసుకుంటారో మీ ఇష్టం. ఈ కాగితాలు తీసుకోండి"

"సస్పెన్షన్ కాగితాలు మేం తీసుకోం సార్! కాపువీధి వాళ్ళదే తప్పని నిన్న సాయంత్రం మేజిస్ట్రేట్ తీర్పు ఇచ్చిన తరువాత ఇంకా ఈ న్యూసెన్సేటి. తెల్లారేలోపల హైదరాబాద్‌లో మాత్రం ఏటయిపోయింది. ఖద్దరోళ్ళను చూసి ఐజీ గారు, ఎస్. పీ. గారూ, మీరు భయపడితే పోసుకోండి. మాకేంటి బయ్యం... మాకేం బయ్యం లేదు. తల తీసి మొలేస్తారా? మహాఅయితే ఉద్యోగం పోతది. అప్పుడు జేబులు కొట్టుకుని బతుకుతాం. ఎదవ బతుకు ఆ మాత్రం బతకలేమా? ఆ కాగితాలు మేం తీసుకోం. ఏవో తక్కువవాళ్ళ



సంగతి నాకు తెలీదు. నేను తీసుకోను. నాటకవట, హైదరాబాద్‌ట... ఆడుకోండి. మీరు నాటకాలాడదలుచుకుంటే ఆ మీసాలేవో మీరే గొరిగించుకుని, ఆ రంగులేవో మీరే రాసుకోండి. మాకు సున్నంకొట్టడం తాకాదంటే మేం ఒప్పుకోం. కనీసం నేనొప్పు

కోను.పీసీలంటే మీకు ఈకకంటే తేలికయి పోయినట్టుంది. అంత వెర్రికూపులాగ కనబడుతున్నామా మీ కంటికి. అంత గట్టిగా సస్పెండు చెయ్యదలుచుకుంటే డీయస్పీ కామేశ్వర్రావుని సస్పెండు చెయ్యమనండి. కస్టడీలో వున్నోణ్ని కుళ్ళబొడిసి సంపినోడు ఆయనే. ఆయనను బదరరఫ్ చేసి, జెలుకు పంపండి దమ్ములుంటే" అంటూనే సుందరయ్య అక్కణ్నించి బైట వరండాలోకి వచ్చేడు.

"తమాసికాలుగుందా? లంజకొడుకులకు పీసీలంటే ఏటిగాకుండా ఉన్నాది. హైదరాబాద్‌లో గొడవవుతాదిట.అందుకని ఏకంగా ఇరవైమందిని సస్పెండు చేస్తారట. వుట్టిట్టి సస్పెన్షనట. అది చూసేసు గాదు. ఎవ్వడికి తెలీని ఏసాలు. ఖాకీ టోపీలకి ఎసరొస్తే దాన్ని చారలటోపీ మీదికి నెట్టేడానికి ఇలాంటి ఏసాలేస్తారు లంజకొడుకులు. అంత సపకామేవంటే? మీకంత సవకయిపోయిందిటండీ ఎస్. పీ. గారూ?"

సుందరయ్య షణాలమీద రాజుతున్న మంటలాగున్నాడు. అతని మొహం కండ గడ్డలాగుంది.

లోపలినుంచి జోసెఫ్ చేతిలో కాగితం పట్టుకొని వచ్చాడు. చటుక్కున దాన్ని అందుకున్నాడు సుందరయ్య. గబగబా చదివాడు.

"నువ్వు తీసేసుకున్నావా? ఏంరా పిరికి లంజకొడకా. అందికే మన పని ఇలాగ కుక్కబతుకులాగుంది. ఒకపక్క నేను తీసుకోనని మొరాయిస్తుంటే రెండో పక్క నువు తోక ముడుచుకుని వెళ్ళి సస్పెన్షన్‌కాగితం తీసేసుకుంటే నా సంగతేటి? అక్కడికి నేనే గదా దెబ్బకి దొరికిపోయింది.. అందికే... అందికే... మన పని ఇలాగ... ఛీ కుక్కలాగుంది..."

జోసెఫ్ మాట్లాడకుండా సుందరయ్య వెన్ను తట్టేడు. "తీసుకోవడం తప్పదులే. కోపం నాకూవుంది. అయినా తప్పుతాదా. ఎన్నో నాటకాలుచూసేం. ఇదీ చూద్దాం. తలతీసి మొలేసిరుకదా. ఏం సస్పెన్షను... గాడిదగుడ్డు సస్పెన్షను. పోయి తీసుకుందూ" అన్నాడతను నెమ్మదిగా.

"నేను తీసుకోను. అసలీ వరసేటి ? మనం నక్కలవెట్రా జోసెపూ,...దిష్టిబొమ్మలమా? నువ్వేచెప్పు. డిసిప్లిన్ అంటే ఏటి గాజులా? బేడీలా? లేకపోతే సేతులు నరికేదవా? ఏటి డిసెప్లిన్... లంజకొడుకులు సీటికి మాటికి సస్పెండు చెయ్యడవేటి? వారం రోజులన్నా అవలేదు కదా వన్‌టౌన్‌లో సుబ్బారావుని సస్పెండు చేసి.. ఏకంగిరవైమందిని సస్పెండు చెయ్యడవెటి... పోనీ నువ్వే చెప్పు"

క్రయిం పోలీసు అప్పలరాజు సుందరయ్య దగ్గరికి వచ్చి "చూసేవా.నువ్విన్ని తిట్లుతిడుతుంటే ఎస్సయి బిక్కసచ్చి పోయినట్లు అలాగ కుర్చీలో బిగుసుకుపోయాడు. హరే... మనవేగానీ ఏట్రా లంజకొడకల్లారా!? ఏట్రా ఈ వరసా అని అడగడం మొదలెడితే ఎస్పీగాడు కూడా అంతా బిక్కసచ్చిపోయి కుక్కిన పేనుల్లాగ పడివుంటారు" అన్నాడు.

జోసెఫ్ సుందరయ్య భుజంమీద చెయ్యి వేశాడు"నామాట విని ఆ కాగితం తీసుకో కాగితం తీసుకోడవంటేతో కమడిచీడవేనని ఎందుకనుక వాలి. తోకకు నిప్పు పెట్టడం కూడా అని అనుకోవచ్చు. తీసుకొని బైటకి రా. వన్ టౌన్ ఎస్సయున్నాడు.

 

గదా ప్రకాశ్‌రావు. ఆయన దగ్గిరకి వెళ్దాం. ఆయన ఇలాంటివాటికి ఒప్పడు. ఇంతకుముందునుంచే పోలీసు యూనియన్ పెడదాం, పెడదాం అని ఆయన కోరుతున్నాడు. రా. కేకలేసి, తిట్లుతిట్టడం వల్ల మనకేం లాభం లేదు..రా..."

"నీదో చేదస్తంరా. పోనీ ముందు అతగాడిని కలుసుకున్నాక నువు ఆ కాగితం తీసుకోవలసింది.. నువు తీసుకుంటే నేను తీసుకోవాలి. మనిద్దరం తీసుకున్నావని తక్కినోళ్ళు తీసుకుంటారు. మనం నోరు మూసుకొని వెళ్ళిపోతే తక్కినవాళ్ళు కూడా అదే చేస్తారు.

"నేన్చెప్పినట్టు చెయ్యి. నా వల్లనే గానీ నష్టం జరిగితే ఆనక చెప్పుదెబ్బ తింటాను సరేనా!"

సుందరయ్య చ ర చ రా నడిచి మూర్తిని సమీపించాడు "ఆ కాగితం ఇవ్వండి''

మూ ర్తి తల ఎత్తకుండా ఫైల్లోంచి సుందరయ్య సస్పెన్షన్ కాగితం తీసి ఇచ్చి ఓ కాగితంమీద సుందరయ్య చేత సంతకం పెట్టించుకున్నాడు.

'కానీయండి నా కొడకల్లారా. నాకేగానీ అన్యాయం జరిగితే వుత్తినే పోను. స్టేషన్‌కి నిప్పెట్టేస్తాను."




సాయుధ రిజర్వ్ పోలీసు కార్యాలయంలో డ్యూటీ ఆఫీసర్ ఇచ్చిన సస్పెన్షన్ కాగితాన్ని అందుకుని కళ్ళకద్దుకున్నాడు లక్ష్మణరావు.

తరువాత నేల మీద బోర్లా పడుకొని సాష్టాంగ నమస్కారం చేశాడు.

డ్యూటీ ఆఫీసర్ కంగారుగా కుర్చీలోంచి లేచి నిల్చున్నాడు.

లక్ష్మణరావు కూడా లేచి నిల్చుని "సర్వీసులో చేరిన తర్వాత తమ చేతుల మీదగానే మొట్టమొదటిసారిగా సస్పెండయ్యాను. చాలా వుపకారం చేసేరు" అన్నాడు.

డ్యూటీ ఆఫీసర్ మొహం మాడ్చుకున్నాడు. ''నేను చేసిందేమీ లేదు. ఎస్.పి.గారు చెయ్యమన్నట్టు చేసేను"

"సస్పెండ్ చెయ్యడమంటే డ్యూటీకి రావద్దనే కదండీ?"

తల వూపాడు డ్యూటీ ఆఫీసర్.

"ఈ రకంగానైనా న్యాలోజులు వేళకి భోంచేసి, ఇంటిదగ్గిర కావలసినంత సేపు వుండొచ్చు. తర్వాత ఏం జరిగితే జరిగింది" అన్నాడు లక్ష్మణరావు.

డ్యూటీ ఆఫీసర్ మాట్లాడలేదు.

సస్పెన్షన్ ఉత్తర్వును పదే పదే కళ్ళకద్దుకొంటూ గదిలోంచి బైటకొచ్చాడు లక్ష్మణరావు.

అతని సెక్షన్‌లోవున్న మిగిలిన పీ.సీలందరూ అక్కడే వున్నారు.

"తడి గుడ్డతో పీకలు కోసేదవంటే ఇదే.. ఎర్ర బూటుతో పీక మీద అడుగేసి మట్టేసేరు.. ఏకంగిరవైమందిని సస్పెండ్ చేశారు. ఏటి చెయ్యాడమో నాకు అర్థం కావటంలేదు" అని ఓ ఏ.ఆర్. పి.సి అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. అందులో ఒక

పి.సి. హఠాత్తుగా తనచేతిలోని సస్పెన్షన్ ఉత్తర్వుని పరపరా చింపివేశాడు. చర చరా నడిచిపోయాడు.

"వన్ టౌన్‌లో వో యస్సయి వున్నాడు ప్రకాశరావని. మంచోడు. అతగాడోసారి రెండుసార్లు నా దగ్గిర యూనియన్ సంగతి ఎత్తాడు. పోనీ అతని దగ్గిరకు వెళితే..." ఒక పీసీ ఉత్సాహం తెచ్చుకుంటూ అన్నాడు.

"ఏం లాభం లేదయ్యా! ప్రకాశ రావెవడు మధ్దిన. మనమే ఖోయ్జి ఎస్.పీ.ని అడుగుదాం, తప్పేటి?బతిమాలు కుందాం... మనవెంత? మన వుజ్జీగాలెంత. ఆళ్ళతో మనం ఘర్షణకు దిగగలమా? దిగినా గెలిచేమా? ఒట్టిమాట" అన్నాడు మరొకతను నిరుత్సాహంగా.

లక్ష్మణరావు వరండాలోంచి దిగాడు. అతని వెనుకనే మరి ఇద్దరు దిగారు. ఆ వెనుక మరికొందరు. ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా నడుస్తున్నారు.

రయ్‌మని ఓ సైకిల్ మీద వచ్చి ఆగేడు జోసెఫ్.

"ఇదిగో లక్ష్మణరావు, రమణ..మాట. సస్పెన్షన్ ఆర్డర్లు తీసుకున్నారా?"

తలవూపారు అందరూ.

"సరే. మీరు ఓ గంటలో పోలీసు క్లబ్ దగ్గిరికి రండి. పనుంది. మనందరం మాట్లాడాలి. మనవాళ్ళెవరైనా వస్తే తీసుకురండి. చాలా ముఖ్యం. మనం ఏదో ఒకటి చెయ్యాలి..."

"ఏటా పని"

"పనంటే ఇదీ అని ఏమీలేదు. మనం మాట్లాడుకుందాం. అందరం కలిసి నిర్ణయానికి వద్దాం. చేద్దామంటే చేద్దాం లేదంటే లేదు. అందరికీ కష్టం వచ్చినపుడు అందరూ కలిసే వుపాయాన్ని ఆలోచించాలి. ప్రకాశరావని ఎస్సయి వున్నాడు కదా. ఆయన కూడా వస్తున్నారు. సివిల్ పోలీసులు చాలామంది వస్తారు. మీవాళ్ళు కూడా సాధ్యమయినంత ఎక్కువ మందివస్తే బాగుంటాది. నేనింకా బ్యారెక్స్‌లోకి వెళ్ళి మీ వాళ్ళను పిలవాలి. మీ మట్టుకు మీరు అక్కడికి తొందరగా వచ్చేయండి"

వచ్చినంత వేగంగా మా వెళ్ళిపోయాడు జోసెఫ్.

"నే వెళ్తాను. ఒచ్చినోడు రావొచ్చు. రాని లంజాకొడుకు వెళ్ళి డ్యూటీ ఆఫీసరు కాళ్ళకాడ కుక్కలాగ పడుకోవచ్చు" అనేసి లక్ష్మణరావు వాళ్ళ నుంచి విడిపోయాడు.

కాగితం మడిచి జేబులో పెట్టుకున్నాడు. తల వంచుకుని పెరేడ్ గ్రౌండ్స్ దాటి రోడ్డు మీదికి వచ్చేడు.

అతని తల మొద్దుబారిపోయి వుంది.

ఏమీ ఆలోచించకుండా నడిచి ఓ హోటల్‌కి వెళ్ళి కాఫీ తాగేడు. డబ్బులిచ్చి బైటకొచ్చి నెమ్మదిగా నడుస్తూ సందులు పట్టి పోలీసు క్లబ్‌కేసి నడిచాడు.

అరగంట పట్టింది అతను అక్కడికి చేరేసరికి.

కాళ్ళు రెండూ నిటారుగా తన్నిపెట్టి, వూపిరి బిగబట్టి, ఛాతీ ఉబ్బించి, తల నిటారుగా వుంచి, కుడిచేత్తో సెల్యూట్ చేస్తున్న పోలీసు విగ్రహం పోలీసు క్లబ్ ఆవరణలో ఎండలో నించొని వుంది.

అప్పటికే అక్కడికి ముప్పయి నలభయిమంది కానిస్టేబుల్స్ చేరేరు. లక్ష్మణరావు లోపలికి వెళ్ళేసరికి బెంచీ మీద నుంచి ఎస్సయి ప్రకాశరావు లేచేడు.

"సరే నేను వెళ్తాను. ఇది




అన్యాయం అని నేను పూర్తిగా నమ్ముతాను. అది మనసులో వుంచుకొనే ఎస్.పి. గారితో మాట్లాడతాను. నిజానికి ఇవాల్టి సమస్య కొత్తది కాదు. అసలీ సమస్యకు మూలం ఇంకొకటి. సరే! నేను వెళ్తాను..."

"గట్టిగా మాట్లాడండీ ప్రకాశరావుగారూ! సస్పెన్షన్ ఆర్డర్లు విత్డ్రా చెయ్యకపోతే చాలా గొడవ అవుతాదని చెప్పండి. లంజికొడుకులు వూరుకొంటున్నకొద్దీ భుజాల మీదికి ఎక్కిపోతున్నారు."

"చెప్పినట్టు వినకపోతే లంజికొడుకుని చెప్పుచ్చుకు కొట్టేసిరండి"

"అలాగే...అలాగే" ప్రకాశరావు బైటకి వెళ్ళిపోయాడు.

కిటికీవారనున్న బెంచీమీద కూర్చున్నాడు లక్ష్మణరావు.

గోడవారనున్న గాడ్రెజ్ కుర్చీలో కూచుని సుందరయ్య సిగరెట్ మీద సిగరెట్ తాగుతున్నాడు. బైరాగి రెండు చేతులూ వెనక్కి పెట్టుకుని పచార్లు చేస్తున్నాడు.

వన్‌టౌన్ పోలీసు కానిస్టేబిల్ అప్పలకొండ లోపలికి వచ్చాడు. ఒకరు ఒకరు ఆ తర్వాత వో ఇరవై మంది వరకూ వచ్చారు.

"మనం అడిగినదానికి ఎస్ పీ ఒకవేళ ఒప్పుకోకపోతేనో" అని వో కానిస్టేబిల్ అడిగాడు.

నిశ్శబ్దం.

"ఒప్పుకోకపోతే మీదపడి చెవులు కొరికి చేతిలో పెట్టేస్తాను" అన్నాడు లక్ష్మణరావు ఎవరి వైపూ చూడకుండా గట్టిగా.

కొందరు నవ్వేరు. కొందరు చీదరించుకున్నారు.

గంటన్నర పట్టింది ప్రకాశరావు తిరిగి రావడానికి.

అతను గదిలోకి రావటంతో నే చాలామంది లేచి నిలుచున్నారు.

"కాయా పండా?"

"ఒప్పుకున్నాడా?"

"ఏటన్నాడు లంజికొడుకు?

ప్రశ్నలవర్షం వెలిసాక—

ప్రకాశరావు వో బెంచీ మీద కూచుని రుమాలుతో మొహం తుడుచుకున్నాడు "సస్పెన్షన్‌లు రివోక్ చెయ్యటం కుదరదని ఖచ్చితంగా చెప్పేడు. ఇదంతా కన్నీటి తుడుపేననీ, చచ్చిపోయిన చినరవణకు పొలిటికల్ కనెక్షన్‌లు వున్నాయనీ, అలాంటి కతలన్నీ వినిపెంచేడాయన. ఎంక్వాయిరీ తానే కండక్ట్ చేస్తాట్ట. కాగాపోగా నేను మిమ్మల్నందర్నీ రెచ్చగొట్టి ఇన్‌డిసిప్లిన్ క్రియేట్ చేస్తున్నానట. నా మీద క్రమశిక్షణ చర్యలేవో తీసుకుంటాట్ట. సస్పెన్షన్‌ల విషయం ఐజీ తప్ప మరెవరూ ఏమీ చెయ్యలేరట"

"అయితే ఐజీనే అడుగుదాం. మనకేటి భయమా?" అన్నాడు ఆనందం.

"ఎదవబుర్ర ... ఎదవబుర్ర" అన్నాడు సుందరయ్య విసుక్కొంటూ

ఆనందానికి కోపం వచ్చింది "ఆ నీకుంది లేవో మహాబుర్ర. ఎవడికుండే బుర్ర ఆడికుంటాది" అన్నాడతను.

లక్ష్మణరావు కలగజేసుకున్నాడు. "ఆనందంగాడి బుర్ర టోపీ పెట్టుకోడానికి తప్పించి మరెందుకూ పనికిరాదు" అన్నాడు.

నారాయణ లోపలికి వచ్చి కిటికీ దగ్గిర నిలుచున్నాడు.

"ఇప్పుడేం చేద్దామని మీ వుద్దేశం"

అన్నాడు ప్రకాశరావు.

"మీరే చెప్పండి. మీరేం చెప్పినా సై" అన్నాడు జోసెఫ్.

రిజర్వ్ కానిస్టేబుల్ రవణరావు లోపలికి వచ్చాడు.

"నేను చెప్పేదేవుంది? డిపార్ట్‌మెంట్ బలవంతా లోయర్ కేడరే. ఒక మెట్టు అటూ ఇటూగా నేనూ మీలోని వాడినే"

"అందికే మిమ్మల్ని నమ్మాం"

ప్రకాశరావు కాసేపు ఆలోచించి మొహం తుడుచుకుని పెదాలు తడుపుకున్నాడు. "సరే" అన్నాడు. తరువాత అందరినీ కలియజూసి "సరే! ఎలాగూ తెలిసో, తెలియకో ఒక అడుగు ముందుకే వేశాం. మంచిదే అయింది. ఇంతమంది పీసీలు ఇవాళ డ్యూటీలు ఎగ్గొట్టారని వాళ్ళెలాగూ డిసిప్లినరీ ఏక్షన్ తీసుకుంటారు. అది అధికారులకు పెద్ద విషయం కాదు. ఈ సస్పెన్షన్‌లయినా, ట్రాన్స్‌ఫర్‌లయినా, పనిష్‌మెంట్ డ్రిల్లులయినా, మరోరకమయిన అవమానమైనా దీనివెనుక ఏముందని మనం ఆలోచించాలి. ఏముంది? లోయర్ కేడరంటే చిన్నచూపుంది. పీసీలంటే నిర్లక్ష్యం వుంది. ఖద్దరుగాళ్ళ మాయ దీనికింద చాపకింద నీర్లాగ అంతలక్కా వుంది. నిజానికి మన డిపార్ట్‌మెంట్ ఇవాళ చాలా రోగాలతో కుళ్ళిపోతోంది. ఏం ఇంతమంది పీసీలు ఇవాళ్ళిక్కడ ఎందుకు చేరవలసివచ్చింది? అసలు ఎందుకు చేరేరు? ఎందుకు చేరేరంటే అంతమంది మనసుల్లోనూ అసంతృప్తి అనేది పొంగిపొరలుతోందన్న మాట. లోయర్ కేడరంతా ఇవ్వాళ లోడు చేసిన తుపాకీలాగ పేలడానికి సిద్ధంగా వుందన్నమాట. మన డిపార్ట్‌మెంట్ ఈ రోజున కథలోని మంత్రాల మర్రిలాగ, మాంత్రికుడి గుహలాగ వుందన్నమాట. దీనికి రుజువు మన సర్వీసు కండీషన్‌లు. అవి ఎంత దుర్భరంగా వున్నాయో మనం ఇతరులకి మాత్రమే చెప్పుకోవాలి. మనందరికీ ఆవిషయం ప్రత్యక్షంగా తెలుసును. ఇంటినిండా ఈ రోజున చీకటి తాండవిస్తోంది. ఒంటినిండా దరిద్రమే తాండవమాడుతోంది. వీటన్నిటినీ మార్చుకోవటంకోసం మనం ఏదో స్థాయిలో పోరాటం చెయ్యాలి..."

కానిస్టేబుల్స్ అందరూ తమ గొంతులే తాము వింటున్నట్టుగా వింటున్నారు.

"జీతాలు చాలకపోవటం ఒకఎత్తు... కానిస్టేబులవని పైఅధికారులు ఎలాచూస్తున్నారు...?"

కూచుని వింటున్న నారాయణ చివ్వున లేచాడు "వుండండుండండి. నేన్చెప్తాను. పై అధికారులు మమ్మల్ని ఎలాగ చూస్తున్నారో ఎస్సయికేటి తెలుస్తాది? వుండండి. అధికార్లు మమ్మల్ని కుక్కల కంటే కనాకష్టంగా జూస్తున్నారు. ఆ మద్దిన ఎస్.పి గారి భార్యగారు ఈ సుందరయ్య...ఇదిగో తలవంచుకుని ఆలకిస్తున్న ఈ సుందరయ్య చేత ఎంత చండాలపుపని చేయించింది? పోలీసు కానిస్టేబుల్స్ పైఅధికారుల ఇళ్ళల్లో చంటిపిల్లలకు ముడ్లూ, మూతులూ కడగాలా? కాశీపతి..అనకూడదుగానీ ఆ దుర్మార్గుడు నాచేత ఆవేళ ఎంతపని చేయించాడు? ఆడి బలవంతాన నేను కోమలా లాడ్జింగ్ కేసులో వో రాత్రి ఓ స్టూడెంటమ్మాయిని బలివిని ముదుపెట్టుకోవాల్సి వచ్చింది. మనుషలయినోళ్ళు ఇలాంటి పనులు చేయించవచ్చునా? అందికే జనం మనల్ని పెద్దరోగపోళ్ళని చూసినట్టు, పిచ్చికుక్కల్ని, పాముల్ని చూసినట్టు చూస్తు




న్నారు. మనకి పిల్లాపాపా వుండరా? మనకి పెళ్ళాం బిడ్డలుండరా? మనం ఇలాంటి పాపం పన్లుచేస్తే దేవుడూరుకుంటాడా? వూరుకోడు గనకనే కాశీపతిపని నడిరోడ్డుమీద అలాగయిపోయింది. ఆడు పోయేవరకూ నాకు పాపభీతి అయితే వుండేదికానీ ఇంతలాగ ఖచ్చితంగా దేవుడున్నాడని తెలీదు. ఆడు పోయిన వెంటనే నాకు దేవుడున్నాడనీ, ఆడు పాపుల్ని పాతి పెట్టేస్తాడని తెలుసుకున్నాను. ఇంక నాచేత ఎవరూ పాపం పని చేయించలేరు. అది ఖాయం" అన్నాడు అతను.

"అన్నట్టు... నిన్నగాక మొన్న నేను బస్టేండ్‌లో జేబులుకొట్టే గుంటపాపణ్ని పట్టుకుని స్టేషన్‌కి తీసుకొచ్చాను. స్టేషన్‌కి తీసుకొచ్చి నాలుగు పీకిన తరువాత ఆడెవడో తెలిసింది. మాటౌన్ స్టేషన్‌లోని ఆరేళ్ళ క్రితం రైటర్‌గా చేస్తూ డ్యూటీలోనే చచ్చిపోయిన అప్పన్న పంతులు కొడుకాడు. నాకు గుండెలు తరుక్కుపోయాయి. మనం సడన్‌గా చచ్చిపోతే మన పిల్లలు ఏటవుతారో ఆరోజే నాకు తెలిసింది. మనం రిటైరైన తర్వాత చచ్చిపోయినా మన పిల్లలు అంతకంటే గొప్పవాళ్ళు కాలేరు. మహా అయితే బస్సు క్లీనర్‌లు అవుతారు. లేకపోతే హోటల్‌లో క్లీనర్‌లు అవుతారు. అలాగున్నాయి మన బతుకులు" అన్నాడు అప్పలకొండ లేచి నిలబడి. ఆ తరువాత అతను నిశ్శబ్దంగా కూచుండిపోయాడు.

"పైన అయిదో పదో వొరికే సివిలోళ్ళకే ఇన్ని కష్టాలుంటే ఇంక మా రిజరోళ్ళ సంగతెలాగుంటాదో వూహించండి. అసలయిన వూరకుక్క బతుకులు మాయిరా బాబూ! ఇరవైనాలుగు గంటలూ మా జుత్తు డ్యూటీ ఆఫీసర్ చేతిలోనే వుంటాది. మా జీతాలు 12 రోజులు బతకడానికి సరిపోతాయి. మిగిలిన రోజులన్నీ మేం అడుక్కునే బతకాలి. అప్పులయినా అడుక్కోడవే కదా. ఇంకోటి చెప్పుకుంటే సిగ్గుచేటు. శేషగిరి అని ఓ రిజర్వ్ కానిస్టేబుల్ కిందటేడు వురేసుకుని ఎందుకు సచ్చిపోయాడో అందరికీ తెలుసుకదా. మూడొందల పాతికరోజులు దేశం మీదపడి తిరిగేవోడి పెళ్ళాం పరాయివాడితో పడుకుంటే తప్పు పట్టుకోగలవా? ఏరోజెక్కడుంటావో తెలీదు. ఏ రోజేమవుతామో తెలీదు. మేం దేశాల మీద పడి తిరుగుతుంటే మా పిల్లలు ఏటవుతారు? ఆలనా పాలనా చూసేవాడు లేక, సంరక్షణ చేసేవోడులేక మా పిల్లలు చెడతారు. ఇన్నెందుకూ సివిలోడికి పనిష్మెంట్‌గా రిజరోళ్ళలోకి తోసేస్తారు. మరి దాన్నిబట్టి మేవంటే ఎంత హీనంగా వుందో చూడండి. డ్రయివర్లుగా మేవే, ఆర్డర్లీలుగా మేవే. సకల అరవచాకిరీకీ మేవే...మేవే. సాదే ముప్పాతిక జీతానికి మేం నానా సంకలూ నాకాలి. కిందటి నెలలో నేను అప్పు కూడా పుట్టక బూట్లు అమ్మేసుకున్నాను. ఇపుడు పెరేడ్‌కి వెళ్ళాలంటే ఎవడియో ఒకడి బూట్లు అరువు అడుక్కోవల్సి వచ్చింది. అయ్యో మా బతుకులు" రిజర్వ్ కానిస్టేబుల్ రమణరావు ఆవేశంగా అన్నాడు.

"నిద్రపోతే బిగిలర్ కలలోకి వస్తాడు. డ్యూటీ ఆఫీసర్‌గాడి ఎర్రబూటు ఎప్పుడూ నా గుండెలమీద వున్నట్టుంటాది. వూపిరే సరిగ్గా ఆడదు. ఈ ఖాకీ బట్టలు వేసుకున్నప్పుడల్లా నేను నీటిలో మునిగి చచ్చిపోతున్న వాడిలాగ వుంటాను. ఇరవై ఏళ్ళ

నుంచి నాకు ఈ నిత్యచావు తప్పటంలేదు" లక్ష్మణరావు ఎవరికేసీ చూడకుండా తల వంచుకుని అన్నాడు.

బైట వరండాలో బూట్ల చప్పుడయింది. అందరూ తలుపులకేసి చూశారు.



వసటౌన్ సుబ్బారావు లోపలికి వచ్చాడు. ప్రకాశరావుకి సెల్యూట్ చేసి "సార్! మిమ్మల్ని సస్పెండు చేశారు. ఇప్పుడే నోటీస్ బోర్డుమీద కాయితం అంటించారు. ఎస్.పీ గారి ఆఫీసు నుంచి ఇప్పుడిప్పుడే కాయితం వస్తే, రైటర్‌గారే తీసుకెళ్ళి అంటించారండీ. అంటించమని ఎస్.పీ. దొరగారు చెప్పేరట"

సుందరయ్య కోపంగా లేచి నిల్చున్నాడు. "ప్రకాశరావుగారూ! మీరింక వూరుకోకూడదు".

"ఏవిటి చేద్దాం?"

నారాయణ వున్నట్టుండి లేచాడు. "వుండండుడండి" అని అరుస్తూ పెరటిలోకి పరిగెత్తి రెండడుగుల పొడవు ఇనుపగొట్టం ఒకటి పట్టుకొని వచ్చాడు. "అందరూ... మీరందరొకసారి బైటకి రండి.మనందరం ఏం చెయ్యాలో నేన్చెపుతాను" అని అరిచి బైటకి పరిగెత్తాడు.

ఏవిటి, ఏవిటి అని ఎవరికివారు ప్రశ్నించుకొంటూ పోలీసులందరూ హాలులోంచి బయట వరండాలోకి వచ్చారు.

అప్పటికే నారాయణ ఆవరణలోని

సిమెంటు విగ్రహం వున్న వేదికపైకి ఎక్కిపోయాడు. కుడిచేతో ఇనుపగొట్టం పట్టుకుని "ఇదిగో ఈ విగ్రహంలోని పోలీసు కానిస్టేబుల్‌గాడి చెయ్యి ఏం చేస్తోంది? సిగ్గు లేకుండా బానిసలాగ సెల్యూట్ చేస్తోంది. దీన్ని... నేనిప్పుడు ఈ చేతిని విరగ్గొట్టేస్తున్నాను" అని చెప్పి నారాయణ పెనువేగంతో, బలంతో పది పదిహేను దెబ్బలు కొట్టి ఆ పోలీసు విగ్రహం కుడిచేతిని పగలగొట్టాడు.

విరిగిన చేయి కిందపడింది. కింద నున్న పోలీసులు చప్పట్లు చరిచారు.




తన క్వార్టర్ ముందు నిలుచుని తలుపులు దడదడా తట్టేడు లక్ష్మణరావు.

అతని భార్య నాగమణి తలుపు తీసి పక్కకు తప్పుకుంది.

సుడిగాలిలాగ లోపల ప్రవేశించాడు లక్ష్మణరావు. లోపలి గదిలోంచి అతని కూతుళ్లిద్దరూ హాలులోకి వచ్చేరు.

"ఏవిట్రా హాలులో ఇంతిలాగ వెలురేలేకుండా కిటికీ తలుపులు కూడా వేసేసేరు. తీసీయండి. తలుపులన్నీ బార్లా తీసీయండి. బైట బోలెడు వెలుగున్నాది"

భర్తలో చాలా మార్పు కనిపించింది నాగమణికి. ఈమధ్య కాలంలో అతను ఎప్పుడూ అంత చలాకీగా నడవలేదు, మాట్లాడలేదు.

హఠాత్తుగా అప్పుడు జ్ఞాపకం వచ్చింది నాగమణికి.

"ఏవండీ... మిమ్మల్ని సస్పెండు చేశారట. ఎందుకండీ? ఇంతకూ నిజవేనా?"

"నిజవే... కానీ నీకేం బయంలేదు. మనకేం పరవాలేదే పిచ్చిమొగవా మేం ఫైట్ చేస్తున్నాం. ఇప్పుడిప్పుడే మేం డిసైడు చేసుకున్నాం. కాసేపటిలో మేం ఎస్.పీ ఆఫీసుముందు నిరసన ప్రదర్శన చేస్తాం. ఏ ఎస్ పీగాడు, ఐజీ గాడూ, డ్యూటీ ఆఫీసరూ మొత్తం నా కొడుకు లందరూ గజ గజ..."

నాగమణి బిక్కచచ్చిపోయి నిల్చుండిపోయింది.

ఆడపిల్లలిద్దరూ రెండు ప్రశ్నల్లా గోడకు అంటుకుపోయివున్నారు.

ఇంటిలో ఎప్పుడూ వినిపించే దరిద్రపు చప్పుళ్ళకు బదులు ఆమెకు ఆ రోజున ఎందుకనో తుపాకీమోతలు వినిపించాయి.

అయిదుగురు పిల్లల తండ్రి

అర్ధాకలి పిల్లల తండ్రి

నేనీ వుజ్జోగం చెయ్యలేకపోతున్నానే నాగులూ అని వాపోయే లక్ష్మణరావు.

"మాటమాట్లాడితే సస్పెన్షనా? ఎర్ర బూటు వేసుకున్న ప్రతీ గాడిదకాళ్ళకు మేం దండాలెట్టాలా? ఇంక మేం పీక పోయినా వూరుకోం. ఆ రోజులు ఇంక అయిపోయాయి. మేం ఇవ్వాళ డిమాన్‌స్ట్రేషన్ కూడా చేస్తున్నాం నాకే ఇంత కోపం వచ్చిందంటే మిగిల్నోళ్ళ సంగతి చూడు"

"మీరు స్ట్రయికులు అవీ చేసి, డిమాండులు అవీ చెయ్యకూడదు గదండీ"

"అవునుంది...అదొక రూలు, రూల




క్రర.. దాంతోనే మేవివ్వాళ ఎస్.పీ నెత్తి బద్దలు కొట్టేస్తాం. డిమాండు చెయ్యకూడదుట. అడుక్కోవచ్చుట. ఓరె! అడుక్కోకా, అడుక్కోకా ఐజీగాడ్నీ, గవర్నమెంటోడ్నీ అడుక్కోవాలా? అడుక్కుంటే రోడ్డుమీద అడుక్కుంటాం. కనీసం గిట్టేదన్నా ఎక్కువుంటాది. కానీ ఛీ... ఛీ... మాకేం ఖర్మ మేం పోరాడుతాం కానీ కాళ్ళకు దండాలెడతామా ? తప్పు తప్పు. అది జరగనిపని" లక్ష్మణరావుఛాతీ విరుచుకునీ గర్జించాడు.

"అందరూ మీలాగే మాట్లాడుతున్నారా ?"

"కలవనోడు లంజకొడుకు. ఇప్పటికి సగం మందయినా కలిసారు. ఈ సంగతీ పాటికి ఎస్.పీ.కి తెలిసుంటాది. పేంట్‌లో ఆడు ఈపాటికి వుచ్చపోసీసుకుని వుంటాడు..."

"అందరితో పాటే మీరూ వుండండి. ఎందుకయినా మంచిది. అందరి వెనకా మీరుండండి. మీ కసలే కోపం ఎక్కువ జాగ్రత్తగుండండి. ఏవిటో నాకు భయం వేస్తోంది. అధికారులతో మనం తగువుకి దిగటం సరైందేనా అనీ నా అనుమానం" అన్నది నాగలక్ష్మి నెమ్మదిగా.

"లేకపోతే లంజికొడుకులు ఏకంగా ఒక్కరోజు ఇరవైమందిని సస్పెండు చేస్తారా. అంత సులువుగుందా ఆ పని? అంత సవకయిపోయేరా మా పీ.సీలు ? ఏం? డియస్పీ కామేశ్వర్రావు కూడా ఆ రాత్రి కాపు వీధిలోకి వచ్చి, అసలు కనిపించినవాడినల్లా తన్నమని చెప్పింది ఆడేగదా. అడ్ని ఎంచేత సస్పెండు చెయ్యలేదూ? ఆడికో రూలూ, మాకో రూలూనా?? అహా..మేం ఒప్పుకోం" లక్ష్మణరావు తల ఇటూ అటూ వూపాడు.

"కూచోండి. టీ కలిపి తెస్తాను" నాగమణీ వంటగదికేసి కదిలింది.

"వద్దొద్దు. నేనిప్పుడు చాలా అర్జెంట్ పనిమీదున్నాను" అని లక్ష్మణరావు తన చిన్న కూతురి వంక తిరిగాడు "ఒరే చిన్నా! నీ నల్ల వోణీ అర్జెంట్‌గా కావాలి. జెండాలు కుట్టించి పట్టికెళ్ళాలి."

"జండాలు కావలిస్తే తాను కొని కుట్టించుకోండి. పిల్ల వోణీ ఇమ్మనటం ఏమిటి?" అన్నది నాగమణి.

"జండాలకే కాదు, వోణీలకు కూడా గుడ్డ కొనుక్కోవచ్చును. నేను నల్లగుడ్డ తెస్తానని చెప్పివచ్చేను. పట్టికెళ్ళి తీరాలి. లే.. చిన్నా తొందరగా తీసుకురా. ఇది తీసుకుని గబగబా నాలుగయిదు జెండాలు కుట్టించి పట్టికెళ్ళాలి. ఆలస్యం అయితే బాగోదు" అన్నాడు లక్ష్మణరావు అసహనంగా.

"ఇదెక్కడి చోద్యమండీ. మీరు సమ్మె చెయ్యకపోతే, నల్లజెండాలు పట్టుకోకపోతే మానేండి. మధ్య నా కూతురి వోణీ పట్టికెళ్ళి పాడుచెయ్యటం ఏమిటి? నేనొప్పుకోను – కొనుక్కోండి. లేకపోతే మానేయండి. దానికి పెట్టెడు బట్టలు లేవు. వున్నవి నాలుగు గోచి పాతలు. అందులో ఒకటి తీసుకుపోయి తగలేయ దానికి నేనొప్పుకోను."

"నీకే చెప్పుతున్నాను. ఏయ్ చిన్నా చెవుడా? నీక్కాదూ చెపుతుంటే?"

"నువ్వెళ్ళకే చిన్నా. ఇదేవిటో నేను చూస్తాను. పూట పూటకీ బియ్యానికి దేవుళ్ళాడుకుంటున్న ఇంటినించే పట్టికెళ్ళాలా నల్లవోణీలూ? వెళ్ళండి. పది బట్టలున్న వాళ్ళ ఇంటిలోంచి తీసు

కోమని చెప్పండి."

"మరోటి కొనిస్తానులెద్దూ."

"ఆ తెస్తారు. ఇవ్వాల్టి పనితో వుద్యోగమే వుంటుందో, వూడుతుందో తెలియదు.దానికితోడు వున్న వోణీ తీసుకెళ్ళి నాశనం చేస్తే మరి చెప్పనే అక్కర్లేదు. అది ఇవ్వదు. మీరు వెళ్ళండి.."

లక్ష్మణరావు సహనం కోల్పోయాడు. చిన్న కూతురివంక తిరిగి అరిచాడు "లంజకూతురా. చెప్పుతుంటే వినబడ్డం లేదా? వెళ్ళి తీసుకురా."

హడిలిపోయిన ఆ పిల్ల లోపలికి వెళ్ళి నిమిషాల మీద ఇస్త్రీ చేయించి పెట్టిన నల్ల సిల్కువోణీ తీసుకొచ్చింది. కానీ నాగమణి దానిని లాక్కుంది.

"మీకే చెప్పుతున్నాను. ఆ కోపం ఆఫీసు వాళ్ళ మీద ప్రదర్శించి నాలుగు జీతం డబ్బులు పెంచమనండి. ఇంటి దగ్గిర కాదు. కొంప గుల్లచేసే బుద్ధు లెక్కడ్నించి వచ్చాయి మీకు?"

"మర్యాదగా ఇచ్చేయి"

"ఇవ్వను."

ఛెల్‌మని కొట్టాడు భార్య చెంప మీద లక్ష్మణరావు.మీదపడి ఆ వోణీ లాక్కుని "దుమ్ములు విరిచేస్తాను లంజముండా. మొగుడంటే లెఖ్ఖలేకుండా పోతున్నాది. చెమడాలు తీసేస్తాను ఏమిటనుకున్నావో ఏమిటోగాని.." అని అరుస్తూనే ఆ ఇంటి లోంచి బైటకు నడిచాడు.

ఆడపిల్లలిద్దరి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

* * *

ఆఫీసు గది గుమ్మం మీద చెయ్యి వేసుకొని నిలబడి, బైట ప్రదర్శన చేస్తున్న పోలీసులను చూస్తున్నాడు పార్థసారథి.

రెండొందలమందయినా వుంటారు.

చేతిలో నల్లజెండాలున్నాయి.

భయం లేకుండా పోయింది.

ఇవాళ నల్ల జెండాలయ్యేయి.

రేపు ఎర్ర జండాలు పట్టుకోరనే గ్యారంటీ వుందా?

లేదు లేదు.

ఇదంతా నా ఖర్మ.

నా గ్రహచారం ఇలా ఏడిచింది. లేకపోతే పోలీసులేమిటి? ఈ నిరసన ప్రదర్శనలేమిటి? ఎస్.పి. పార్థసారథికి గుండె జారిపోయింది.

గుమ్మానికి ఆన్చిన కుడి చెయ్యి చెమట వల్ల జారిపోతోంది.

"సస్పెన్షన్ ఉత్తర్వులు రద్దుకావాలి".

ఆ కేక ప్రకాశరావుదే!

ఒరే ప్రకాశరావ్! నీ పని పట్టకపోతే నేను పార్థసారథినే కాదు.

ఐ. జీ. గారికి చెప్పి నిన్ను అరెస్టు చేయిస్తాను. గ్యారంటీగా.

ఏదేవయినా ఇదంతా నా ఖర్మ.

నా రాత బాగా లేదు.

తలరాత బాగాలేదు.

లేకపోతే నేనొచ్చిన రెండు నెలలకే ఇన్ని గొడవలు రావాలా?

రాక రాక ఇక్కడే రావాలా?

పార్థసారథి సంకట స్థితిలో పడిపోయాడు.

పైన ఖద్దరోళ్ళు
కింద ఖాకీవోళ్ళు

నా ఖర్మ
నా ఖర్మ

అతని వెనుక నుంచునివున్న ఏ.ఎస్.పి.నిశ్శబ్దంగా వున్నాడు.

వరండాలో నిల్చునివున్న డి.ఎస్.పి కామేశ్వరరావు మాత్రం కుతకుత ఖాకీ




వంటకంలాగ వుడికిపోతున్నాడు.

ప్రదర్శనలలో చేరకుండా మిగిలిన కొద్దిమంది పి.సి.లు వరండాలో స్తంభాలపక్క స్తంభాల్లాగ నిల్చున్నారు.

"దుర్మార్గమైన ఆర్డర్లీ పద్ధతి రద్దు చేయాలి" ప్రదర్శకుల నినాదం సూదుల వానలాగ వచ్చిపడింది.

చేస్తాం చేస్తాం

గొణుక్కున్నాడు పార్థసారథి

అతను అనాలోచితంగానేకదిలి కోపంగా వరండా మెట్లు దిగి, గేటు అవతల రోడ్డు పక్కన గుమిగూడిన ప్రదర్శకుల దగ్గిరకు చరచరా నడిచాడు.

"ఇదిగో.. ఇది చట్ట విరుద్ధం. ఈ రకమైన ప్రదర్శనచేసే హక్కు మీకు లేదు. దయచేసి చెదిరిపోండి" అన్నాడు.

సాయంత్రం ముంచుకొస్తోంది.

"చెప్తే వినిపించుకోరేవిటి? ఆందోళన చేసే హక్కు మనకు లేదు. ఎవరి మట్టుకువారు వెళ్ళిపోండి. ఇదిగో నా ఓర్పు నశించిపోతోంది. ముందే చెపుతున్నాను... అయిదు నిమిషాలు టైమిస్తున్నాను. మర్యాదగా చెదిరిపోయి డ్యూటీలో చేరవలసినవాళ్ళు చేరిపోండి. చేరిపోతే ఏమీ అనను. లేకపోతే తరవాత జరిగేవాటికి నా జవాబుదారీ ఏమీ వుండదు. ముందే చెపుతున్నాను"

గుంపు ముందు నిల్చుని వున్న ప్రకాశరావుని వుద్దేశించి చెప్పేడు పార్థసారథి.

ప్రకాశరావు పార్థసారథి కళ్ళల్లో కళ్ళు కలిపి చూడలేదు. పైగా–

"సస్పెన్షన్ ఉత్తర్వులు రద్దుకావాలి" అని వో కేక వేశాడు.

ప్రదర్శకులు గొంతు కలిపారు.

రోడ్డుకు రెండు వైపులా కుతూహలం వున్న జనం చేరి వింత చూస్తున్నారు. అయితే ట్రాఫిక్‌కి అడ్డం లేకుండానే వుంది పరిస్థితి.

ఒక్కక్షణం అలాగ నిల్చుని చూశాడు పార్థసారథి. తరువాత 'మీ అంతు చూస్తాను. మీపొగరణుస్తాను' అని గొణుక్కుంటూ తిరిగి ఆఫీసులోకి వచ్చేడు.

పరిస్థితి తెలియజేస్తూ ఐజీకి వర్తమానం రాసి వైర్‌లెస్ ఆపరేటర్‌కు ఇచ్చాడు.

తరువాత ఆర్మ్‌డ్ రిజర్వ్ పోలీసు కార్యాలయానికి ఫోనుచేసి డ్యూటీ ఆఫీసర్‌ని పట్టుకున్నాడు.

"కనీసం రెండు ప్లాటూన్‌ల ఫోర్సు వెంటనే ఇక్కడికి పంపు. నా ఆఫీసు ఎదురుగా చట్టవిరుద్ధమైన డిమానిస్ట్రేషన్ ఒకటి జరుగుతోంది. వాళ్ళనిక్కడినుంచి తొలగించాలి. క్విక్. అయిదు నిమిషాల్లో ఫోర్సు ఇక్కడుండాలి" అని చెప్పి ఫోను పెట్టేసి అయిదు నిమిషాల్లో ఏభైసార్లు గడియారంకేసీ, గేటుకేసీ చూశాడు.

ఫోను మోగింది.

"యస్."

సాయుధ రిజర్వ్ పోలీసు కార్యాలయం డ్యూటీ ఆఫీసర్ చెప్పిన విషయం విని పార్థసారథి కోపంతో వణికిపోయాడు.

కుట్ర.

కుట్ర ప్రకారం జరుగుతోంది ఇదంతా.

నా ఖర్మ.

నా ఖర్మ.

వెనకాల చేతులు కట్టుకుని ఏఎస్పీ అతని పక్కకి వచ్చి నిల్చున్నాడు.

అతణ్ని చూసి పార్థసారథికి ఒళ్ళు మండుకొచ్చింది.

"ఐసే...నడ్డెనకాతల చేతులు పెట్టుకుని ఏడుపు మొహం వేసుకుని నా వెనకాల తిర గకపోతే పోయి ఆ లంజకొడుకులతో మాట్లాడకూడదూ?" అన్నాడు మొహం గంటు పెట్టుకుని.

ఏ. ఎస్. పీ మొహం అవమానంతో ఎర్రబడింది.

చరచరా బైటకి వెళ్ళాడు.

లోపలినుంచి యస్సయి మూర్తి ఆదరబాదరగా వచ్చేడు.

"సార్! కాశీపతిని చంపిన వ్యక్తి దొరికిపోయాట్ట సార్. హెడ్ క్వార్టర్స్ నుంచి వైర్‌లెస్ మెసేజ్ వచ్చింది. సాయంత్రం చేసి హైదరాబాద్ మెజి స్ట్రేటు కోర్టుకు వచ్చి భాస్కర్ అనే యువకుడు తానే కాశీపతిని కత్తితో పొడిచి చంపేనని చెప్పి వలంటీర్‌గా లొంగి పోయాట్ట సార్. సరండర్ అయిపోయాట్ట. అక్కడే కస్టడీలోకి తీసుకున్నారట. కేసిక్కడికి ట్రాన్స్‌ఫర్ చేస్తారట. ఖైదీని రేపు పంపిస్తారట. భాస్కర్ అంటే ఆ రోజు తమకు చెప్పేనుకదా సార్! కోమలీ లాడ్జింగ్ హౌస్ ఇన్సిడెంట్ అతనే సార్. రాజాస్ కాలేజీలో లెక్చరరు" అన్నాడు మూర్తి.

పార్థసారథి నిట్టూర్చాడు "హంతకు లైనా లొంగిపోతారు గానీ బైటవున్న నీ శిష్యులు లొంగరట. చూడు ఎలాగ అరు స్తున్నారో గాడిదల్లాగ. దొంగ లంజ కొడుకులు. డిపార్ట్‌మెంట్ ఉప్పు తిని డిపార్ట్‌మెంట్ మీదే వుమ్మేస్తున్నారు."

పార్థసారథి వైఖరికి మూర్తి ఉత్సాహ మంతా నీరు కారిపోయింది.

"ఏఎస్పీ గంటయింది వెళ్ళి వాళ్ళతో మాట్లాడి వస్తానని. ఇంకా రాలేదుచూడు. వెళ్ళి వాళ్ళతోపాటుస్లోగన్స్‌గానీ ఇస్తున్నా డేమో పోయి చూడు" అని పార్థసారథి మూర్తిని కూడా పంపేడు.

కాశీపతి హత్యకేసు తేలిపోయినందుకు అతనికేమీ సంతోషంగా లేదు.

మరో రెండు నిమిషాల్లో ఏ ఎస్ పీ లోపలికి వచ్చాడు.

"సార్! రాత్రి పన్నెండు గంటల్లోపల సస్పెన్షన్ ఆర్డర్లు విత్‌డ్రా చెయ్యకపోతే రేపు సమ్మె చేస్తారటసార్. సివిల్ పోలీస్ రిజర్వ్ పోలీస్‌లు కూడా. అదీ వాళ్ళు మీకు చెప్పమని నాకు చెప్పింది" అని చెప్పి ఏ ఎస్ పీ చేతులు కడిగేసు కున్నాడు.

లోపలినుంచి వో కానిస్టేబుల్ హెడ్ క్వార్టర్స్ నుంచి వచ్చిన మరో మెసేజ్ పట్టుకుని వచ్చాడు. అది చదివాడు పార్థ సారథి.

"ఇదంతా నా ఖర్మ. ఈ లంజా కొడుకులు సమ్మె చే స్తా వం టా రు. ఆ లంజకొడుకులు పీకపోయినా డిపార్ట్ మెంట్ చర్యలేమీ రద్దుచేసుకోవద్దంటారు. మధ్య నేను చస్తున్నాను. నా ఖర్మ...నా ఖర్మ" పార్థసారథి నెత్తి కొట్టుకున్నాడు.

ఏఎస్పీ మహా సంతోషంగా చిన్న చిరునవ్వు నవ్వేడు.




ఉదయం ఆరు గంటలకు—

లక్ష్మణరావుకు ముందుగా సింధూరం బొట్టు పెట్టాడు ప్రకాశరావు. తరువాత సుందరయ్య, నారాయణ, జోసెఫ్, నరసింహం, అప్పలకొండ, బైరాగి, జోగారావు, ఆనందం బొట్టు పెట్టించుకొని నిరాహారదీక్షా ప్రవేశం చేశారు.

అక్కడ వున్న అరవై దెబ్బయిమంది పోలీసులు చప్పట్లు చరిచారు.

పోలీసులే గాక దారిన పోతున్న ప్రజలు కొందరు కూడా అక్కడ చేరేరు.

ఎస్.పీ. ఆఫీసు గేటు దగ్గిర నుంచి ఎర్రబూట్లు, ఖాకీ టోపీల అధికారులూ, నల్లబూట్లు, చారల టోపీల పీసీలు కొందరూ నిరహారదీక్షా శిబిరాన్ని ఆశ్చర్యంగా చూస్తున్నారు.

పోలీసుల సమ్మె జయప్రదం కావాలి అనే నినాదం ఎర్ర అక్షరాలతో గుడ్డ బ్యానరుపై మెరుస్తోంది.

ప్రకాశరావు సిగరెట్ వెలిగించుకొని శిబిరానికి ఒక పక్క నిల్చున్నాడు. రాత్రంతా నిద్రలేకపోవటం వల్లా, భోజనం చెయ్యకపోవటం వల్లా అతను వాడిపోయి వున్నాడు.

ఇంతలో కలెక్టర్‌గారి కారు పోలీసుల శిబిరం మీద ఇంత దుమ్ము రేపుకుంటూ వచ్చి ఎస్. పీ. ఆఫీసులోకి మళ్ళింది.

ఆ తరువాత మరో కారొచ్చింది. అది శిబిరం ముందు చాలా నెమ్మదిగా అంత దూరం నడిచి తరువాత నల్లటి పొగ చిమ్ముతూ ఎస్.పీ ఆఫీసులోకి తిరిగింది.

"అందులో ఐజీ వున్నాడు..."

"ఐజీ వచ్చాడు."

శిబిరంలోని పోలీసుల్లో ఓ రకమయిన ఉత్సాహం వ్యక్తమయింది.

ప్రకాశరావు కూచున్న గాడ్రెజ్ కుర్చీ లోంచి లేచి నిల్చున్నాడు. "మనం ఇదే బింకంతో మరో రోజు వుంటే, మఫిసిల్ ఏరియాస్‌లో కూడా తగినంత ఆందోళన అంటుకుంటే రేపు ఏకంగా హోమ్‌మంత్రి, ముఖ్యమంత్రి ఇక్కడికి దిగుతారు. తక్కిన జిల్లాలకు కూడా ఇది మనం అనుకుంటున్నట్టుగా వ్యాపిస్తే అప్పుడు ఏకంగా వాళ్ళు మన కాళ్ళ దగ్గిరకే వస్తారు..."

పోలీసులంతా ఉత్సాహంగా చప్పట్లు చరిచారు. "రండి. ఎస్ పీ ఆఫీసు గేటు కెదురుగా నిల్చుని నినాదాలు చేద్దాం"

అక్కడున్న పోలీసులంతా వెళ్ళే సరికి రోడ్డంతా నిండిపోయింది.

అరగంటసేపు వారు నినాదాలు చేశారు.

ఆతర్వాత ఆఫీసులోంచి ఐజీ కాలి నడకన బయలుదేరేడు.

"వస్తున్నాడొస్తున్నాడు..."

"రారా నాకొడకా..."

సమ్మెకట్టిన జవానులు రకరకాలుగా అరిచారు.

పోలీసు ఇన్స్‌పెక్టర్ జనరల్ నారి పొడవునా దర్పం ఒలికిస్తూ మహాఠీవిగా వచ్చి ఆందోళనకారుల ఎదట నిలుచున్నాడు.

ఎటెన్షన్‌లో నిల్చుని "ఫాల్ ఇన్ లైన్. ఫాల్ ఇన్ లైన్" అనిఅరిచాడు.

నినాదాల హోరులో అది అందరికీ వినిపించలేదు. విన్నవాళ్ళు పట్టించుకోలేదు.

"ఏట్రా ఐజీ అరుస్తున్నాడు"

"ఏటాడు అంటున్నాడు"

అందరికీ ఐజీ మాటలు కావలసివచ్చినందువల్ల నిశ్శబ్దం నెలకొన్నది.

"ఫాల్ ఇన్ లైన్, ఫాల్ ఇన్ లైన్"

ఆజ్ఞాపించాడు ఇన్స్పెక్టర్ జనరల్
పోలీసులు అతడిని ఖాతరు చెయ్య లేదు.
కోపం వచ్చిన ఐ జీ "నో. మీరు ఇలా చెయ్యకూడదు. ఇది చట్టబద్ధం కాదు. దీనివల్ల మీకే నష్టం. వుపయోగం ఏమీ వుండక పోవడమే గాక పైపెచ్చు నష్టం. యూనిఫాంలో వుండి మీరిలా ఎలా ప్రవర్తించ గలుగుతున్నారో నాకు అర్థం కావటం లేదు. నామాట వినండి. ఫాల్ ఇన్ లైన్. ఫాల్ ఇన్ లైన్" అని అరుస్తూ పోలీసుల మధ్యకి చొరబడ్డాడు.
"నా మాట వినండి. మీరు అనవసరంగా చెడిపోతారు. చేజేతులా వుద్యోగాలు పాడు చేసుకోవద్దు" ఐజీ నచ్చచెప్పే ధోరణిలో మాట్లాడ్డం ప్రారంభించాడు.
ఐజీ వెనకాల నిల్చున్న ఓ రిజర్వు కానిస్టేబుల్ "పోరా నాకొడకా" అని తిడుతూ ఐజీ వీపుమీద చెయ్యి వేసి నెట్టాడు.
ఐజీ అంతటివాడు వెళ్ళి ఒక పోలీసు జవానుమీద పడ్డాడు.
"ఏమిటి సార్... మీదపడుతున్నారు? కొడతారా. కొట్టండి చూద్దాం" అంటూ ఆ పీసీ ఐజీ భుజంమీద చెయ్యివేసి పక్కకి నెట్టేడు.
ఐజీకి మతిపోయింది.
పిచ్చి కోపంతోనూ,అసహాయంగానూ చూశాడతను "ఇదిగో. మీరు ఇంతకింతా అనుభవిస్తారు... ఒళ్ళు మరిచిపోయి ప్రవర్తిస్తున్నారు. మీ డిసిప్లినంతా



ఏమయిపోయిందర్రా!" అని అరచిన అతని మెడమీద చెయ్యి వేసి ఎవరో నెట్టారు.

ఐజీ పోలీసుజవానులమధ్య ఇరుక్కుని పోవటం, పోలీసుల్లో తోపులాట లాంటిది ప్రారంభంకావటం దూరంనుంచి చూసిన ఎస్.పీ, డి.ఎస్.పీ రివాల్వర్స్ పట్టుకొని పరిగెట్టుకు వచ్చారు.

అది గమనించిన ఐజీ కంగారుగా పోలీసుల్ని నెట్టుకుని బైటపడి "నో...కమాన్. మీరు ఎందుకు వస్తున్నట్టు? నేనిక్కడున్నాను. ఐ కెన్ హేండిల్ దిస్. వెళ్ళిపోండి" అని ఎస్.పీని, డి.ఎస్.పీని పంపించివేశాడు.

తరువాత ఐజీ సమ్మెలోఉన్న వాళ్ళ వంక తిరిగాడు. "నా మాట విని సమ్మె మానేయండి. మనం మనం మాట్లాడుకుందాం. నేను అధికారినే అయినప్పటికీ మీలాగే జీతం తీసుకుంటున్న పోలీసు నౌకర్నే కదా. మనమధ్య ఈ ఘర్షణ అనవసరం. ప్రకాశరావంటే ఎవరూ? అయ్ వాంట్ టు సీ హిం..."

ప్రకాశరావు పీ సీల గుంపులోంచి బైటకు రాలేదు.

ఐజీకి బాగా కోపంవచ్చింది. "సరే నా హోదామరచి మిమ్మల్ని కన్నబిడ్డల్లాగ బతిమిలాడినా మీరు వినలేదు. సరే... అందరూ వినండి. రేపు వుదయం ఏడు గంటలకల్లా డ్యూటీల్లో చేరనివాళ్ళు చాలా తీవ్రమైన చర్యలకు గురికావలసి వుంటుంది. ఇది తుది హెచ్చరిక..."

అని అతను కఠినంగా చెప్పి వెను తిరిగాడు.

"ఐజీ డౌన్ డౌన్..."

సమ్మెలోఉన్న ఉద్యోగులు అతనికి చెప్పిన జవాబు అది.

*  *  *

శిబిరంలో గ్యాస్‌లైట్ విసుగు లేకుండా వెలుగుతోంది.

నిరాహార దీక్షలో వున్నవారిలో కొందరు నిద్రతో జోగుతున్నారు.లక్ష్మణరావు, సుందరయ్య ముసలి చిదంబరం మాత్రం నిద్ర పొలిమేరలకయినా పోకుండా దీక్షగా కూచుని వున్నారు. శిబిరంలోని చాపల మీద వో పదిమంది కానిస్టేబుల్స్ కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

అప్పుడొకటీ అక్కడొక్కటీ ఏవేవో వాహనాలు శిబిరం ముందున్న రోడ్డు మీద పరిగెడుతున్నాయి. శిబిరానికి ఎదురుగా రోడ్డుకు అవతల పక్క వున్న ఎస్.పి. ఆఫీసు ఆవరణా, వరండా చీకటిగా వున్నాయి. లోపల గదుల్లో మాత్రం దీపాలు వెలుగుతున్నాయి.

"మామూలు రోజుల్లో అయితే మా ట్రాఫిక్కోళ్ళు దండుకు తెచ్చిన డబ్బుల్తో మందు కొట్టేసి ఐ.జీ. దొరగారు ఏ హైక్లాసు లంజతోనో పొర్లుతూ వుండును. కానీ దొరగారీవేళ తాగితే సొంత డబ్బుల్తో తాగాల. ముండకెళ్తే సొంత డబ్బుల్తో ఎళ్ళాల. ఎస్.పి జేబులోంచి దేవుడి కోసమైనా పైసా కదపడు.." అన్నాడో ట్రాఫిక్ కానిస్టేబుల్.

"ఊరుకోవయ్యా.. ఐజీ కయితే మాసక్కో ఖర్చు పెడతాడు. కామేశ్వరరావు లేడూ ఏ.ఎస్.పి. పులిసినోడు,అధికారులందరూ" పులిసివున్నోళ్ళే...ఖర్చు పెడతారు.

దబడబమని ఎవరో పరుగెట్టుకు వస్తున్న చప్పుడు వినిపిస్తోంది. అందరి కళ్ళు ఆ శబ్దం వస్తున్న వైపు తిరిగాయి.




ఎస్.పీ ఆఫీసులోంచి ఎవరో పరిగెత్తుకు వస్తున్నారు. ఆవరణలోని చీకటి అతన్ని గుర్తుపట్టనివ్వటంలేదు.

శిబిరంలో కూచున్నవాళ్ళు కొందరు లేచి నిల్చున్నారు.

ఎస్. పి ఆఫీసులో పరుగు ప్రారంభించిన ఆ వ్యక్తి అదే వేగంతో గేట్లోంచి దూసుకొచ్చి, రోడ్డు దాటి సరాసరి శిబిరంలోకి వచ్చిపడ్డాడు వగర్చుతూ.

గ్యాస్ లైట్ వెలుతురులో అందరూ అతనిని గుర్తుపట్టారు. రిజర్వ్ పీ.సీ సంజీవరావు. వగురుస్తూనే అతను శిబిరంలోని జనాన్ని చూసి నవ్వేడు.

"ఏట్రా సంజీవి ఏటిలాగ పరిగెత్తుకొచ్చావు"

"నా వల్లగాదు. మీరందరూ ఇక్కడ మాకోసం పస్తులుంటూంటే, మీరందరు మనందరి బాగుకోసం ఐజీని కూడా కాదని రిస్కు తీసుకుంటే నేనా కక్కుర్తి పని చెయ్యలేను.. ఉద్యోగం వూడిపోతాదనే భయంతో డ్యూటీకి వెళ్ళేనుకాని నాకు చేతగాదు. పోతే మీతోపాటే పోతాను. బాధల్లో అందరూ వొకటే" అన్నాడు సంజీవరావు.

క్రయిం కానిస్టేబుల్ ఒకతను సంజీవరావు భుజం మీద ప్రేమగా చెయ్యివేసి "నువ్వయ్యా మనిషివంటే. తప్పుచేసి, అది తెలుసుకొని తప్పు చెయ్యటం మానేసినోడే నిజమైన మనిషి" అని మెచ్చుకున్నాడు.

ముసలి చిదంబరం కూచున్న చోటునుంచి జరిగి సంజీవరావు చేతులు పట్టుకొని "తమ్ముడూ ! నాకు నచ్చిన పని చేశావు.మిగిలిన మన వాళ్ళందరికి కూడా భయంలోంచి మెలకువ రావాలి.." అన్నాడు.

సంజీవరావు చిరునవ్వు నవ్వాడు. తరువాత పక్కనున్న పోలీసు ద్వారా చిదంబరం సంఘటన తెలుసుకున్నాడు. ఏదో జ్ఞాపకం వచ్చి అతను హడావిడిగా లేచి నిల్చుని "ప్రకాశరావు గారేరీ?" అనడిగాడు.

"అరగంటయింది. ఇంటికి వెళ్ళారు. ఓ కునుకు తీసి తెల్లవారి లేచి వస్తానన్నారు ఏం? అర్జంట్ పని ఏదయినా వుందా?"

"నేను కొంత సమాచారం సంపాదించి పట్టుకొచ్చాను. మన చుట్టుపక్కల అయిదారు జిల్లాలకు కూడా ఈ సమ్మె పాకిపోయింది. రెండ్రోజుల్లో రాష్ట్రమంతా పాకిపోతుందని ఐ.జీ భయపడుతున్నాడు. మరిచిపోయాను. బలేవార్త. ఆర్మీ పోలీసుని ఇక్కడికి రమ్మని పిలిస్తే వాళ్ళు రాము పొమ్మన్నారట. పోలీసు మీదకి తప్ప ఇంకెవరి మీదకయినా వెళ్తాం అన్నారట వాళ్ళు. అలాగుండాలి పోలీసు బ్రదర్ హుడ్ అంటే. సీ. ఆర్.పి నా కొడుకులు మాత్రం వస్తున్నారు. ఆ లంజికొడుకుల పనే అదిగద. ఎన్ని బెటాలియన్‌లో నాకు తెలియదుగాని రేపు ఉదయానికి వాళ్ళు దిగుతారు. అవసరవనుకుంటే బి. ఎస్. ఎఫ్ లంజకొడుకుల్ని కూడా రప్పిస్తారట. ఇందాకే ఎలర్ట్‌చేశాడు ఐ.జి.మరిచే మరిచిపోయాను. స్టేషన్‌లోని మస్కెట్స్‌ను మొత్తం కంట్రోల్ రూంకి నడిపించేస్తున్నారు ఎందుకోగాని.ఈ లెక్కన రిజర్వు పోలీసు క్యాంప్‌లోని రైఫిల్స్ కూడా తీసి వచ్చును" అని చెప్పేడు సంజీవరావు.

లక్షణరావు లేచి నిల్చున్నాడు.

"తెలీటం లేదా? మనం కడుపులు

మాడ్చుకొని ఇక్కడ కూచుంటే ఎవరూ భయపడటం లేదు. ఆ తుపాకులు మన మెక్కడ చేజిక్కించుకుంటామోనని వాళ్ళు భయపడుతున్నారు. అంచేత లేచి భోజనాలు చెయ్యండి. మన దగ్గిర ఏటివుంటే అధికారులు భయపడతారో తెలిసింది కదా! తుపాకులుంటేనే వాళ్ళు జడుస్తారు. అంచేత నేను మా క్యాంపుకి వెల్తున్నాను. మా బెల్‌ఫామ్ నుంచి గాని, ఆర్మరీ నుంచి గానీ, మేగజెన్‌నుంచి కానీ ఇంతవరకు వాళ్ళు ఏం తీసుకొని వెళ్ళకపోతే మన అదృష్టం. రైఫిల్సన్నీ మనం తీసుకుందాం. అప్పుడుగాని ఆ లంజకొడుకులు దిగిరారు" అన్నాడతను.

"అదికాదు లక్ష్మణరావ్! ప్రకాశరావు గారితో చెప్పకుండా మనం ఈ పని చెయ్యటం బాగుంటుందా? నిరాహారదీక్ష మధ్యలోంచి లేచి వెళ్ళిపోవటం మంచిదేనా నలుగురూ ఏమనుకుంటారు?" అన్నాడు సుందరయ్య.

"అల్లుడొచ్చేదాకా అమావాస ఆగదు. ప్రకాశరావుగారికి ఎవడన్నా వెళ్ళి నేను ఇలాగ చేసేనని చెప్పండి. అవతల వాళ్ళుగానీ వచ్చి రైఫిల్స్ తీసేసుకుంటే ఆ తరవాత మనం మొత్తుకుంటే మాత్రం ఏం లాభం వుంటాది. నేనెల్తున్నాను. సంజీవీ నువ్వొస్తే రా. నిరహారదీక్షేటి? బుద్ధిలేకగానీ... పోలీసోడు తుపాకి పట్టుకోవాలిగానీ కాళ్ళు పట్టుకోకూడదు"

సంజీవరావు లేచాడు "పద"

లక్ష్మణరావు, సంజీవరావు చకచకా నడుస్తూ పావుగంటలో సాయుధ రిజర్వు పోలీసు క్షేత్రంలోకి వెళ్ళారు.

అంతటా నిశ్శబ్దంగా వుంది.

బెల్‌ఫారం మొదలుకొని ఆ వరుస గదులన్నిటికీ తాళాలు వేసి వున్నాయి. గార్డు డ్యూటీలో కూడా ఎవరూలేరు.

"ఇంక ఈ గొడవ పూర్తిగా తేలిపోయేవరకూ మనదే ఈ డ్యూటీ. మన శవాల మీద నుంచి నడిచే ఎవరన్నా రైఫిల్స్ తియ్యాలి వుండు తాళం కప్ప బద్దలు కొట్టేసి రెండు రైఫిల్స్ తీసి మాటు కడదాం" అన్నాడు లక్ష్మణరావు.

సంజీవరావు తల వూపాడు.

* * *

మరుసటి రోజు ఉదయం ఎనిమిది గంటల వేళ.

ఎస్.పీ కార్యాలయంలో ఇన్స్పెక్టర్ జనరల్, డి.ఐ.జీ, ఎస్.పీ, ఎ.ఎస్.పీ., డి.ఎస్.పీ., హోమ్‌గార్డ్సు కమాండెంట్ కూచుని వున్నారు.

"అయితే ట్రాఫిక్ వరకూ హోం గార్డ్సు ఇబ్బంది లేకుండా చూసుకోగలరు కదా" అన్నాడు ఐ.జీ.

"యస్సర్! ఇతర విషయాల్లో కూడా సాయపడగలం. తగినంత మంది గార్డ్సు వున్నారు మనకి" అన్నాడు హోమ్ గార్డ్సు కమాండెంట్.

"గుడ్ ... మీరిక వెళ్ళండి. టౌన్ స్టేషన్స్‌లో స్కెలిటన్ స్టాఫ్ వుండనే వుంది కదా. వీలయితే ప్రతి స్టేషన్‌కి మీ వాళ్ళని ఒకరిద్దరిని పంపండి"

"యస్సర్" హోమ్ గార్డ్సు కమాండెంట్ వెళ్ళిపోయాడు.

"ఇక రేడియో కమ్యూనికేషన్స్ మాటేమిటి?"

"వాటి నిర్వహణకు తగినంతమంది మిగిలేరు సర్! లూటి సెక్యూరిటీ కోసం ఇందాక వెళ్ళిన సి.ఆర్. పీవాళ్ళని కొందర్ని పురమాయించాను. మొత్తం




అన్ని స్టేషన్‌లకు ఆ రెండు వ్యాన్స్ లోని సి.ఆర్.పీనీ సర్దేను. ఒక సెక్షన్ ప్రస్తుతం ఇక్కడే వున్నారు"

"సరే! కలెక్టరాఫీసు దగ్గిర, టౌన్ లోనూ ఆ వెధవలు డిమానిస్ట్రేషన్స్ చేస్తారట. ముఖ్యమైన ప్రాంతాల్లో 144 విధిస్తానని కలెక్టర్ చెప్పాడు. ఒక మైక్ కాచు పెట్టి ఆ సంగతి ఎనౌన్స్ చేయించు. మరికాసేపు పోయాక ఆ శిబిరం దగ్గర వాళ్ళని అరెస్టుచేసి, ఆ గుడారం పీకించి, సాయంత్రానికి వీలయినంతమందినిఅరెస్టు చేయించాలి. రేపు వుదయానికి మొత్తం చల్లారిపోవాలి. రిజర్వ్‌పోలీస్ కాంపెన్ విషయమై నేను కొంచెం గాభరాపడుతున్నాను. దాని విషయం ఆలోచిస్తున్నాను. ఆ వెధవల దగ్గర రైఫిల్స్ ఉన్నాయి. అదే ఇబ్బంది. హోమ్ మినిస్ట్రి చాలా పట్టుదలతో వుందనుకోండి. దె వాంట్ టు క్రష్ దిస్. అయినా మనం అనవసర మయిన రిస్కులు తీసుకోకూడదు" ఐజీ తల గోక్కున్నాడు.

"మనకు మరికొంచెం ఫోర్స్ కావాలి సార్! తెల్లవారుజామున వచ్చినవాళ్ళు చాలరు. ఆ శిబిరం దగ్గిరున్నవాళ్ళని అరెస్టు చెయ్యాలంటే ట్రబులే.ఒక సెక్షన్ సీఆర్‌పీ ఏమూలకు సరిపోతారు? బి ఎస్ ఎఫ్‌ను రప్పించితే మనకి చాలా తేలిక'' అన్నాడు డిఐజీ.

ఐ జీ మాట్లాడలేదు.

"బి.ఎస్. ఎఫ్. ను తీసుకురావచ్చు కానీ రక్తపాతం జరిగిపోతుంది. ఎటువంటి పరిస్థితిలో కూడా మనం తుపాకీ పేలనివ్వకూడదు. షీర్ మెన్ పవర్‌తో వాళ్ళని లొంగదియ్యాలి. మఫిసియల్ వెధవలు కూడా వీళ్ళతో చేరిపోయి డ్యూటీలు ఎగ్గొట్టం నాకు ఆశ్చర్యంగా వుంది. అయిదారు జిల్లాలకి తగినంత మంది సిఆర్‌పీ వాళ్ళు వెంటనే దొరుకుతారా? కష్టం. సరే నేను వెళ్తాను. కీప్ కాంటాక్టింగ్ మి. నేను మిగతా జిల్లాలకు వెళ్ళాలి. జాగ్రత్తగా వుండండి. రేపీ పాటికి ఈ వ్యవహారం తేలిపోవాలంటున్నాడు హోం మినిస్టర్. అర్థం అయింది గదా?" ఐజీ లేచాడు. మరో అరగంట సేపు ఏకధాటిగా సూచనలూ, ఉత్తర్వులూ, ఉపాయాలూ వర్షించిన తరవాత అతను వైర్‌లెస్ కారెక్కి కూచున్నాడు.

కారు దుమ్ము రేపుకుంటూ రోడ్డు మీదకి వచ్చింది. శిబిరం ముందు కాస్త స్లో అయి మళ్ళీ వెంటనే వేగం పుంజుకొని పరిగెత్తింది.

"ఐ జీ పోతున్నాడు సార్!" అన్నాడు రెండో రోజు నిరాహారదీక్షలో కూచున్న ఓ పీసీ.

ప్రకాశరావు లేచి నిల్చున్నాడు.

"ఆయన వెళ్ళిపోతున్నాడంటే ఇక్కడికంటే ప్రమాదకరమైన పరిస్థితి ఇంకో టౌన్‌లో ఉత్పన్నం అయి వుండాలి. లేదా ఏదో దారుణమైన పని ఇక్కడివాళ్ళకి పురమాయించి, ఆ బురద తనమీదకు తూలకుండా తప్పించుకోవడానికైనా అయివుండాలి."

శిబిరం దగ్గిర నూరు, నూట పాతిక మంది పీసీలు చేరేరు.

ఎస్. పీ. కార్యాలయం గేటు దగ్గిర రైఫిల్స్ పట్టుకొని ఇద్దరు సీఆర్‌పీ జవానులు పహేరా కాస్తున్నారు.

సమావేశాలూ, ఊరేగింపులూ నిషేధిస్తూ, నలుగురు కంటే ఎక్కువమంది ఒకచోట గుమిగూడరాదని హెచ్చరిస్తూ

ఒక పోలీసు కారు వెళ్ళిపోయింది.

"గుడ్! మనల్ని అరెస్టు చెయ్యటం ప్రారంభిస్తారు. అన్ని సెంటర్స్‌లోనూ ఈ అరెస్టులు జరిగేలాగ మనం అరేంజి చెయ్యాలి. పదిమందికొక గుంపుగా వూరేగింపులు తీద్దాం. సగంమంది ఈ రోజు అరెస్టయితే, రేపుదయం వాళ్ళని ఎలాగూ రిలీజ్ చేస్తారు. మిగిలిన సగం రేపు అరెస్టు కావచ్చు"

"మరి ఈ నిరాహారదీక్షలో వున్న వాళ్ళని కూడా అరెస్టు చేస్తే!"

"సాధ్యమయినంత సేపు నిలువరిద్దాం. తెల్లవారుజామున వచ్చినవాళ్ళు మూడు వాన్‌లతో వచ్చారు. రెండు వ్యాన్‌లు టౌన్‌లోకి వెళ్ళాయి. ఇక మిగిలింది ఒక వాన్ సి.ఆర్.పి. వాళ్ళు. మనం రెసిస్ట్ చేస్తే మనల్నేం చెయ్యలేరు. వాళ్ళు తుపాకులు వాడే పరిస్థితి వస్తే మనం చెయ్యగలిగిందేమీలేదు. ముందు తుపాకీ గుండుకు నేనే బలి అవుతాను. వాళ్ళు ఆ రకంగా తొందరపడరనే నా ఉద్దేశం" అని ప్రకాశరావు చెపుతూండగానే-

ఎస్.పీ ఆఫీసులోంచి పది పదకొండు మంది సీ ఆర్ పీ జవానులు గుంపుగా పైకి వస్తుండటం కనిపించింది.

"ఆళ్ళదగ్గిర లాఠీలూ, బేడీలూ వున్నాయి. లాఠీచార్జి చేసేలాగున్నారు. తుపాకులు తేవటం లేదు. ఆళ్ళముందు డి.ఎస్.పీ కామేశ్వరరావు నడుస్తున్నాడు. ఆడిక హీరో. ఐజీ లేకపోతే ఆడి బామ్మరిది హీరో" అన్నాడొక పీ. సీ.

ప్రకాశరావు బైటకు వచ్చాడు.

ఇంతలో ఓ కానిస్టేబుల్ శిబిరం వెనక్కి పరిగెత్తి రెండు చేతులతో నాలుగు రాళ్ళు తెచ్చాడు.



"గురవ్వగారూ!ఆళ్ళుగానీ రోడు దాటి ఇటొస్తే బుర్రలు పగలగొట్టేస్తాను. వెళ్ళండొరే! డేరా వెనక రాళ్ళు పోగుపోసి వుంచేను. తలాకిన్నీ తీసుకొండొరే. నేను సోడా సీసాలు కూడా తెమ్మని పురమాయించేను. మూడు డజన్లు, మనం కన్ను గీటితే వచ్చేస్తాయి" అని ఓ రిజర్వు పోలీసు చేతిలోని రాయి బలంగా విసిరేడు.

ఆ రాయి సి ఆర్ పీ జవాన్లలో ఒకడి కాలికి తగిలింది.

రోడ్డుమీద అడుగు పెట్టిన సి ఆర్ పీ దళం హటాత్తుగా ఆగిపోయింది.

అంతవరకూ ముందు నడిచిన కామేశ్వరరావు ఎందుకయినా మంచిదని సి ఆర్ పీ జవాన్‌ల వెనుక నించున్నాడు.

"తొందరపడవద్దు" ప్రకాశరావు హెచ్చరించాడు.

"హెచ్చరిక, హెచ్చరిక" మెగాఫోన్‌లోంచి కామేశ్వరరావు గొంతు వినిపించింది.

"కలెక్టరుగారి ఉత్తర్వులను ఉల్లంఘించి అక్రమ సంఘముగా గుమిగూడి యున్నవారు తక్షణమే చెదరిపోవలయును. లేనియెడల పోలీసువారు మీపై లాఠీ చార్జి చేయుదురు. చట్టవిరుద్ధముగా పోలీసువారు చేయుచున్న సమ్మె, నిరాహారదీక్ష చట్టవిరుద్ధము. అట్టి చర్యలకు తలపడిన వారు తక్షణమే అట్టి చర్యలు విరమించుకోవలెను. లేనియెడల పోలీసువారు లాఠీ చార్జి చేయుదురు" హెచ్చరికల సంప్రదాయాన్ని మన్నిస్తూ చెప్పేడు కామేశ్వరరావు.

ఈలోగా శిబిరం డేరా వెనుక నుంచి గుప్పెళ్ళతో రాళ్ళు తెచ్చిన ఆందోళనకారులు నాలుగు చేతుల రాళ్లు గబగబా

విసిరేరు.

సి.ఆర్.పీ. జవానులు ఉక్కుటోపీలు ముందుకు లాక్కుని, లాఠీలు సిద్ధంగా పట్టుకొని పరిగెత్తుతూ వచ్చి పీసీల గుంపు మీద పడ్డారు.

'హమ్మ లంజకొడకల్లారా! ఏం దెబ్బ కొట్టేర్రా' అనుకున్నాడు భుజం విరిగి పోయిన ఓ సాయుధ రిజర్వ్ పోలీసు.

కొందరు పీసీలు దూరంగా పరిగెత్తి అక్కడ్నించి రాళ్ళు రువ్వారు. లాఠీలకు చిక్కిపోయిన పోలీసులకూ, రాళ్ళకు దొరికిపోయిన సీఆర్‌పీవారికీ గట్టి దెబ్బలే తగులుతున్నాయి.

సోడా సీసాల ప్రస్తావన చేసిన రిజర్వ్ కానిస్టేబుల్ ఓ కేసు సోడాలు పట్టుకొని వచ్చి, కేసు అంతదూరాన కింద దించి రెండు చేతుల్తోనూ రెండు సోడాలు అందుకున్నాడు.

అది గమనించిన పీసీలు తలోదిక్కుగా పారిపోయారు. రోడ్డు మధ్యన లాఠీల సీ ఆర్ పీ జవానులు మాత్రం మిగిలి పోయారు. శిబిరం అంతదూరంలో వుంది. అందులో నిరాహారదీక్ష చేస్తున్న వారు మాత్రమే మిగిలేరు. ప్రకాశరావు శిబిరం ముందు నిల్చుని వున్నాడు.

రివ్వురివ్వున వచ్చిన రెండు సోడా సీసాలు సీ ఆర్ పీ వారి దగ్గరలో పేలేయి. ఇద్దరు ముగ్గురు సి ఆర్ పీ జవానులకు గాజు ముక్కలు గుచ్చు కున్నాయి.

ఈ లోపల మరో మూడు కేసులు సోడాలు తీసుకువచ్చారు ముగ్గురు జవానులు.

ఇదంతా చూస్తున్న కామేశ్వరరావుకి కంగారెత్తిపోయింది.

ధన్, ధన్, ధన్, ధన్‌మని వరుసగా సీ ఆర్ పీ వారి చుట్టూ సోడా సీసాలు పేలాయి.

"బీట్ రిట్రీట్" అని అరుస్తూ డి ఎస్ పీ వెనుతిరిగి ఎ.ఎస్.పీ. ఆఫీసులోకి పరి గెత్తాడు.

దిక్కుతోచని సీ ఆర్ పీ వాళ్లు తుపా కీలు తేనందుకు చింతిస్తూ యధాశక్తిని కామేశ్వరరావుని అనుసరించారు.

వారి వెనకాల సోడాలు పేలేయి.




"మొత్తం అరవై ముగ్గుర్ని అరెస్టు చేశారు. శిబిరం మీద మొత్తం మూడు సార్లు దాడి చేసేరు. రెండుసార్లు మన వాళ్ళు తిప్పికొట్టారు గానీ మూడోసారి వాళ్ళు గాల్లోకి తుపాకులు పేల్చేరు. ఆ సమయానికి నేను కలెక్టరాఫీసు దగ్గి రున్నాను. ఎప్పుడైతే వాళ్ళు తుపాకులు పేల్చేరో మన వాళ్ళపుడు సాధ్యమయి నంతమంది దొరకకుండా పారిపోయారు. నిరాహారదీక్షలోవున్న పన్నెండుమందినీ, అక్కడే నిలబడిపోయిన పదిమందినీ మొత్తం ఇరవై రెండు మందో ఇరవై ముగ్గురో వుంటారు...వాళ్ళని అరెస్టు చేశారు. కానీయండి. రేపుదయం మళ్ళీ టెంటు వేసి ముగ్గుర్ని కూచోబెడదాం. వాళ్ళను అరెస్టు చేస్తే మరో ముగ్గురు కూచుంటారు. రేపెలాగూ ఇవాళ అరెస్టు చేసిన వాళ్ళని వదిలేస్తారు. శిబిరం దగ్గిర

వాళ్ళని వదలరు లెండి. వాళ్ళు ఘర్షణ పడి దొరికారు కదా! కేసు అవుతుంది. బైట తిరుగుతూ అరెస్టయినవాళ్ళ సంగతి నేను చెప్పుతున్నాను ..." ప్రకాశరావు నిలబడి చెప్పుతున్నాడు.

రిజర్వ్ పోలీసు క్షేత్రంలో ఆయుధ గారం ముందు నిలబడిన అతని చుట్టూ లక్ష్మణరావు, సంజీవరావు మరో ఎన మండుగురు కానిస్టేబుల్స్ చేరి వింటున్నారు.

రాత్రి రెండు గంటల సమయం.

ప్రకాశరావు సిగరెట్ వెలిగించు కున్నాడు. "మనం ఏది ఏమయినా ఈ బెల్‌ఫారంని మాత్రం వదులుకోకూడదు. మన దగ్గిర ఈ ఆయుధాలున్నాయనే వాళ్ళు జంకుతున్నారు. అందువల్ల ఇది



చాలా కీలకమయిన స్థానం. ఇప్పుడు ఎనిమిది మందున్నారు గదా. మరో పది మందిని రేపట్నుంచి ఇక్కడ వుంచుదాం. రేపు చుట్టుపక్కల వూళ్ళ నుంచి కూడా పీసీలూ, ఎస్సయిలూ వచ్చి మనకి సాయంగా నిలబడతారు. ఈ ఒక్కరాత్రి

జాగ్రత్తగా వుండండి. మనకు అందిన సమాచారం ప్రకారం సీ ఆర్ పీ వాళ్ళు ఇవాళ రేపటిలో ఇక్కడకు అదనంగా రాలేరు. తక్కిన జిల్లాలకు వెళ్ళిపోయారట. పోతే బోర్డరు సెక్యూరిటీ ఫోర్సుని తీసుకు వస్తున్నట్టు అనుమానంగా వుంది. వాళ్ళొస్తే రక్తపాతం కోసమే వస్తున్నట్టు. మనం లొంగన్నాపోవాలి. లేకపోతే



వాళ్ళని చంపుతూ చావన్నా చావాలి. మనమీ ఒక్కరాత్రీ జాగ్రత్తగా వుండి రేపుదయం మన సమ్మెను ఉధతం చెయ్యగలిగితే మనం గెలుస్తాం. రేపటికి రాష్ట్రమంతటా అంటుకుంటుంది. అనుమానం లేదు..."

"దేవుడి దయ వల్ల రాష్ట్రమంతా పాకాలి" అన్నాడు లక్ష్మణరావు.

"సరే. నేను ఇంటికి వెళ్తాను. రెండు ముద్దలు తిని, ఓ గంట కునుకు తీసి నాలుగయ్యేసరికి ఎస్. పీ ఆఫీసు దగ్గరికి వెళ్తాను..."

సైకిలెక్కి లక్ష్మణరావు బృందానికి

దూరంగా వెళ్ళిపోతున్న ప్రకాశరావును చీకటి మింగేసింది.

*　*　*

ఎంతో ఎత్తయిన పైకప్పు. విశాల మైన, శుభ్రమయిన గది. బారెడు వెడల్పున్న ఎత్తయిన కిటికీలు. ప్రాణ సమానంగా ధారాళంగా గాలి. అనంత మయిన చక్కని చల్లని వెలుగు.

డబుల్‌కాట్ మంచం, కుదురైన సుఖ మయిన పరుపు. చాకింటి వాసన వేస్తోన్న పాలతెల్లని పక్క బట్టలు. కొత్త వాసన వేస్తోన్న గలీబులు. మెత్తని దిళ్ళు.

బట్టల స్టాండ్ నుంచి హేంగర్స్‌కు వేలాడుతూ పది జతల టెరీకాట్ దుస్తులు, తళతళ మెరిసే నిలువుటద్దం.

నాలుగు కూరలతో కమ్మని భోజనం.

నెల ముప్ఫయి రోజులూ సుఖంగా జీవించడానికి తగిన జీతం.

పిల్లలతో, భార్యతో సరదాగా కాల క్షేపం చేయడానికి కావలసినంత తీరిక.

"నాన్నా! ఆ సెవెంటీ యం. యం. సినిమా చూద్దాం."

"ఆ కాశ్మీర్ సిల్కు చీర కొందామా నాగూ...?"

"అల్లుడుగారికి ఎల్రక్ట్రానిక్ వాచీ కొందామండీ..."

"అలా కుర్చీలో కూచోవోయ్ లక్ష్మణరావ్."

ఆదివారం శలవు

ఆదివారం శలవు

లక్ష్మణరావుకు మెలకువ వచ్చేసింది. కళ్ళు తెరిచి మళ్ళీ మూసుకున్నాడు.

బాగుంది.

దివ్యంగా వుంది.

కల్లోని ఇంట్లో ఎంతో సుఖంగా వుంది.

కల్లోని జీవితం చాలా తియ్యగా వుంది.

'అలా కూచోవోయ్ లక్ష్మణరావ్' అన్నాడు ఐ జీ మర్యాదగా.

కానీ కలే కదా!

జరిగేది కాదు కదా...

అతను బెల్‌ఫారంకి ఎదురుగా వున్న పచ్చగడ్డి బయలులో పడుకుని వున్నాడు. పక్కనే తుపాకీ వుంది. కళ్ళు తెరిచి చూశాడు. చుక్కలు వెలుగుతూ ఆరుతూ కిందికి చూస్తున్నాయి.

నిద్రగా, నీరసంగా వుంది లక్ష్మణ రావుకు. తల కింద చేతులు పెట్టు కున్నాడు.

పచ్చగడ్డి ఒత్తుగా తడిగా వుంది.

హఠాత్తుగా లక్ష్మణరావులోని పోలీసు అలారం మోగింది.

చెవులు రిక్కించి విన్నాడు.

ఏదో చప్పుడు

ఎవరికీ వినిపించకూడదని చేస్తున్న చప్పుడు.

వెల్లకిలా పడుకునే చేయి రైఫిల్ మీదికి పోనిచ్చాడు. కాళ్ళు దగ్గిరకి లాగి, లేవడానికి వీలుగా మోచేతులు నేలపై ఆన్చాడు.

అతని పక్కనున్న రైఫిల్ పైఎవరిదో బరువైన బూటు పడింది.

"కదలకు..."

ఉత్తరాది వాడెవడో మాట్లాడుతున్న హిందీ.

తలవేపు నుంచి మెరుపులాగ వచ్చిన ఒక వ్యక్తి చేతిలోని తుపాకీ బారెల్ లక్ష్మణరావు కేసి గురిపెట్టాడు.

ఆ చీకటి వ్యక్తి భుజానికి ఆన్చివున్న బట్ ప్లేట్, ఫోర్ సైట్‌కూ, బట్ ప్లేట్‌కూ

కలిపి కట్టి వున్న స్లింగ్, ట్రిగ్గర్ ప్రాంతం నుంచి పైకి లేచిన మ్యాగజైన్. అది మెషిన్‌గన్.

లక్ష్మణరావు కంగారుగా అటూ, ఇటూ చూశాడు.

చుట్టూ వున్న చీకటిని మరింత చిక్కన చేస్తూ మిషన్‌గన్స్ పట్టుకొని వున్నవాళ్ళు అనేకమంది కనిపించారు.

తనకు కన్ను మూతపడిన సమయం ఎంత నష్టదాయకమైనదో తలుచుకోవడానికి లక్ష్మణరావుకు భయం వేసింది.

"హెచ్చరిక ... ఈ ప్రాంతమంతా బోర్డరు సెక్యూరిటీ ఫోర్సు జవాన్‌లతో చుట్టుముట్టబడి వుందని తెలియజేస్తున్నాము. ఆయుధాలు పట్టుకుని ఇక్కడ దాక్కున్న సీ.ఆర్.పీ వారూ, సివిల్ పోలీసులూ వెంటనే లొంగిపోవలసిందిగా హెచ్చరిస్తున్నాం. బోర్డరు సెక్యూరిటీ ఫోర్సు జవానులు చాలా తీవ్రమయిన ఉత్తర్వులు కలిగి వున్నారు. దుందుడుకు పనులకు పోయిన సమ్మెకారులు అనవసరంగా దెబ్బతింటారు గనుక వెంటనే ఆయుధాలతో సహా లొంగిపోవలసిందని ఇందు మూలంగా హెచ్చరిస్తున్నాం" మెగాఫోన్ హెచ్చరిక.

లక్ష్మణరావు పళ్ళు పట పట కొరికి చేతిని తన రైఫిల్ మీదకి పోనిచ్చాడు. అంతవరకు రైఫిల్ మీదవున్న వో బూటు కాలు ఈమారు లక్ష్మణరావు చేతిమీద పడింది.

బాధతో సలిగిపోయాడు లక్ష్మణరావు.

వెనకాల నించున్న వ్యక్తి లక్ష్మణరావు కాలర్ పట్టుకొని లేవదీసేడు.

"లంజకొడుకుల్లారా నాకు రెప్ప పడిపోయిందిరా. లేకపోతే మిమ్మల్నో పదిమందిని సంపిగానీ నేను సావకపోదు్నా" అని లక్ష్మణరావు అరిచాడు.

బి.ఎస్.ఎఫ్ జవాను గన్‌బట్‌తో లక్ష్మణరావు భుజం మీద విసురుగా కొట్టాడు.

* * *

ప్రకాశరావుకి నోరంతా చేదుగా వుంది. నిద్ర పట్టక అతను సిగరెట్ మీద సిగరెట్ పీలుస్తున్నాడు.

తనను వేధిస్తున్న భయాలగురించి చెపుతూనే అతని భార్య నిద్రలోకి జారుకుంది. ముందున్న వీధి గదిలో అతని కూతురు పదేళ్ళ పిల్ల నిద్రపోతోంది.

ఫాను గాలి ప్రాణానికి సుఖంగాలేదు.

కళ్ళు మండుతున్నాయి.

ఆవలింతలు వచ్చి పడుతున్నాయి.

కానీ నిద్ర పట్టడంలేదు ప్రకాశరావుకు.

వీధి తలుపు దడదడ చప్పుడయింది. ప్రకాశరావు చప్పున లేచాడు. మంచం దిగి ముందు గదిలోకి వెళ్ళాడు.

తలుపు మళ్ళీ చప్పుడయింది.

ఆ చప్పుడుకి ప్రకాశరావు కూతురు లేచి కూర్చుంది. 'వస్తున్నా' అని చెప్పి ప్రకాశరావు తలుపు గడియ తీశాడు. తెరుచుకున్న తలుపు పక్కనుంచి వో రివాల్వర్ లోపలికి వచ్చింది.

దాని వెంటనే అది పట్టుకుని డీ.ఎస్.పీ కామేశ్వరరావు, వెనక నలుగురు సీ.ఆర్.పీ. వాళ్ళు.

మంచంమీద కూచుని ఇదంతా చూసిన ప్రకాశరావు కూతురు కెవ్వున కేక వేసింది.

ప్రకాశరావు భార్య కంగారుగాలేచి లైటు వేసింది.

ప్రకాశరావు కామేశ్వరరావుకేసి చూసి

నవ్వేడు. "నేను భయపడిపోవటం లేదు. ఆశ్చర్యమూ లేదు" అన్నాడతను.

"గుడ్! తొందరగా బట్టలు వేసుకో"

"నన్ను అరెస్టు చేస్తే ఉద్యమం ఆగిపోదు"

"ఏది ముందో, ఏది వెనకో అనే మీమాంస లేములే. అన్నీ ఒక్కసారే జరుగుతాయి. నువ్వు గాభరా పడక్కర్లేదు. లాకప్‌లో నీ శిష్యవర్గం అంతా కలుస్తారు. వాళ్ళకి వుపన్యాసం చెప్పు. బట్టలు వేసుకో"

ప్రకాశరావు భార్యవంక చూశాడు "రైట్ రత్నా! నువ్వేం భయపడకు. దీనికి నువు మాత్రం సిద్ధంగా లేవూ?"

బావురుమంది రత్నకుమారి.

* * *

కన్నీళ్ళ పర్యంతం అయ్యాడు నారాయణ.

తీక్షణమైన విద్యుత్‌దీపం వెలుగుతున్న ఆ కటకటాల గదిలో నలభై మంది దాకా పీసీలు వున్నారు.

తెల్లవారుజామున అయిదయింది. కటకటాలు పట్టుకుని అవతల వరండాలోకి చూశాడు నారాయణ.

వరుసగా మూడు లాకప్ రూములున్నాయి.

'మొత్తవందర్నీ మూసేసినట్టున్నారు' అనుకున్నాడు నారాయణ.

వరండాలో కొందరు పీసీలు బోరలు విరుచుకుని తిరుగుతున్నారు.

ఆందోళనకారులంతా కటకటాల వెనక్కి పోయినందుకు వాళ్ళు ఆనందిస్తున్నట్టు స్పష్టంగా తెలుస్తూనే వుంది.

కటకటాల దగ్గిర నిలబడి తలదించి కింద గచ్చుకేసి చూస్తున్నాడు. ఎవరివో బూట్లు. ఎవరో నల్లబూట్ల ఆసామీ కటకటాల అవతల ఆగినట్టుంది.

"నారాయణా..."

ఆ గొంతు గుర్తుపట్టి చటుక్కున తల పైకెత్తాడు నారాయణ.

అవతల నించున్న సుబ్బారావు నారాయణను చూసి జాలిగా నవ్వేడు "నేను చెపితే విన్నావుగావు. కుక్క తోక పట్టుకుని గోదావరిలోకి దిగేసేవు. ఆఖరికి కటకటాల వెనక్కి జేరిపోయావు. మనకి కలిసిరాని సాహసాలకు మనం దిగకూడదని ఆరోజే నీకు నేను చెప్పేను"

నారాయణ మొహం మాడ్చుకున్నాడు "నువు నాకు గురువులాంటోడివనుకున్నాను గానీ నువు నాకు పరమ విరోధివి అని నాకు ఈమధ్యనే తెలిసింది. నువు నాకే కాదు యూనిఫారాల్లో వున్నోడికల్లా నువ్వు ఎనిమీవి. నువు నాకు గురువ్వికాదు. నువు కాశీపతికి శిష్యుడివి"

సుబ్బారావుకు రోషం వచ్చింది "ఎవడో వొకడ్ని. అందుకే నేను కటకటాల బైటున్నాను. నువు లోపల చిక్కడ్డావు. నేను ప్రమోషన్ లిస్టులో వున్నాను. నువు బ్లాకు లిస్టులో వున్నావు. అదే నువు నా శిష్యుడివి కాదన్నానికి గుర్తు. తెలివితక్కువతసం కాకపోతే ఇలాంటివి ఎక్కడ సక్సెసవుతాయి? గంటకూడా పట్టలేదు. గుడారం లేచిపోయింది. ప్రకాశరావు దగ్గర్నుంచి నీదాకా మొత్తవందర్నీ మూసీసేరు. ఇప్పుడు టౌన్‌లోని అన్ని జైళ్ళలోనూ పోలీసులే ఖైదీలుగా వున్నారు. నేను పుట్టి బుద్ధెరిగాక ఇలాంటి వింత వినలేదు. అదీ సంగతి. అయితే నువెం గాభరాపడకు. నీకేం శిక్షవుండదు. బహుశా పనిష్‌మెంట్ డ్రిల్లు చేయించి వదిలేస్తారని అనుకుంటున్నారు. మహా




అయితే నీలాగా చురుకుగా పార్టిసిపేట్ చేసినవాళ్ళకే ట్రాన్స్‌ఫరుంటాది. కానీ మీ గురువుకామాత్రం శిక్ష తప్పదు"

"అవును ప్రకాశరావుగారే నాకు గురువు. నేను ఆయన శిష్యుణ్ని అని చెప్పుకోవటం నాకు గొప్ప"

సుబ్బారావుకి నవ్వొచ్చింది. "జీవితం గురించి నీకెంత తెలుసో మీ గురువుకీ అంతే తెలుసును. దానికి కటకటాల వెనక మీరందరూ సాక్ష్యమే. అసలు సంగతి నాకు తెలుసును. ఐజీ కాడ్నించి నాదాకా, నీదాకా అందరం దొంగలంజకొడుకులవే. అసలు మనుసులందరూ దొంగనాకొడుకులే. సగంమంది జైల్లో వుండవలసినోళ్ళయితే, మిగిలినవాళ్ళు పిచ్చాసుపత్రిలో వుండ వలసినబాపతు. ఆ సంగతి మీ గురువు కంటే నాకు ఎక్కువ తెలుసు. అయితే మీ గురువు నీలాగే మంచోడు. ఎర్రికూపు. నువు చాలా మారిపోయావు. చూస్తుంటే ఈ గొడవంతా నీ మంచికే వొచ్చినట్టు నాకిప్పుడనిపిస్తోంది. ఇదివరకు నీకు ఎర్రబూట్ని చూస్తే ఒకటికయిపోయేది. ఇప్పుడు నీకు ఎర్రబూట్ని చూస్తే కోపం వస్తన్నాది. అది నాకు కనిపిస్తున్న మంచి డెవలప్మెంట్."

"ఛీ ! మీరు నాతో మాట్లాడకండి" నారాయణ సుబ్బారావుని ఏవగించుకున్నట్టు మొహం పెట్టి వెనక్కితిరిగి పోయాడు.

"కోప్పడకు గురూ"అన్నాడు సుబ్బారావు నవ్వుతూ. అంతలో పక్కసెల్ లోంచి సుబ్బారావుని ఎవరో పిలిచారు.

"ఎవర్రా అదీ" అంటూ అతను అటు వెళ్ళాడు. పక్కసెల్ కటకటాల దగ్గిర సుందరయ్య. నలిగిన ఖాకీదిండులాగ వున్నాడతను.

"ఏటి గురూ!ఏటి కావాలి" అడిగాడు సుబ్బారావు.

"కబురు'' అన్నాడు సుందరయ్య కటకటాల మధ్యలో ముఖం పెడుతూ.

ఏటో ఆ కబురు అనుకుంటూ సుబ్బారావు సుందరయ్య దగ్గిరికి చేరేడు.

"ఏమిటి కబురు."

"ఇసుంటా రావయ్యా"

మరికొంచెం దగ్గిరికి జరిగాడు సుబ్బారావు. దగ్గిరగా వచ్చిన సుబ్బారావు మొహం మీద కాండ్రించి వుమ్మేడు సుందరయ్య.

సుబ్బారావు ఏమిఅనకుండా తుడిచేసుకున్నాడు. "దీన్ని ఏడుపుగొట్టి పని అంటారు. ఆడారోల్లు జేసే పని. ఎదవ పని" అని వ్యాఖ్యానించి అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

"దెష్ట లంజికొడుకు. మనవాడ్ని ఎప్పటికీ క్షమించకూడదు. ఈ లంజకొడుకే మనకి వ్యతిరేకంగా సమ్మెలో చేరనివాళ్ళందర్నీ మోబిలైజ్ చేశాడు"

"కుక్కచావు చస్తాడ్లే"

మరోగంట పోయాక లాకప్‌లోవున్న పోలీసులందర్నీ వ్యాన్‌లలోకి ఎక్కించి పరేడ్ గ్రౌండ్స్‌కు తరలించారు.

అప్పుడే పుట్టుకొస్తున్న సూర్యుడి సాక్షిగా పనిష్‌మెంట్ డ్రిల్ ప్రారంభం అయింది.

ఒకరి ఎదురుగా ఒకర్ని నించోబెట్టేరు.

ఒకరి చెంప ఒకరు పగలగొట్టాలి. అదీ ప్లాను.

ముందు సంజీవరావు వంతు వచ్చింది. అతని ఎదురుగా లక్ష్మణరావు నించొని వున్నాడు.

అధికారులు చెప్పినట్టు లక్ష్మణరావుని కొట్టడానికి సంజీవరావు ముందు సందే హించాడు.

కానీ తప్పలేదు.

సాధ్యమయినంత మృదువుగా కొట్టేడు.

"అలా కాదు నే చెప్తాను. నువ్వులేచి ఇక్కడ నించో" అని వో అధికారి లక్ష్మణరావు ఎదురుగా నించున్నాడు. లక్ష్మణరావు ఊపిరి బిగపట్టి నించు న్నాడు. దెబ్బను తట్టుకోవడానికి మాన సికంగా సిద్ధపడి నేలచూపులు చూసేడు.

ఆ అధికారి ఎర్రబూట్లు మెరుస్తు న్నాయి.

దెబ్బ కాచుకోవడానికి సిద్ధంగా వున్నాడు లక్ష్మణరావు.

ఆ అధికారి కుడిచేయి పూర్తిగా చాపి వేగంగా విసిరేడు. గూబ గుయ్‌మంది లక్ష్మణరావుకు. ఆ దెబ్బతో అతను తూలిపోబోయేడు కానీ తట్టుకున్నాడు. అతని ఎడమచెవి వేడెక్కిపోయింది. పిడి కిళ్ళు బిగించి అలాగే నిల్చున్నాడు.

ఆ అధికారి సంజీవరావును ఆ స్థానంలో నించోబెట్టి "కమాన్ నే చూపిం చిన విధంగా కొట్టు" అన్నాడు.

అదేచోట అంత గట్టిగానూ అదే దెబ్బ.

లక్ష్మణరావు కసిగా, పట్టుదలగా, పగగా అంత బాధనీ వోర్చుకున్నాడు.

"ఇప్పుడు నువు"

అతని వంతయింది. లక్ష్మణరావుకు ఏదో అయింది. పెనుబలం అతడిని ఆవ హించింది.

ప్రళయ వేగంతో, పగపగతో, పిచ్చి వెగంతో అతను చేయి విసిరాడు.

దెబ్బతిన్న సంజీవరావు తూలి కింద పడిపోయాడు.




ఇదంతా జరిగిన అయిదురోజులనాడు.

కంట్రోల్‌రూములో లక్ష్మణరావు గార్డు డ్యూటీలో వున్నాడు.

సాయంత్రం అవుతూంది.

బైట రోడ్డు మీద ట్రాఫిక్ గోలగా వుంది.

గాలి బిగబట్టి వుంది.

తుపాకి పక్క తుపాకీలాగ నించుని వున్నాడు లక్ష్మణరావు.

అతని కళ్ళు ఎర్రగా వున్నాయి.

రైఫిల్ పట్టుకున్న చెయ్యి చెమటతో జారుగా వుంది.

కంట్రోలురూము ఆవరణలో మూడు వ్యాన్‌లు విప్పేసిన బళ్ళలాగ వున్నాయి.

కొందరు రిజర్వు కానిస్టేబుల్స్ బూట్లు, టోపీలు వరండాలో వదిలేసి ఆవరణ లోంచి బైటకువెళ్ళి గేటు దగ్గిర గుమి కూడారు.

కుడిచేతిని తుడుచుకోవటానికి రైఫిల్ ఎడమచేతిలోనికి మార్చుకుని మళ్ళీ కుడిచేతిలోకి రైఫిల్ అందుకున్నాడు లక్ష్మణరావు.

అతని బుర్ర దిమ్ముగా ఉంది.

గుండె బరువుగా నెత్తురు కారుస్తున్నట్టు వుంది.

ఉక్కపోస్తోంది.

రోడ్డుమీద ట్రాఫిక్ చప్పుడు రంపపు కోతగా ఉంది.

లంజాకొడుకులు

లంజాకొడుకులు

లక్ష్మణరావు పెదాలమీదనుంచి తిట్లు, రాళ్ళలాగ తూలుతున్నాయి. నీలంరంగు మెక్ కారొకటి కంట్రోల్ రూము గేట్లోంచి వచ్చి ఆవరణలో లక్ష్మణరావుకు అంతదూరాన ఆగింది.

డి.ఎస్.పి కామేశ్వర్రావు అందులో నుంచి దిగాడు. అతను టోపీ చేతిలోనిః తీసుకొని, ఒక చేతితో పాంట్ ఎగలాగ కున్నాడు. తరువాత దర్పంగా కదిలి కంట్రోల్ రూమువైపు అడుగులువేయటం ప్రారంభించాడు.

కామేశ్వరరావు వైపే చూస్తున్నాడు లక్ష్మణరావు. లక్ష్మణరావు దగ్గరకివచ్చి ఆగేడు కామేశ్వరరావు. సెల్యూట్ చెయ్య కుండా కొయ్యబొమ్మలాగ నిలుచున్న లక్ష్మణరావుని చూసి కామేశ్వర్రావుకి ఆశ్చర్యమేసింది.

లక్ష్మణరావు మొహంలోకి చూశాడు.

కొయ్యబొమ్మ కళ్ళలో ఎరుపెరుపు ప్రాణముంది. కళ్ళూ, కళ్ళూ కలుసు కున్నాయి.

కామేశ్వర్రావు ఉలిక్కిపడ్డాడు.

అతనే దృష్టి మరల్చుకున్నాడు గానీ లక్ష్మణరావు కనురెప్పయినా వెయ్యలేదు.

"ఏమిటి అలాగ చూస్తున్నావు... సుపీరియర్స్‌కి సెల్యూట్ చేయకూడదని చెప్పేడా మీ గురువు ?'' అని అడిగాడు కామేశ్వర్రావు.

లక్ష్మణరావు జవాబు చెప్ప లే దు. అలాగే దృష్టి మరల్చకుండా, రెప్ప వాల్చ కుండా చూస్తున్నాడు.

కామేశ్వర్రావుకి జంకుపుట్టింది.
ఏమిటా చూపులు గుచ్చుతున్నట్టు
కత్తులతో పొడుస్తున్నట్టు.
కాటేయబోతున్నట్టు.
ఏమిటా చూపులు.
కామేశ్వర్రావు వళ్ళు జలదరించింది.
గబగబా అక్కణ్నించి కదిలాడు.

కంట్రోల్‌రూం మెట్లెక్కి వరండాలో ప్రవేశిస్తుండగా లోపలనుంచి వస్తూన్న మరో రిజర్వ్ కానిస్టేబుల్ ఎదురయ్యాడు. అనాలోచితంగానే అతని వంక చూసిన కామేశ్వర్రావుకి అదురుపుట్టింది.

అవే చూపులు
అందులో
అవే కత్తులు
జోడుబారుల తుపాకీల్లాగ ఆ రెండు కళ్ళు.



*(ఈ నవలలోని కథ సౌలభ్యత కోసం తెలుగు దేశంలోనే జరిగినట్లుగా వ్రాయబడింది. పాత్రలను కూడా తెలుగువారిగానే పరిచయం చేయటం జరిగింది... అయితే, వాస్తవంలో ఈ కథ తెలుగు దేశానికే పరిమితం కాదు. భారత దేశంలో ఎక్కడనయినా ఈ సంఘటనలు జరిగి ఉండవచ్చు. పాత్రలు ఏ ప్రాంతానికి చెందినవైనా కావచ్చు. ఎందుకంటే ఈ నవలలోని వివరాలలో అధిక భాగం వివిధ దిన, వార పత్రికల నుండి సేకరించిన యదార్థాలే గాని కల్పితాలు కావు.)*

# పాదయాత్ర

పరిగెత్తి పాలు తాగే కంటే నిలబడి నీళ్ళు తాగటం మంచిదన్న సామెత జీనాబాయ్ నావిక్ విషయంలో ఏం పట్టునివ్వలేదు. తెల్లజుట్టుతో, కళ్ళజోడుతో పరమ సాధువులా కనబడే నావిక్‌ని 75 ఏళ్ళ వయసు ఏమీ చేయలేకపోయింది. 548 కిలోమీటర్లు పరిగెత్తి శ్రీనగర్ నుంచి ఛండీఘర్ చేరుకున్నాడు. కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకూ పాదయాత్ర చేయా-




లన్నది ఇతని దృఢ సంకల్పం. జాతీయ సమైక్యతా భావాన్ని చాటి చెప్పే తన ఆశయసిద్ధికోసం ఏప్రిల్ 30వ తేదీన గుజరాత్ రాష్ట్రం నుండి కన్యాకుమారి బయలేరాడు అతను. రోజుకి 30 నుంచి 40కిలోమీటర్లు నడుస్తూన్న నావిక్ 240 రోజుల్లో, అంటె డిసెంబరు 25వ తేదీకి కన్యాకుమారి చేరుకోగలనని నమ్ముతున్నాడు. టెక్స్‌టైల్ సంస్థలో సాధారణమైన ఉద్యోగం చేస్తున్న నావిక్ సైకిల్, బోటు నడపడంలోనూ, ఈత, పర్వతారోహణల్లో నిష్ణాతుడు. మంచి రూపశిల్పి కూడా! నావిక్ కుటుంబంలోని వారందరికీసాహసకృత్యాలపట్ల మక్కువ ఎక్కువ. 1976లో మొట్టమొదటిసారి దండి నుండి పోరుబందరు 23 రోజుల్లో కాలినడకన చేరాడు. వయసు మించినా వృద్ధాప్యాన్ని జయించి పిడిరాయిలా తిరుగుతున్న నావిక్‌ని చూసి అబాల గోపాలం ముక్కుమీద వేలేసుకుంటున్నారు.

# అమ్మకానికో వూరు

'అమ్మబోతే అడవి కొనబోతే కొరివి' అని ఏ వస్తువు కొనడానికైనా వెయ్యి ఆలోచనలు చేయాల్సిన ఈ రోజుల్లో దక్షిణాఫ్రికాలో 'మెడెల్ పోస్' అనే పట్టణం అమ్మకానికి వచ్చింది. ఇల్లయితే ఏదో అప్పో సప్పో చేసి కొనొచ్చు. ఏకంగా పట్టణమే కొనాలంటే మాటలా!

మెడెల్‌పోస్ చెప్పుకోదగ్గంత పెద్ద పట్టణమేమీ కాదు. 50 మీటర్ల పొడవున్న రహదారి, ఓ హోటలు, జనరల్ స్టోర్, గాసోలిన్ స్టేషను, గ్రంథాలయం, రెండు పాఠశాలలు, 40 కుటుంబాలు నివసించేందుకు వీలుగా కట్టిన ఇళ్ళు- ఇదీ ఆ ఊరి స్వరూపం.

ఇక్కడకు రావాలనుకునేవారు మధ్యలో కాల్‌వీనియా అనే చోట ఆగి రోడ్డు మాప్ చూసుకుంటూ రావాలి. మెడెల్ పోస్‌కీ, కాల్‌వీనియాకి మధ్య ప్రాంతం ఇంచుమించు ఎడారిలాగే వుంటుంది. గొంతుక ఎండిపోతున్నా ఒక్క చుక్క నీరు దొరకదు. దూరంగా

వున్న గ్రామం నుంచి నీళ్ళు మోసుకు రావాల్సిందే. కాని మెడెల్ పోస్‌లో మాత్రం జీవనం డల్‌గా వుండదంటారు స్థానికులు. ఇక్కడి పోస్టాఫీసులో వారానికోసారి బట్వాడా వుంటుంది. క్రీడా రంగ ప్రియులకు మంచి టెన్నిస్ కోర్టు వుంది. గతంలో జరిగిన వార్షిక పోటీల్లో వీరు రన్నర్స్‌గా మిగిలినా మంచి ఆట గాళ్ళుగా పేరు పొందారు. "ప్రపంచం మొత్తంలోకి ఇది చాలా ఆరోగ్యవంతమైన స్థలం. టి. వి. లేకపోయినా మాకు 'బోర్' కొట్టదు" అంటాడో ప్రముఖుడు.




పేరంట్, స్టీన్‌కాంప్ అనే ఇద్దరూ మెడెల్ పోస్ పట్టణ యజమానులిప్పుడు. ఎందుకో గానీ వీరీ పట్టణాన్ని 83 వేల అమెరికన్ డాలర్లకి అమ్మేయదల్చుకున్నారు.

బేరెంట్ పట్టణ మేయర్‌గా, ఉపాధ్యాయుడిగా, కార్య నిర్వాహకుడిగా వ్యవహరిస్తుంటాడు. నగరం విలాసాలకి దూరంగా ఉండటం వల్ల పెద్ద ఖర్చేమీ ఉండదు. ఏది కావాలన్నా సమిష్టిగా కష్టపడతారు. కాబట్టి ఆడుతూ పాడుతూ పనిచేస్తూ అలుపూ సొలుపూ లేకుండా రేపటి కోసం వెతకక్కర్లేకుండా కాలం గడిపేస్తున్నారిక్కడి వాళ్ళు.

# సైన్సు గారడీలు

ఇంతవరకూ గుండె మార్పిడి గురించే విన్నాం గాని ముందు ముందు ఏకంగా గుండెను, ఊపిరితిత్తులను ఒకేసారి తొలగించి వేరే వాటిని అమర్చే రోజులు రానున్నాయి. శాన్ ఫ్రాన్సిస్కోలో డాక్టర్ బ్రూస్ రిట్జ్ ఆధ్వర్యంలో కొన్ని కోతుల మీద పరిశోధన జరిగింది. గుండె, ఊపిరితిత్తులు ఏకకాలంలో మార్చబడిన కొన్ని కోతులు ఆపరేషన్ జరిగిన చాలా నెలల వరకూ ఆరోగ్యంగా వున్నాయి. ఇవి విజయవంతమయితే మరో రెండేళ్ళలో మనషుల మీద కూడా ప్రయోగాలు ప్రారంభమవుతాయి. ఏకకాలంలో గుండె, ఊపిరితిత్తుల మార్పిడి గుండె జబ్బువల్లన ఊపిరితిత్తులు దెబ్బతిన్న వారికి చాలా లాభకరంగా వుంటుంది లేదా రెండు ఊపిరితిత్తులూ మరేదన్నా కారణం వలన తీవ్రమైన వ్యాధికి గురైనప్పుడు కూడా ఉపయోగకరంగా వుంటుంది.

అయితే ఊపిరితిత్తుల కేన్సర్ వచ్చినవాళ్ళకి గుండె, ఊపిరితిత్తుల మార్పిడి మంచిది కాదట. సాధారణంగా కేన్సర్ ఒక లంగ్‌కే వస్తుంటుంది. దీన్ని సాధారణమైన ఆపరేషన్‌తో నివారించ వచ్చు. అదీగాక ఈ రోగులకు వాడే కొన్ని మందులు మార్పిడి జరిగిన అవయవాలను శరీరం వ్యతిరేకించేలా చేసి కేన్సర్‌ను శరీరంలోని ఇతర భాగాలకు త్వరగా వ్యాపింప చేసే

అవకాశం వుంది. వ్యాధిగ్రస్తమైన ఊపిరి తిత్తులతో బాటు గుండెను కూడా తొలగించడం చాలా సులభం. శ్రమ కూడా తక్కువ. గుండె, ఊపిరితిత్తుల మార్పిడి జరిగిన 10 కోతుల్లోనూ ఐదు శస్త్రి చికిత్స అనంతరం 312 రోజులు బ్రతికాయి. మార్పిడి చేయబడిన అవయవాలు మామూలుగానే పనిచేశాయి.

గతంలో 38 మందికి ఊపిరి తిత్తుల మార్పిడి శస్త్రిచికిత్స జరిగింది. కాని ఇద్దరు మాత్రమే మూడు నెలలకన్నా ఎక్కువ బ్రతికారు. కాని 10 నెలలకి మించి ఎవరూ బ్రతకలేదు. గుండె, ఊపిరితిత్తులను




ఏకకాలంలో మార్చిన సంఘటనలు మూడు జరిగాయి. కాని ముగ్గురూ 23 రోజుల లోపలే మరణించారు.

# వింత శబ్దాలు

మీరు ఒంటరిగా ఇంట్లో ఉంటారు. రాత్రి సమయం. ఎక్కడో సన్నగా ఏడుస్తున్న ధ్వని, అడుగుల సవ్వడి, మెట్ల మీదనుంచి ఏదో దొర్లిపడ్డ శబ్దం...దాంతో భయంపుట్టి ఆంజనేయ దండకం చదు




వుతూ కళ్లు విప్పుతారు. హఠాత్తుగా మీ ఎదురుగా గోడకు వేలాడుతున్న కేలండర్ కింద పడుతుంది అకారణంగానే. వీటికంతటికీ కారణం ఇంటి సీలింగ్, నీటి పైపులు, దూలాలు, గది ఉష్ణోగ్రత అంటున్నారు శాస్త్రజ్ఞులు. నీటి పైపులు శబ్ద ప్రకంపనాన్ని రెట్టింపు స్థాయిలో శక్తివంతంగా ప్రసారం చేస్తాయి. ఇవే కాక సీలింగ్ వల్లకూడా శబ్దాలు అత్యధిక స్థాయిలో ప్రతిధ్వనించి మనకి భయాన్ని కలిగిస్తాయి. గది ఉష్ణోగ్రత ఎక్కువైనపుడు పుస్తకంలో పేజీలు నెమ్మదిగా వాటంతటవే తెరుచుకుంటాయి. టేబిల్ సొరుగులు కూడా కిదుల్తూ మనకి భయాన్ని కలిగిస్తాయి. వేడివల్ల కర్ర దూలాలు సంకోచ వ్యాకోచాలకి లోనై శబ్దాన్ని పుట్టిస్తాయి. కాబట్టి దయ్యమో, భూతమో ఇంట్లోకి ప్రవేశించిందని మనం ఏ భూతవైద్యుడి దగ్గరికీ అలా జరిగినపుడు పరిగెత్తఖర్లేదు.

# సెక్సు మార్పిడి

"అయ్యయ్యో బ్రహ్మయ్యా! ఈ బుల్లోడే గనుక బుల్లెమ్మయితే ఎంత గుమ్ముగా వుండేదయ్యా!"... అన్నాడో సినీకవి. కానీ పుంస్త్వ మోహన రూపుడుగా మారిన ముద్దుగుమ్మ ఉదంతం ఇటీవల చండీఘర్లో తెలియవచ్చింది.

1974 మార్చి నెలలో ఫ్రాన్స్‌లో జరిగిన మొట్టమొదటి ప్రపంచ హాకీ కప్పు టోర్నమెంటులో భారతదేశ ప్రతినిధిగా



పాల్గొన్న బలజిత్ భట్టీ అనే 24 ఏళ్ళ యువతి ఇపుడు గుర్తుపట్టలేకుండా మారిపోయింది. అప్పట్లో ఐదడుగుల ఆరంగుళాలున్న భట్టీ సెక్సు మార్పిడితో ఇంకో నాలుగు అంగుళాలు పెరిగింది. అయినా ఆమెను బాగా ఎరిగిన పాత స్నేహితులు అబ్బాయిగా పిలవడానికి ఇష్టపడ్డం లేదు. తల్లి ఇప్పటికీ ఆమెను గుడ్డీ అనే పిలుస్తోంది. భట్టీకి బాల్యంనుంచీ మగదుస్తులు ధరించడం, అబ్బాయిల్తో కలిసి తిరగడం, ఆటలాడ్డం చాలా యిష్టంగా వుండేది. కానీ ఆడపిల్ల కావటంతో ఆ కోరికను బైట పెట్టే ధైర్యం లేకపోయింది. ఇది పని కాదనుకుని 1976లో తనంతట తనే ఇంగ్లండు వెళ్ళి సెక్స్‌మార్పిడి శస్త్రచికిత్స చేయించుకుంది. 1977లో మరో రెండుసార్లు శస్త్ర చికిత్స చేయించుకున్నాక పూర్తిగా అబ్బాయిగా మారిపోయింది.

ఇంగ్లండు హాకీ క్లబ్బులో మగవారితో హాకీ ఆడింది. అబ్బాయిగా మారి భారతదేశం వచ్చేముందు కొన్నాళ్ళు మెకానికల్ సెట్టర్‌గా బర్మింగ్ హాంలోని ఓ ప్రైవేట్ కంపెనీలో పనిచేసింది. 1979లో లండన్ స్కూల్ ఆఫ్ యాక్టింగ్‌లో నటనలో డిప్లొమా పొందిన భట్టీకి హిందీ చలనచిత్ర రంగంలో హీరోగా స్థిరపడాలని వుంది. భట్టీ రాసిన ఉత్తరానికి జవాబిస్తూ "అవకాశం వచ్చినప్పుడు తప్పక పిలుస్తాను. నీ కథ చాలా ఆసక్తిదాయకంగా వుంది" అన్నాట్ట ఒకప్పటి ప్రఖ్యాతహీరో సునీల్ దత్. లూధియానా స్కూల్లో చదువుతూ ఆడపిల్లల ప్రతినిధిగా హాకీ ఆడిన భట్టీ ఇప్పుడు అందమైన ఆడపిల్లల వంక సమ్మోహనంగా చూస్తున్నాడంటే సృష్టికర్త బోర్డు వెనక్కి తిప్పేసుకోవచ్చేమో!

# మూషిక మందిరం

రాజస్థాన్‌లోని బికనీరుకి 30 కిలోమీటర్ల దూరంలో వున్న దేశ్‌నోక్ గ్రామంలో కార్ని మాత దేవాలయంవుంది. బికనీరుని పరిపాలించిన రాజుల కులదేవత అందులో ప్రతిష్ఠింపబడివుంది. అయితే అక్కడికొచ్చే యాత్రికులకి ఆశ్చర్యం కలిగించే విషయం ఆ

దేవాలయంలో వేల సంఖ్యలో దర్శాగా తోకలూపుకుంటూ తిరిగే ఎలుకలూ, వాటి చుట్టూ అల్లబడిన చిత్రవిచిత్ర గాథలూ! పూజ ప్రారంభమయ్యేసరికి వందల సంఖ్యలో ఇవి దేవాలయంలో గోడలమీంచి పాక్కుంటూవచ్చి చక్కగా తీర్థ ప్రసాదాల్ని ఆరగిస్తాయి. అక్కడి కొచ్చే భక్తులు కొందరు వాటిలోని తెల్ల ఎలుకల జంటకోసం ఎదురు చూస్తూ కూర్చుంటారు. వాటి దర్శనం శుభం చేకూరుస్తుందని వాళ్ళ నమ్మకం. స్థాని కులు ఈ మూషిక సైన్యం తమకు గర్వ కారణంగా భావిసారు. గతంలో ప్లేగు వ్యాధి ఆ దగ్గర్లోనేవున్న బికనీరుని సర్వ నాశనం చేసినప్పటికీ తమ ఛాయల క్కూడా రాలేదని గొప్పగా చెప్పుకుంటూ ఉంటారు. 153 ఏళ్ళు బతికిన ఐదు శతాబ్దాల నాటి కార్నిమాత కూడా చాలా అద్భుతాలు చేసిందని చెప్పుకుంటుంటారు. 400 ఏళ్ళ నాటి ఈ దేవాలయం కార్ని మాత చేత అనుగ్రహించబడిన ఒకఅంధ శిల్పి నిర్మించాడని ప్రచారంలో వుంది.

ఇదేకాక, బికనీర్లో ఆసియాలోకెల్లా పెద్దదైన ఒంటెలఫారం ఉంది. బికనీరుకు 30కి.మీ. దూరంలో వున్న గజ్నేర్‌లోని జూ,అధునాతన హోటల్‌గా మార్చిన అల నాటి రాజభవనం మొదలైనవి ఉన్నాయి. 16వ శతాబ్దంలో నిర్మించబడ్డ కోట, మ్యూజియంలలో బికనీర్ రాజవంశానికి సంబంధించిన ఎన్నో రికార్డులు భద్రంగా వున్నాయి.

## కాశ్మీర ప్రేమ

మనుషుల్ని కట్టిపడేసేది డబ్బే అను కుంటే చాలా తప్పనీ, ప్రేమ ప్రభావం ఈ కలికాలంలో కూడా వుందనీ నిరూ పించే సంఘటనలు జరుగుతున్నాయి.

1974లో డయానాకిడ్ అనే 26ఏళ్ళ ఆస్ట్రేలియా దేశస్థురాలు కాశ్మీర్ చూసేం దుకు వచ్చింది.ఆమె బసచేసిన శ్రీనగర్ లోని 'సన్‌షైన్ ఇన్న్' అనే బోట్‌హవుస్ యజమాని 29 ఏళ్ళ అబ్దుల్ అజీజ్ నిజాయితీ, అమాయకత్వం, పరోపకార గుణం ఆమెని బాగా ఆకర్షించాయి. ఫలి తంగా అజీజ్‌తో సాన్నిహిత్యం పెర గడం, ప్రేమ ముదరడం జరిగి పెళ్ళి వరకూ దారితీసింది.

పెళ్ళయ్యాక డయానా తన పేరు మయిమోనాగా మార్చుకుని తన దేశపు అలవాట్లని, పద్ధతులని వదిలేసుకుని పక్కా కాశ్మీరీ వనితలా తయారై ఇస్లాం మతం పుచ్చుకుంది. ఒక ముస్లిం మతాధికారి సాయంతో నమాజ్ నేర్చుకుని ఖురాన్ చదువుతూ, అరబిక్ భాషని నేర్చు కుంటూ కొద్ది కాలంలోనే పూర్తిగా మారిపోయి అన్నింటా కాశ్మీరు వనితగా మారిపోయింది.

డయానా మంచి చిత్రకారిణి. వాళ్ళ బోట్‌హవుస్‌ని చాలా చక్కగా అలంక రించి విదేశీ టూరిస్టులని తన మాటకారి తనంతో ఆకర్షిస్తోందిప్పుడు. బోట్ హవుస్‌లో తామిద్దరే యజమానులూ, వంట వాళ్ళూ, నౌకర్లూనూ.

అక్షరం ముక్క రాని అజీజ్‌తో పట్టభద్రురాలైన డయానా ఎటువంటి కలతలూ, కన్నీళ్ళూ లేకుండా చక్కగా సంసారం చేస్తూంది. వాళ్ళకిప్పుడు ఓ రెండేళ్ళ కొడుకు. అజీజ్ భార్య మాటకి

# మానవులు దానవులు

పండంటి జీవితం పగిలిపోయింది. వయసెంతోలేని భర్త అకస్మాత్తుగా మరణించాడు. పసిబిడ్డను అక్కున చేర్చుకుని పగిలే గుండెలను చేతబట్టుకుని, నిస్సహాయంగా మిగిలిపోయిందామె. అందమైన ఇల్లు, కారు, ఫారిన్ టివి, ఫ్రిజ్, మిక్సర్ అన్నీ ఉన్నా, అవి పోయిన మనిషి ప్రాణానికి సాటి రాగలవా? కానీ... వాస్తవంలో ఇరుగు పొరుగు పెద్దలు చేసిందేమిటి? ఆ భార్యాబిడ్డలు పోగొట్టుకున్నదానికన్నా, వారి వద్ద మిగిలి ఉన్నవే ముఖ్యం అనుకునే ఆ మనుషులు ఎలాంటి వాళ్ళు? వాటిలో ఏ వస్తువును ఎవరు స్వంతం చేసుకోవాలనే పరుగు పందెంలో వారు ఎలా ప్రవర్తించారు?

మానవ మనస్తత్వానికి ప్రతీకగా ప్రఖ్యాత హిందీ రచయిత శాలాదూషే రచించిన "సంతాపం" కథను 'విపుల' నవంబర్ సంచికలో చదవండి...

మరే పత్రికా అందజేయని విభిన్న భాషల విశిష్ట కథలకు వేదిక 'విపుల'. కథలతో పాటు రెండు రంగుల చిత్రాలు, నవ్వించే కార్టూన్లు, జోకులు, ప్రపంచ పర్యటన చేయించే విచిత్ర విశ్వ విజ్ఞానం 'విపుల' ప్రత్యేకతలు. ఇవన్నీ కూడా కేవలం రెండు రూపాయలకే మీకు అందుబాటులో ఉన్నాయి.




ప్రతి నెలా 1వ తేదీకి వెలువడే

విశ్వకథా విపంచి

# విపుల

132 పేజీలు

రెండు రూపాయలే

విలువ ఇస్తూ, గౌరవంగా చూసుకుంటాడు. త్వరలో ఆస్ట్రేలియా వెళ్ళి కొన్నాళ్ళు హాయిగా గడిపి వద్దామనుకుంటున్న యీ జంటకి తమ బోట్ హౌస్‌కు వున్న యాత్రికుల ఒత్తిడి వల్ల కుదరకుండా వుంది.



కాశ్మీర్‌లో వీళ్ళేకాక, ఇలా విదేశీయుల్ని పెళ్ళాడినవారు చాలామంది వున్నారు. వారిలో కొందరు తమ విదేశీ భార్యలతో వాళ్ళ దేశాలకిపోయి అక్కడి పరిస్థితులతో రాజీ పడలేక వాళ్ళ నొదిలేసి రావటమో, వాళ్ళే వీళ్ళని వదిలేయడమో జరిగాయి. అయినా కొన్ని జంటలు సుఖంగా వున్న దాఖలాలూ వున్నాయి.

## వృక్షాలింగనం

"మీకు మరింత బలం కావాలనుకుంటున్నారా? అయితే వెంటనే వెళ్ళి మీ పెరట్లో వున్న జామచెట్టునో, ములగ చెట్టునో అమాంతం కౌగిలించుకోండి. చెట్టు వలన మనకి చాలా వుపయోగాలున్నాయి. ప్రాణాధారమైన ఆక్సిజన్ ఇవ్వడమే కాకుండా, నేలని సారవంతం చేసి ఇంకా ఎన్నో విధాలుగా వుపయోగిస్తుంది" అంటున్నాడు 92 ఏళ్ళ డాక్టర్ రిచర్డ్ బేకర్. ఈయన తన జీవితాన్ని ప్రకృతిని పరిశీలించడంలోనే గడుపుతున్నాడు. కొన్నాళ్ళ కిందట అతను తీవ్రంగా జబ్బుపడ్డాడు. పెరట్లో వున్న 'సెదార్' వృక్షంతో కాస్సేపు గడిపేసరికి కొన్నాళ్ళలోనే వ్యాధినయమై బాగుపడ్డానని అంటున్నాడు. ఈ వయసులో కూడా పిడిరాయిలాగున్న డాక్టర్ బేకర్ వృక్ష సంపదని అభివృద్ధి చేయమని అన్ని దేశాలకూ విజ్ఞప్తి చేస్తున్నాడు.

ఇతను పూర్తిగా శాఖాహారి. పచ్చి కాయగూరలు, పళ్ళు ఎక్కువగా తింటుంటాడు. వాటిని ఉడికించటంగానీ, నూనెలో వేచటంగానీ చేయకూడదంటాడు. మన దేశానికి ఎన్నోసార్లు వచ్చి వృక్ష సంపద నభివృద్ధి చేసే విషయంలో ప్రభుత్వానికి సలహాలిచ్చాడు.

ప్రపంచానికి అవసరమయ్యే ఆక్సిజన్‌లో సగభాగం అమెజాన్ నదీతీరంలో వున్న అడవుల్లోని వృక్షాల ద్వారానే సరఫరా అవుతోందని ఇతని వాదన.

గత 60 ఏళ్ళుగా వృక్ష సంపదని నాశనం చేయొద్దని ప్రభుత్వాన్ని, వ్యవసాయదారుల్ని అరిస్తున్నాడీ వృక్ష ప్రియుడు. 'మేన్ ఆఫ్ ట్రీస్' అనే సంస్థని స్థాపించి తన ఆశయం నెరవేర్చుకునేందుకు చాలా పాట్లు పడ్డాడు.

భవిష్యత్తులో ప్రకృతి సజీవంగా ఉండాలనుకుంటే వృక్ష సంపద పెంపొం

దించాలని, ప్రస్తుత పరిస్థితి చూస్తుంటే భవిష్యత్తు నిర్జీవంగా మారబోతోందని వాపోతున్నాడీయన. ఇతని కృషి ఫలితంగా ఆఫ్రికాలోని సహారా ఎడారిలో 2,000 చదరపు మైళ్ళ భాగమంతా వృక్షాల్తో నిండిపోయింది. ప్రతిరైతు తన పొలంలో 22 శాతం భూమిని చెట్ల కోసం కేటాయించాలని ఇతని కోరిక. రాజస్థాన్ రైతులకు తమ తమ పొలాల్లో ఐదో భాగం రకరకాల చెట్లని పెంచడం కోసం ప్రత్యేకించమని సలహా ఇచ్చేడు. ఇతని సూచనల్ని రష్యా, న్యూజిలాండ్,



కెనడా దేశాల వ్యవసాయదారులు అమలు జరిపి సత్ఫలితాలు పొందుతున్నారు.

బొంబాయి చాలా ఇరుకు నగరమని, కనీసం ఐదేసి కిలోమీటర్ల వైశాల్యంలో రకరకాలైన చెట్లని పెంచితే గాని నగరానికి అందం రాదని, కలుషిత వాతావరణం పోయి శుభ్రమయిన గాలి లభ్యం కాదని ఇతను ఎన్నోమార్లు అధికారులకు సలహా ఇచ్చేడు. వృక్షాల ప్రాధాన్యతని, వాటిని పెంచే ఆవశ్యకతని వివరిస్తూ 30 పుస్తకాలు రాసాడీయన. అవి అనేక భాషల్లోకి అనువదింపబడ్డాయి.

యువతరం మీద తన ఆశాభావాన్ని వ్యక్తపరుస్తూ, వాళ్ళ హయాంలో తన ఆశయం సఫలమవుతుందని ఆశిస్తూ 'చిల్డ్రన్ ఆఫ్ గ్రీన్ ఎర్త్' అనే సంస్థని స్థాపించి అందులో చేరిన యువకులకి పాఠాలు చెప్తున్నాడు.

## ఆడాళ్ళ మగాళ్ళ

మొదటిసారిగా తల్లిదండ్రులు కాబోతున్న వారికి పుట్టబోయేది మగబిడ్డా, ఆడ బిడ్డా అనేది గొప్ప సస్పెన్స్. అయితే కెనడా, ఫ్రాన్స్ శాస్త్రజ్ఞులు ఇహ ముందా సస్పెన్స్ లేకుండా కొన్ని మార్గాలు సూచిస్తున్నారు.

గర్భం ధరించడానికి ఆరు వారాల ముందు నుంచీ క్రమబద్ధంగా ఒకే రకమైన ఆహార పదార్థాలు తింటుంటే పుట్టబోయేది ఆడో, మగో చెప్పొచ్చంటున్నారు. కెనడాకి చెందిన డాక్టర్ లారెన్స్ ఈ విషయమై చాలా పరిశోధనలు చేసేడు. వివిధ వయస్సుల 216 మందిని ఎంచుకుని అందులో 175 మందికి ఒకే రకమైన ప్రత్యేక ఆహారాన్నివ్వగా వాళ్ళందరూ తమ తమ అభిరుచులకనుగుణంగానే బిడ్డల్ని కన్నారు. ఫ్రాన్స్ దేశస్థుడైన డాక్టర్ స్కాక్‌వస్కీ ఎంచుకున్న 31 మందిలో 27గురు తాము కావాలనుకున్న వారినే కన్నారు. మగబిడ్డ కావాలనుకునే తల్లులు తమ ఆహారంలో ఉప్పు, పొటాషియం ఎక్కువగా వాడాలని, ఆడబిడ్డ కావాలనుకునేవారు తమ ఆహారంలో కాల్షియం, మెగ్నీ

షియం ఎక్కువగా వుండేటట్లు చూసుకోవాలని, ఈ రెండూ కూడా పాలు, పాలతో చేయబడే పదార్థాలన్నింట్లో పుష్కలంగా దొరుకుతాయని వీరి అభిప్రాయం.

తము తీసుకునే ఆహారాన్ని తామే నిర్ణయించుకుని ఆ విధంగా పద్ధతి ప్రకారం నడుచుకుంటే కావల్సిన బిడ్డల్నే కనొచ్చునంటున్నారు.

మగబిడ్డ కావాలనుకునేవాడు తీసుకోవల్సిన ఆహారం గురించి చెప్తూ పళ్ళు, పళ్ళ రసాలు, గుడ్లు, పందిమాంసం,




వెన్న, బ్రెడ్, అరటిపళ్ళు, బ్లాక్ టీ (టీ డికాక్షన్) విధిగా వాడాలనీ, ఆడబిడ్డ కావాలనుకునేవారు బ్రెడ్, ఉప్పులేని పదార్థాలు, బీన్స్, పాలు, జున్ను, చికెన్ మొదలైనవి తప్పనిసరిగా వాడాలని డాక్టర్ లారెన్ మహాశయుడు స్పష్టంగా చెప్తున్నారు. ఇవన్నీ ఒక క్రమపద్ధతిలో, నిర్ణీత సమయాల్లో, తగిన పరిమాణంలో తినాలట.

అసలు ఈ ఆహార పదార్థాలు ఏ విధంగా శిశువు లింగభేధాన్ని నిర్దేశిస్తాయో స్పష్టంగా తమకే తెలీటంలేదని, కానీ రసాయనిక మార్పులవల్ల పిండంలో క్రోమోజోముల మార్పిడికి ఇవి సహకరిస్తాయని వారు అంటున్నారు. ఈ ప్రయోగాలు ఇంకా కనీసం ఓ వెయ్యి జంటలపై కూడా చేసి ఫలితాలు పరిశీలించి గాని సంతృప్తి చెందలేమంటున్నారు.

## గరుడసేవ

చిలక పలుకడం, జోస్యం చెప్పడం అందరికీ తెలిసిందే! కానీ చిలక జాతికి చెందిన కొన్ని రంగురంగుల చిలకలు అంధులకు దారి చూపించడం వినడానికి విడ్డూరంగాను, చూడ్డానికి వింతగాను వుంటుంది. హాలీవుడ్ చిత్ర నిర్మాతలకు శిక్షణ నిచ్చిన పక్షులను సప్లైచేసే రే బెర్విక్ ఈ ఘనకార్యాన్ని చేపట్టాడు. హాలీవుడ్‌లో ఓ అంధురాలు అంతవరకూ తనకు దారి చూపి మార్గదర్శకంగా వుండే కుక్క చనిపోవడంతో దిక్కుతోచక విలపిస్తుంటే చూసిన 'రే' ఈ నిశ్చయానికి వచ్చాడు. కుక్కకంటే ఎక్కువ కాలం జీవించేవి, ఎక్కువ తెలివితేటలు కలవి, తక్కువ ఆహారంతో ఎక్కువ పని చేసి పెట్టే చిలకల్ని తన ప్రయోగాలకి ఎన్నుకున్నాడు. కేవలం రెండు నెలల శిక్షణతో ఒక పక్షి గుడ్డివారికి దివ్యంగా దారి చూపగలదని నిరూపించాడు. వాటికి రెండు రకాల శిక్షణ ఇస్తారు. ఒక తరహా శిక్షణలో చక్రమున్న చేతికర్ర లాంటిదానికి ఓ చిన్న గంట అమర్చబడి వుంటుంది. దాని అడ్డ కడ్డీ మీద నిలబడిన చిలక కుడిపక్కకు వెళ్ళాల్సి

నపుడు కుడివైపు, ఎడంపక్కకు వెళ్లాల్సి నపుడు ఎడంవైపు మొగ్గుతుంది. ఆగా లంటే గంట మోగించే బటన్‌ను నొక్కు తుంది. రెండోరకంలో నడుము బెల్టుకి అమర్చుకుందుకు వీలుగా, చిలుక విశ్రాంతిగా కూర్చగలిగేలాగ అడ్డంగా ఓ కర్ర వుంటుంది. చిలుక ముక్కుకి అందుబాటులో వుండేలా సదరు వ్యక్తి మెడలో వేలాడే గొలుసు ఉంటుంది. కుడిపక్కకి తిరగాలంటే చిలుక కుడి కాలితో పొట్టమీద తడుతుంది. ఎడం పక్కకి తిరగాలంటే ఎడమ కాలితో చేతి





మీద తడుతుంది. ఆగాలంటే మెడలోని గొలుసును గట్టిగా లాగుతుంది— నీలం, ఆకుపచ్చ రంగుల్లో పొడవైన తోకలతో వుండే ఈ చిలుకలు అన్ని రంగుల్ని సులభంగా పోల్చుకోగలవనీ, సూక్ష్మ గ్రాహులనీ, ఎక్కువ దూరం చూడగలవనీ అంటాడు రే. కాకపోతే ఉన్నదల్లా ఒకటే చిక్కు. ఒక్కో కుక్క ఖరీదు 200 నుంచి 300 డాలర్లుంటే ఈ చిలుక వెల 1000 నుంచి 1500 డాలర్లుంది. దాంతో ధైర్యంచేసి కొనడానికి ఎవరూ ముందుకి రావడంలేదు. బ్రెయిలీ సంస్థ వారు ఇతర అంధ సహకార సంస్థాధి కారులతో ఈ విషయమై చర్చలు కొన సాగిస్తున్నారు.

# పెళ్ళంటే..

'రష్యా దేశస్థుణ్ణి పెళ్లాడ్డం మా చిరకాల వాంఛ. అదే మాకున్న చివరి కోరిక కూడా...' అని అమెరికా అమ్మాయి లంతా కళ్ళలో మెరుపులు కురిపిస్తు న్నారు. అలాగే రష్యన్ స్త్రీలు కూడా పెళ్ళయితే చేసుకుంటున్నారుగానీ ఈ దేశం నుంచి ఆ దేశానికి వెళ్ళడానికి అను మతి సంపాదించేసరికి పిల్లలు పుట్టుకొచ్చే ట్లున్నారు.

ప్రతిఏటా ఈతరహా పెళ్ళిళ్ళు 60కి పైగా జరుగుతున్నాయని అమెరికా అధికార నివేదిక వల్ల తెలుస్తోంది. అమెరికా, రష్యా రాజకీయాలు పెళ్ళి వ్యవహారాల్ని క్లిష్ట తరమైనా చేస్తాయి, అసంభవమైనా చేసాయి. ఐరినా అనే రష్యన్ యువతి 1974లో ఓ అమెరికా ప్రొఫెసర్‌ని పెళ్లాడింది. కానీ అమెరికాలో వున్న భర్తను కలుసుకుందుకు సోవియట్ ప్రభుత్వ అనుమతిని పొందటానికి ఇప్ప టికీ ప్రయత్నిస్తూనే వుంది.

వివాహాలు ఏర్పాటు చేయడంలోగానీ, జీవిత భాగస్వాముల్ని అమెరికా తీసుకు వెళ్ళడంలోగానీ ఐదు శాతం వివాహాలకు సోవియట్ ప్రభుత్వ అవరోధాలు కలుగు తున్నాయని అమెరికా అధికారులు అంచనా వేస్తున్నారు.

స్వల్పకాలిక చదువుల, శిక్షణల నిమిత్తం తమ దేశానికి వచ్చి స్నేహం

పంచుకున్న విద్యార్థులు, వ్యాపారస్థులు, ఇంజనీర్లు మొదలైన వారెవరైనా మనసుకు దగ్గరయితే అమెరికా దౌత్యులు రష్యా వాళ్ళని పెళ్ళి చేసుకోడానికి చాలా సుముఖత చూపిస్తున్నారు. కానీ రష్యన్ యువతులు ఎక్కడోగాని అంత సుముఖంగా వున్నట్లు కనిపించడంలేదు.

మాస్కోలో వున్న అమెరికన్లుమాత్రం సోవియట్-అమెరికా వివాహాలకి పూర్తి వ్యతిరేకులు. రష్యన్లని పెళ్ళాడ్డానికి సిద్ధపడే వారిని జాగ్రత్తగా వుండమనీ, రష్యన్లు దేశం నుంచి బైటికి పోయేందుకు




కావాల్సిన వీసా పట్ల వున్న మక్కువ నిజానికి పెళ్ళి పట్ల వుండదనీ హెచ్చరిస్తున్నారు.

వ్యక్తుల గురించి పూర్తి వివరాలు తెలీకుండా రష్యన్లను తమలో కలుపుకోడానికి దేశరక్షణ దృష్ట్యా అమెరికన్ భద్రతా కార్యాలయాధికారులు తటపటాయిస్తున్నారు.

సోవియట్ - అమెరికా పెళ్ళిళ్ళ విషయమై రాజకీయంగా ఓ నిబంధన ప్రవేశపెట్టారు. దాని ప్రకారం పెళ్ళాడదల్చుకున్నవారు మాస్కో నగరాధికారుల వద్ద పెళ్ళి సంగతి నమోదు చేసుకోవాలి. ఆ తర్వాత 30నుంచి 90రోజుల దాకా వేచి వుండాలి పెళ్ళిరోజు కోసం. ఈ లోపల అమెరికన్ల వీసా టైం అయిపోతే అతనుగానీ, ఆమెగానీ దేశం వదిలేసి పెళ్ళి కోసం మళ్ళీ రష్యా రావడానికి దరఖాస్తు పెట్టుకోవాలి.

ఈ ప్రకారం 1972లో నిశ్చయమైన కాథీ అనే అమెరికా అమ్మాయి పెళ్ళి కోసం రష్యా రావడానికి కొన్ని సంవత్సరాలు ప్రయత్నించి విసిగి వేసారిపోయింది. ఇంతలో అతగాడు పెట్టుకున్న విన్నపాల్ని ఐదేళ్ళ తర్వాత మన్నించి సోవియట్ అధికారులు 1977లో అమెరికా వెళ్ళడానికి అనుమతించారు.

అలాగాక సోవియట్‌లోనే పెళ్ళి చేసుకున్నాగాని దేశం వదిలి బైటికి వెళ్ళడానికి 3,4 నెలలు వేచి వుండటం తప్పనిసరి. అంతవరకూ రష్యా జీవిత భాగస్వామి కోసం అమెరికన్ భర్తో భార్యో రోజులు లెక్కబెట్టుకుంటూ రష్యాలో వుండిపోవడం సాధ్యం కాని పనే.

అదే ఏ మిలిటరీలోనో, భద్రతా దళంలోనే వున్నవారైతే, కుటుంబ సభ్యులు పెళ్ళికి ససేమిరా అన్నప్పుడు పెళ్ళి చేసుకుని అమెరికా వెళ్ళిపోవడమన్నది ఎట్టి పరిస్థితుల్లోనూ అసంభవం.

ఏ గొడవా లేకుండా ఈ పద్ధతికి స్వస్తి చెబితే బావుండునని అమెరికా అధికార, అనధికారులు భావిస్తున్నారు.

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD/402

everset/80/PP/333 tl




# పిల్లలు ముద్దు ముద్దుగా నవ్వుతూ మురిపిస్తారు

వారికి ప్రీతితో యివ్వండి

## పార్లే గ్లూకో_ మజా రుచితో, ఎంతో శక్తితో




పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్ మజా రుచులతో నిండి పుష్టినిచ్చే లక్షణాలుగలది.

## పార్లే గ్లూకో

భారతదేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్



వరల్డ్ సెలక్షన్ బహుమతిని గెలుచుకున్నది